THE LARGEST CIRCULATED TELUGU EDUCATIONAL MONTHLY




# ఐక్య ఉపాధ్యాయ

మార్చి, 2000 రూ. 10/-




యుటిఎఫ్ రజతోత్సవ, 8వ విద్యా వైజ్ఞానిక మహాసభలు

ఆంధ్రప్రదేశ్ ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్
రజతోత్సవాలు, 8వ విద్యా-వైజ్ఞానిక మహాసభలు
మహా ప్రదర్శన
19-1-2000 కాకినాడ

ఆంధ్రప్రదేశ్ ఐక్యఉపాధ్యాయ ఫెడరేషన్ అధికార పత్రిక

























మహిళా సదస్సు అధ్యక్షులు శ్రీమతి సి.కమలకుమారి. 2.తూ॥గో॥ జిల్లా పరిషత్ చైర్‌పర్సన్ శ్రీమతి వంగా గీత 3. ఐ.డి.ఎల్. కళాశాల కరస్పాండెంట్ డా॥ చిరంజీవినికుమారి. 4. లోక్‌సత్తా అధ్యక్షులు డా॥ ఆలూరి విజయలక్ష్మి. 5.సాంస్కృతిక సభ అధ్యక్షులు శ్రీ ఎన్.రామకోటేశ్వరరావు. 6.ఆం.ప్ర. మహిళా సంఘ ర్యదర్శి శ్రీమతి టి.పావని. 7.కాకినాడ మున్సిపల్ చైర్‌పర్సన్ శ్రీమతి ప్రభాజోసఫ్. 8.సాంస్కృతిక ప్రదర్శనల ప్రారంభకులు ప్రముఖ సినీనటులు శ్రీ జె.వి.సోమయాజులు.

IKYA UPADHAYA

SUBSCRIPTION 50-00
SINGLE COPY 5-00

IKYA UPADHYAYA
Gaganmahal Road No.7
Domalguda
Hyderabad - 500029

*phone : 7677242 Fax : 7650366*

# ఐక్య ఉపాధ్యాయ

(విద్యావిషయక మాసపత్రిక)



సంపుటి - 26 | ఫిబ్రవరి, మార్చి 2000 | సంచిక 2,3

## పాతిక వత్సరాల యు.టి.యఫ్. ఉద్యమ ప్రభంజనం

యు.టి.యఫ్. రజతోత్సవాలు, 8 వ విద్యావైజ్ఞానిక మహాసభలు, కాకినాడలో కలకాలం నిలిచిపోయే కమనీయదృశ్యం, మధురానుభూతి. 15 వేల మందికి పైగా ప్రతినిధులతో, అలలు అలలుగా పొంగి అవధులు లేనిజనసంద్రంగా. సాగిన ఆమహాసభలు యు.టి.యఫ్. ఉద్యమ చరిత్రలో సువర్ణాధ్యాయంగా నిలచిపోతుంది.

యు.టి.యఫ్. ఆవిర్భావమే ఒక చారిత్రక అవసరం, దాని కర్తవ్యాలు అట్టివే, ప్రాంతీయ విద్వేషాలు బద్దలుకొట్టి, కేడరు వైరుధ్యాలు ప్రక్కనబెట్టి, మానేజిమెంటు విభేదాలు సరకుచేయక సమైక్య ఉద్యమ నిర్మాణానికి సాగిపోయిన సుదినం 1974 ఆగష్టు 10.

అమరజీవి చెన్నుపాటి ఆశయాల బాటలో, అధ్యయనం, అధ్యాపనం, సామాజిక స్పృహ తన లక్ష్యాలుగా : హక్కులు బాధ్యతలు రెండు నేత్రాలుగా, అవి నీతికి వ్యతిరేకంగా రాజీలేని పోరాటంచేయడం తన జీవన విధానంగా, అకడమిక్ విషయాలపై తన దైన శైలిలో కృషి చేస్తూ, సప్తస్వరాలు తన అంగాలుగా, ఈ పాతిక సంవత్సరాలు అభ్యుదయ పథంలో సాగిన మహోజ్వల పయనం దానిది.

1974 రాజమండ్రి ప్రథమ మహాసభలో ఉద్యమ నిర్మాణానికి బీజాలు వేసి, ఖమ్మం మహాసభలో రాష్ట్రానికంతా విస్తరించి, భీమవరం, విజయవాడ, నెల్లూరు, గుంటూరు, ఒంగోలు మహాసభలలో అంతకంతకు విస్తరించి లక్షసభ్యత్వానికి దగ్గరగా ఎదిగి కాకినాడ రజతోత్సవ మహాసభలలో తన విశ్వరూపం ప్రదర్శించింది.

అత్యవసర పరిస్థితులలో కూడా అవకాశవాద విధానాలకు తావివ్వక, నిత్యం ఉపాధ్యాయుల పక్షాననే నిలిచి, పోరుబాటలో పయనించి, ఉపాధ్యాయులకు తిరుగులేని హక్కులు సాధించి, వారి హృదయాలలో శాశ్వత స్థానాన్ని పొంది అతి పెద్ద సంఘంగా ఎదిగింది., ప్రచురణలనూ పత్రికనూ అదేబాటలో పయనింపజేసి ఉపాధ్యాయుల ప్రశంసలు పొందింది. నెల్లూరు నుండి కాకినాడ వరకు సాగిన పతాకయాత్రలు, పతాకావిష్కరణలు, ప్రారంభసభ, విద్యాగోష్టి, ప్రజాచైతన్యసదస్సు సాహిత్యసదస్సు, మహిళాసదస్సు, దేనికదే ప్రత్యేకతగల్గి, ప్రతినిధులను అలరించినయ్.

ప్రతినిధుల సభలో నివేదికలు, తీర్మానాలు, పాతికేళ్ళుగా ఉద్యమానికి నేతృత్వం వహించిన నాయకులకు అభినందనలు, కమిటీల ఏకగ్రీవ ఎన్నికలు, అత్యంత ఉత్సాహ పూరితంగా ఆనందోత్సాహాల మధ్య జరిగాయి. అవి కలికితురాయిగా ప్రకాశించాయి.

మహా సభలకే గర్వకారణం "ఉపాధ్యాయుల మహాప్రదర్శన" నేల యీనినట్లు నింగిపొంగినట్లు కాకినాడ వీధులలో కదలి తరంగాలుగా ఉప్పొంగుతూ అవధులు లేని రీతిలో సాగిన ఆమహాప్రదర్శన పురజనులను సంభ్రమాశ్చర్యాలలో ముంచి, కార్యకర్తలను ఆనందాబ్ధిలో ఓలలాడించింది.

మహాసభలకే మకుటాయమానం అన్ని వేలమంది ప్రతినిధులకు, పచ్చని ఆకులో వెచ్చని భోజనం పిండివంటలతో వడ్డించిన తీరు "నభూతోనభవిష్యత్" గా భాసిల్లింది. ఆహ్వానసంఘ ఏర్పాట్లు అందరిని అలరించగా, తూర్పుగోదావరి జిల్లా కార్యకర్తల దీక్షా; దక్షతలు అందరిని ఆకట్టు కున్నాయి.

అధ్యాపకలోకం, అశేష ప్రజానీకం, ఆహ్వానసంఘకృషిని అనితరసాధ్యమని వినుతించారు. జిల్లాలోనే నిధులు సేకరించి మహాసభలు జయప్రదం చేసిన తీరును ప్రస్తుతించారు. ఉద్యమపరంగా మాఅభినందనలు కూడా తెల్పుకొటున్నాం. రజతోత్సవ స్ఫూర్తితో ప్రగతి పథంలో ఉద్యమాన్ని నడుపుతామని విన్నవించుకొంటున్నాం.

# వార్తా ప్రపంచం

## కేంద్ర బడ్జెట్‌లో భారాలు

2000-2001 కేంద్ర బడ్జెట్ ఆర్థిక మంత్రి యస్వంత సిన్హా ప్రవేశపెట్టారు. రు. 1,11,275 కోట్ల లోటుతో ఫిబ్రవరి 29 న ఆయన బడ్జెట్ ప్రవేశ పెట్టారు. సహస్రాబ్ది తొలి బడ్జెట్ సామాన్యుని నడ్డి విరిచేదిగావుంది. ఎక్సైజ్ సుంకాల పెంపు ద్వారా రు. 3,500 కోట్ల రూపాయిలు ప్రజల పై భారాలుమోపారు. ఎరువుల ధరలు 15 శాతం, కిరసనాయిలుపై 5 వాతం, బియ్యంపై కిలోకు అదనంగా రు. 1-60లు, పంచదారపై కిలోకు రూపాయి పెంచారు.

ఉద్యోగులపై అదనపు రాయితీలు యివ్వకపోగా, ప్రావిడెంటు ఫండు వడ్డీ రేటు మాత్రం, 12 శాతం నుండి 11 శాతానికి తగ్గించారు. సెల్ ఫోన్లు, కంప్యూటర్లపై కష్టమ్స్ సుంకం తగ్గించారు. ఖాయిలా పడ్డ ప్రభుత్వ రంగ పరిశ్రమలు మూసివేస్తామని ప్రకటించారు. మొత్తం పన్నుల రూపేణా రు. 5,800 కోట్లు పజలపై భారం మోపారు.

గ్రామీణ ప్రాంతాలలో 25 లక్షల ఇల్లు కడతామని, 75 లక్షల మందికి "కిసాన్" క్రెడిట్ కార్డులు యిస్తామని చెప్పారు. రక్షణ రంగానికి రు. 58,587 కోట్లు కేటాయించారు. 10 సంవత్సరాలలో పేదరికాన్ని పూర్తిగా తగ్గిస్తామని చెప్పారు. మౌళికరంగాలైన రోడ్లు, పోర్టులు, టెలికం, రైల్వేలు, ఎయిర్ వేస్ మరింత అభివృద్ధి చేస్తామని చెప్పారు.

## నాలుగు రాష్ట్ర అసెంబ్లీల ఎన్నికలు

**హర్యానా :-** హర్యానా ముఖ్యమంత్రిగా శ్రీ చౌతాలా కురుక్షేత్రంలో ప్రమాణ స్వీకారం చేశారు. అధికారపక్షమైన కాంగ్రీఘోరంగా ఓడిపోయింది. బి.జె.పి బయటనుండి సపోర్టు యిచ్చింది. 18 వ ముఖ్యమంత్రిగా చౌతాలా ప్రమాణ స్వీకారం చేశారు. ఆయన 5 సార్లు రికార్డు స్థాయిలో ముఖ్యమంత్రిగా చేశారు.

**మణిపూర్ :-** మణిపూర్ ముఖ్యమంత్రి గా శ్రీ నిపమాచసింగ్ ప్రమాణ స్వీకారం చేశారు. మణిపూర్ కాంగ్రెస్ 23, ఫెడరల్ పార్టి 6, మణిపూర్ పీపుల్ పార్టి 3, ఆర్‌జె.డి. ,జె.డి.యు, మద్దతుతో 39 అయింది.

**ఒరిస్సా :-** బి.జె.పి. నాయకుడు శ్రీ నవీన్ పట్నాయక్ ముఖ్యమంత్రిగా ప్రమాణ స్వీకారం చేశారు. బి.జె.డి, కి 68 బి.జె.పి. కి 38, కాంగీ 26 సీట్లు వచ్చాయి. కాంగీ అధికారం కోల్పోయింది.

**బీహార్ :-** ఆర్.జె.డి. నాయకురాలు శ్రీమతి రబ్రీ దేవి ప్రమాణ స్వీకారం చేశారు. అంతకుముందు గవర్నర్ పిలుపుపై ముఖ్యమంత్రి గా ప్రమాణం చేసిన కేంద్రమంత్రి నితీష్‌కుమార్, శాసనసభలో బలం నిరూపించుకోలేక రాజీనామా చేశారు. శ్రీమతి రబ్రీకి కాంగీ మద్దతు తెలిపింది. ఆర్.జె.డి. 123, సి.పి.యం(ఐ) 2 కాంగీ 23, జె.ఎం.ఎం.12, సి.పి.ఐ 5, సి.పి.ఐ(ఎం.ఎల్) 6, బి.యస్.పి. 5, ఇండిపెండెట్లు ఇతరులు 25, బి.జె.పి 67, సమతా పార్టి 34, జె.డి.(యు) 20, మొత్తం 325 మంత్రి వర్గంలో 80 మందికి పైగా వున్నారు.

## రాష్ట్రబడ్జెట్ అసెంబ్లీలో ప్రతిపాదన

రాష్ట్ర అసెంబ్లీలో మార్చి 23 న ఓటాన్ అకౌంట్ బడ్జెట్ ఆర్థిక మంత్రి శ్రీ యనమలరామకృష్ణుడు 283 కోట్ల లోటుతో ప్రవేశ పెట్టారు. ఇది ఆరు నెలలకు వర్తించుతుంది. పూర్తి స్థాయి బడ్జెట్ తరువాత ప్రవేశ పెడతామని చెప్పారు. అప్పుడు ఎన్ని వడ్డింపులు వుంటాయో చూడాలి.

గత సంవత్సరం రు. 2725 కోట్లు గా వున్న రెవిన్యూలోటు ఈ సంవత్సరం 2102 కోట్లకు తగ్గించగలమన్నారు. గత ఏడాది రు. 5993 కోట్లు వున్న ద్రవ్యలోటు రు. 5402 కోట్లకు తగ్గించగలమని చెప్పారు. ఎన్ని చెప్పినా 6 మాసాల బడ్జెటులో 283 కోట్ల లోటు ప్రజలు నెత్తిన పడే పన్నుల భారం అర్థమవుతూనే వుందని అంటున్నారు.

## విశాఖ ఉక్కు ఆంధ్రుల హక్కు

32 మంది ప్రాణత్యాగంతో విశాఖ ఉక్కు ఫ్యాక్టరి ఆంధ్రులు సాధించుకున్నారు. అది దినదిన ప్రవర్ధమానమై 18 వేలకార్మికులతో నడుస్తున్నది. తగు లాభాలు ఆర్జిస్తున్నది కూడా అయితే స్టీలు ప్లాంటు నిర్మాణంలో ప్రభుత్వం తాత్సారం చేసిన కారణంగా నిర్మాణ వ్యయం పెరిగి, ప్రభుత్వం అదనంగా యిచ్చినదిగ్రాంటుగా కాకుండా అప్పుగా యిచ్చినట్లు చూపిస్తూ, దానిపై వడ్డీ వసూలు చేస్తున్న కారణంగా, వచ్చే లాభం పోయి నష్టం కనపడుతున్నది.

దేశ ప్రయోజనాల రీత్యాను, ప్రజల ప్రయోజనాల రీత్యాను. స్వావలంబన రీత్యాను, ఉక్కుకై దిగుమతులపై ఆధారపడకుండా వుండేందుకు, కేంద్ర రాష్ట్రప్రభుత్వాలు పునరాలోచన చేయాలని, ప్రయివేటు వ్యక్తు లకు అమ్మివేసే ఆలోచన విరమించాలని ప్రజలు ఆందోళన చేస్తున్నారు.

స్టీలు ప్లాంటుకు వున్న అప్పులు ఈ క్విటీగా మార్చాలి. సెయిల్ పునరుద్ధరణకు మూడు వేలకోట్ల రూపాయిలు ప్యాకేజీకి అంగీకరించిన కేంద్రప్రభుత్వం, విశాఖ స్టీలు ప్లాంటు విషయమై తాత్సారం చేయడం అన్యాయం.

## భగ్గు మన్న గ్యాసు - కిరోసిన్ ధరలు

కొంతకాలంగా ప్రభుత్వం బడ్జెటులో కాకుండా విడిగా పన్నులు పెంచడం నేర్చుకున్నది. గ్యాసు ధర 151-60 నుండి 225/- కు కిరోసిన్ రు. 2-67 నుండి రు. 5-36 కు పెరుగుతుంది.

వీటిపై సబ్సిడియిస్తున్నా మని ప్రభుత్వం తప్పుడు ప్రచారం చేస్తున్నది. వీటిపై దిగుమతి సుంకం 40 శాతం వేసి, 20 శాతం సబ్సిడి యిస్తున్నామని ప్రచారం చేస్తున్నారు. ఆయిల్ పూల్ ఖాతా అంటూ గందరగోళం సృష్టిస్తున్నారు. శ్రీ పి.వి. నరసింహారావు టైంలో ఆడబ్బు ప్రభుత్వం వాడుకొని, దానిని ప్రజలపై రుద్దిన విషయం తెలుసు.

# 25 వసంతాల త్యాగాల ఫలితం సహస్రాబ్దిలో రజతోత్సవ మహోదయం

తూర్పు గోదావరి జిల్లాకార్యకర్తలు 1999 మే నెల 15 వ తేదీ నుండి మండు వేసవిని సైతం లెక్కచేయక రాష్ట్రనాయకత్వంతో 5 బ్యాచీలు గా జిల్లా నలుమూలలా పర్యటించి 15 లక్షల వరకు పద్దులు వేయించారు. అది రాష్ట్రవ్యాప్తంగా పత్రిక యు.టి.యఫ్. వార్తలలోను ప్రచారంపొంది, అన్ని జిల్లాలలోను విరాళాల కార్యక్రమం జయప్రదమైంది.

శ్రీ వై.డి. రామారావు ఆహ్వానసంఘ అధ్యక్షులుగా శ్రీ డి. రామిరెడ్డి సహాధ్యక్షులుగా, శ్రీ ఎ. వెంకటస్వామి ప్రధాన కార్యదర్శిగా, శ్రీ జి. చిట్టిబాబు కోశాధికారిగా జిల్లాలోను పలువురు ప్రముఖులు విద్యావేత్తలు, రాష్ట్రవ్యాప్తంగా ఉన్న యు.టి.యఫ్. కార్యకర్తలు 375 మందితో ఆహ్వాన సంఘం ఏర్పడింది.

అందరూ వారందరూ అహోరాత్రులు కృషిచేసి 30 లక్షలకు పైగా జిల్లాలోనే సేకరించి, దానితోనే రజతోత్సవ కార్యక్రమాలు జయప్రదంగా నిర్వహించారు. వాలంటీర్లగా తమ కార్యకర్తలకు శిక్షణ యిచ్చి, అన్ని విధాల రజతోత్సవాలు, 8 వ విద్యా, వైజ్ఞానిక మహాసభలు జయప్రదం చేసి తమ దీక్షా దక్షతలు చాటారు. అందరి హర్షమోదాలు అందుకున్నారు.

రాష్ట్రవ్యాప్తంగా అన్ని జిల్లాలు అదే రీతిలో స్పందించి రాష్ట్ర కేంద్రానికి రూ. 8,49,000 లు అందించి, మరొక 20 లక్షల వరకు సేకరించి మండల, పట్టణ జిల్లా రజతోత్సావాలు నిర్వహించారు.

## ఉద్యమ సందేశం అందిస్తూ సాగిన పతాక యాత్రలు

నెల్లూరులో పతాక యాత్ర జనవరి 16 న 50 మందితో ప్రారంభమయింది. 5 వ మహాసభ పతాకంతో వారు పెన్నదాటి ఒంగోలులో 7 వ మహాసభ పతాకం 10 మందితో రాగానే కలుపుకొని, గుంటూరులో 6వ మహాసభ పతాకం 20 మందితో వారికి తోడైనారు. ఆరాత్రి కృష్ణ దాటి విజయవాడలో విశ్రమించారు. 18 వ తేది 4 వ మహసభ పతాకాన్ని విజయవాడలో కలుపుకొని ఏలూరు వచ్చి ఖమ్మం నుండి వచ్చిన 2 వ మహాసభల పతాకాన్ని 100 మందితో కలపుకొని భీమవరం నుండి వచ్చిన 3 వ మహాసభ పతాకంతో 200 మందిని కలుపుకొని ఊరేగింపుగా జయజయ నినాదాలతో రాగా దానిని తోడ్కొని తణుకులో భోజనం చేసి, అఖండగోదావరి దాటి 1వ మహాసభల పతాకంతో 100 మందిని రాజమండ్రిలో కలుపుకొని, ఊరేగుతూ సామర్లకోట చేరి రాత్రికి అక్కడ విశ్రమించి 18 వ తేది ఉదయానికి కాకినాడ మహాసభల ప్రాంగణానికి ఏడు మహాసభల పతాకాలు ఏ తెంచాయి. 8 వ పతాకం మహాసభల ప్రాగంణంలో తోడైంది.

## ఉత్సాహంతో జరిగిన యు.టి.యఫ్. సభలు

కాకినాడ పట్టణం అరుణ తోరణాలతో ఎరుపెక్కింది. శ్రీ వత్సావాయి సూర్యనారాయణరాజునగర్ ప్రధాన ద్వారం శోభాయమానంగా అలంకరించబడింది. అమర వీరుల పేర్లతో, చెన్నుపాటి, మైనేని, సుబ్బరాజు, నాదెళ్ళ, గంగిశెట్టి, అమ్మిరాజు మొ॥ ద్వారాలు స్వాగతం పలుకగా, కందుకూరి , గురజాడ, నన్నయ, పిఠాపురం రాజా ద్వారాలు పట్టణం అన్ని ప్రాంతాలలో అమర్చబడి అందరిని ఆకట్టుకున్నాయి.

ముందు తాపేశ్వరంనుండి వచ్చిన రజతోత్సవ జ్యోతిని శ్రీ బి. సత్యనారాయణ గారు అందివ్వగా శ్రీ ఎ. వెంకటస్వామిగారు అందుకున్నారు.
మొదటి మహాసభల పతాకాన్ని శ్రీ. టి. అన్నవరం అందివ్వగా శ్రీ ఎ. వెంకటస్వామి , రెండవ మహాసభల పతాకాన్ని శ్రీ జియావుద్దీన్ అందివ్వగా శ్రీ యన్. నారాయణ, మూడవ మహాసభల పతాకాన్ని శ్రీ పి. సోమరాజు అందివ్వగా, శ్రీమతి సి. కమల కుమారి, నాల్గవ మహాసభల పతాకాన్ని శ్రీ పి. వేంకటేశ్వరరావు అందివ్వగా శ్రీసుభాచంద్రబోసు 5 వ మహాసభల పతాకాన్ని శ్రీ పి. బాబుల రెడ్డి అందివ్వగా శ్రీ యం. రామకోటేశ్వరరావు, 6వ మహాసభల పతాకాన్ని శ్రీ యన్. .కోటేశ్వరరావు అందివ్వగా శ్రీ యన్.ఎ.కె. దత్తు, 7వ మహాసభల పతాకాన్ని శ్రీ కె. వెంకట్రావు అందివ్వగా, శ్రీ డి.. రామిరెడ్డి, 8వ మహాసభల పతాకాన్ని శ్రీ .బి. జీవులు అందివ్వగా శ్రీ కె. బ్రహ్మాజీరావు అందుకొని ప్రతిష్టించిరి. తాపేశ్వరం నుండి వచ్చిన రజతోత్సవ జ్యోతి పతాకాల నడుమ ఠీవిగా కొలువు తీరింది.

జాతీయ పతాకాన్ని జిల్లా కలెక్టరు శ్రీ .సతీష్ చంద్రగారు, ఉద్యమ పతాకాన్ని జిల్లా సీనియర్ నాయకులు, శ్రీ పి. బి. ముత్తారావు గారు ఆవిష్కరించిరి. అమర వీరులకు రాష్ట్ర సెక్రటేరియట్ శ్రద్ధాంజలి ఘటించింది.

ప్రారంభ సభకు సభికులను వేదిక పైకి రాష్ట్రప్రధాన కార్యదర్శి శ్రీ ఎ. వెంకటప్వామి ఆహ్వానించిరి. రజతోత్సవ ప్రదాన్యత వివరించి ప్రథమ మహాసభ రాజమండ్రిలో 1974 లో చేసిన తీర్మానానికి 25 సంవత్సరాలు అయినా నేటికి మోక్షం కలుగలేదని, అది రాజమండ్రిలో నాడు కట్టిన రోడ్ కం రైలు బ్రిడ్జికి కందుకూరి వీరేశలింగం పేరుపెట్టాలని చేసిన తీర్మానమే అని చెప్పిరి.

శ్రీ డి. రామిరెడ్డి అధ్యక్షత వహించుతూ వ్రాత నివేదిక చదివిరి. ఆహ్వాన సంఘ అధ్యక్షులు శ్రీ వైడి. రామారావు స్వాగతోపన్యాసం చదివి ప్రతి నిధులను సాదరంగా ఆహ్వానించిరి. (ఈ రెండిటి నివేదకలు పూర్తి పాఠం వేశాము) శ్రీ కడియం శ్రీ హరి (విద్యాశాఖమాత్యులు) మహాసభలను ప్రారంభిస్తూ, అందరికి విద్య అందరిది బాధ్యత అని, రాష్ట్రంలో సంపూర్ణ అక్షరాస్యత సాధించడానికి అందరు సహకరించాలని కోరిరి.

ముఖ్యఅతిధిగా విచ్చేసిన లోక్‌సభ స్పీకరు శ్రీ జి.యం.సి. బాలయోగి మాట్లాడుతూ సమాజం గౌరవంఇచ్చే వ్యక్తి ఉపాధ్యాయుడు మాత్రమే అని, అలాగే ఉపాధ్యాయుని బాధ్యత కూడా చాలవుందని, రైల్వే మంత్రి గారితో మాట్లాడి రాజమండ్రి రోడ్ కం రైలు బ్రిడ్జికు వీరేశలింగంగారి పేరు పెట్టేలా చూస్తానని, క్రమ శిక్షణ నైతిక విలువలు లేని చదువు సమాజానికి ఉపయోగపడదని విశాల భారతదేశంలో మంచి విద్యా విధానం అందించినప్పడే అందరిలో సోదరభావం పెంపొందుతుందని చెప్పారు.

ఉపాధ్యాయులకు ఓరియంటేషన్ తరగతులు పెట్టాలని, విద్యారంగంలో కొన్ని సంస్కరణలు అవసరమని, ప్రభుత్వాలు ఉపాధ్యాయుల సమస్యలు పరిష్కరించినప్పడు మాత్రమే ఉపాధ్యాయులు మరింత ఉత్సాహంగావని చేయగల్గుతారని, ఈ 25 సం॥రంలలో యు.టి.యఫ్ . చేసినకృషి తక్కువకాదని, మీరు రజతోత్సవ చిహ్నంగా కాకినాడలో ఏదైన ఏర్పాటు చేస్తే నాసహకారం వుంటుందని చెప్పారు.

రాష్ట్రసహకార శాఖామాత్యులు శ్రీ చిక్కాల రామచంద్రరావు మాట్లాడుతూ ఉపాధ్యాయుని అందరు గౌరవించాలని, విద్యారంగానికి వెచ్చించే నిధుల కనీస సదుపాయాలకే చాలవని, రాష్ట్రంలో అక్షరాస్యత తక్కువగా వుంది అందరికి విద్యఅందించడం ప్రభుత్వ బాధ్యత, విద్యావిధానాలు నైతిక విలువలు అందించాలని అది మన భాధ్యత అని చెప్పిరి.

శ్రీ కడియం శ్రీ హరిగారు యు.టి.యఫ్. మహాసభల సందర్భంగా ప్రచురించిన ప్రజాశక్తి ప్రత్యేక సంచికను ఆవిష్కరించిరి. శ్రీ చిక్కాల రామచంద్రరావు గారు యు.టి.యఫ్ ప్రచురించిన మన ఉద్యమనిర్మాతలు అను పుస్తకం ఆవిష్కరించిరి. శ్రీ యం. జె. మాణిక్యారావుగారు మైనేని కథల సంపుటి ఆవిష్కరించిరి.

శ్రీ డి. ఆర్. కె. రెడ్డి వ్యవస్థాపక గౌరవాధ్యక్షులు డి.ఎల్. ఆర్. కాలేజి. జి. మామిరాడ వారు అందజేసిన విరాళం రూ లక్ష శ్రీ ఎ. వెంకటస్వామి, శ్రీ జి. చిట్టిబాబుగారలు స్వీకరించిరి. వారు మాట్లాతూ బ్రతకటానికి పనికి వచ్చే విద్యను సమజానికి యివ్వాలన్నారు. మంత్రులు, రాజకీయనాయకులు చేపట్టే విషయాలు అమలు జరిపితే బాగుంటుందన్నారు. ఉపాధ్యాయులు సమాజ పురోభివృద్ధికి పాటుపడాలన్నారు.

శ్రీ ఎ. వేంకట స్వామి రాజమండ్రి రైల్ కం రోడ్ బ్రిడ్జిపై తీర్మానం ప్రవేశపెడుతూ " నవయుగ వైతాళికుడు, సంఘ సంస్కర్త, శతాధిగ గ్రంధకర్త కందుకూరి వీరేశం లింగం పేరు రోడ్ కం రైలు బ్రిడ్జికి పెట్టాలనే తీర్మానాన్ని ప్రవేశపెట్టారు.

విద్యను ప్రాధమిక హక్కుగా గుర్తించాలన్న తీర్మానాన్ని శ్రీ యన్. నారాయణగారు ప్రవేశపెట్టారు. అందరికి విద్య అనే తీర్మానాన్ని శ్రీ కె. జోజయ్యగారు ప్రవేశపెట్టారు. పై మూడు తీర్మానాలు ఏకగ్రీవంగా సభ హర్షధ్వానాలతో ఆమోదించింది.

శ్రీ .పి. బి. ముత్తారావు ఉద్యమ పతాకం గురించి, ఉద్యమం గురించి, జాతీయ పతాకాన్ని ఆవిష్కరించిన శ్రీ సతీష్ చంద్రగారు బాలకార్మిక వ్యవస్థ గరించి సందేశం యిచ్చిరి. విద్యాశాఖా మాత్యులు శ్రీ కడియం శ్రీ హరిగారు యు.టి.ఎఫ్. పాటల కేసెట్ అవిష్కరించిరి.

శ్రీ యస్. యం. కొండయ్య (ప్రాథమిక విద్యాకేంద్రం) మాట్లాడుతూ 1990 లో తయారు చేసిన సిలబసు ప్రాథమిక పాఠశాల ఉపాధ్యాయులకు, తెలియకపోవడం వలన ఉపాధ్యాయులు తమకు తోచింది చెప్పారు. సంపూర్ణ అక్షరాస్యత సాధించాలంటే 1,2 తరగతుల సిలబస్ ఉపాధ్యాయులకు అందించాలి. సరైన పద్ధతులలో చదువులు అబ్బేలా చూడాలి అని చెప్పిరి. శ్రీ కె. బ్రహ్మాజీరావుగారు వందన సమర్పణ చేసిరి.

## ఎగ్జిబిషన్ల ప్రారంభం

తర్వాత మధ్నాహ్నం 1.30 కి ఎగ్జిబిషన్లు ప్రారంభించబడ్డాయి. సైన్సు విభాగం ప్రాంతీయ సంయుక్త సంచాలకులు డా॥ కె. నాగేశ్వరరావు, ఆరోగ్య విభాగం జిల్లా ఆరోగ్యఅధికారి డా॥ ఎం. చెంద్రమౌళీశ్వరరెడ్డి, చిత్ర కళావిభాగం జిల్లా ట్రజరీ అధికారి శ్రీ కె. వి.వి. ఎన్.ఎస్. శ్రీ నివాసరావు, హస్తకళావిభాగం జిల్లా పరిషత్ సి. ఇ. ఓ. శ్రీ బాబూరావు, బోధనోపకరణముల విభాగం జిల్లా విద్యాశాఖాధికారి శ్రీ సి..ఎ.వి. ప్రసాద్, వస్తు ప్రదర్శన విభాగం, లోకల్ ఫండ్ ఆడిట్ ఆఫీసరు శ్రీ బి. విశ్వనాధం గార్లు ప్రారంభించిరి.

## ప్రతినిధులను చైతన్య పరచిన విద్యా సదస్సు

మధ్యాహ్నం గం॥ 3-00 లకు కె. జోజయ్యగారి అధ్యక్షతన విద్యాసదస్సు జరిగింది. అధ్యక్షులు విద్యారంగంలో వస్తున్న మార్పులు నిరశిస్తూ యు.టి.యఫ్. విధానాలు వివరించారు.

చదువు సంధ్యల పుస్తకాన్ని శ్రీ కడియం శ్రీహరిగారు, చేసిచూద్దాం పుస్తకాన్ని ప్రొ॥డి. నర్సింహారెడ్డిగారు, ఏమిటి తెలుసుకుందాం పుస్తకాన్ని శ్రీ.డి. రామిరెడ్డిగారు, పరిణామక్రమములో విద్య శ్రీ యం. జె. మాణిక్యరావు గార్లు ఆవిష్కరించిరి.

ప్రొఫసర్ ఆర్.వి. ఆర్. చంద్రశేఖర్ (అంబేద్కర్ యూనివర్సిటీ మాజీవైస్‌చాన్సలర్) విద్యాగోష్టిని ప్రారంభిస్తూ యు.టి.యఫ్ దేశంలో విద్యావిధానానికి దోహదపడుతుందని ఆశాభావాన్ని వెలిబుచ్చారు. 14వ అంతస్థులోవున్న లెక్చరర్స్ ప్రొఫెసర్లకన్నా, క్రిందిస్థాయినుండి పునాదులు వేస్తున్న మీకు మేమేమి చెప్పగలమన్నారు. సమస్యలు లేకుండా ప్రపంచం వుండదు. ప్రభుత్వ పాఠశాలలకు మరింత ప్రోత్సాహం యివ్వాలన్నారు.

హైదరాబాదుయూనివర్సిటిప్రొఫెసర్ శ్రీ డి. నరసింహారెడ్డి మాట్లాడుతూ మన వునికికి విద్య అవసరమని, సామాజిక స్పృహ కల్గించేదిగా విద్య వుండాలని, ఇంతకు ముందున్న సమాజములో అసమానతలు చోటుచేసుకున్నాయని, విద్య అమ్ముడు పోయే వస్తువుగా వుండరాదని అన్నిస్థాయిలలో ప్రభుత్వ ప్రమేయం అవసరమని చెప్పిరి.

శ్రీ వి. బాలసుబ్రహ్మణ్యం యు.టి.యఫ్. విద్యారంగ ముసాయిదా పత్రం ప్రవేశపెడుతూ, నేటి విద్యారంగ పరిస్థితి దానికి బడ్జెట్ కేటాయింపులు, ప్రభుత్వవిధానాలు సవివరంగా వివరించిరి.

ముఖ్యఅతిధి విద్యాశాఖామాత్యులు శ్రీ కడియం శ్రీహరి అందరికి విద్య అందుబాటులోనికి రావాలి. తల్లిదండ్రులో చైతన్యంరావాలి. ప్రభుత్వము, ఉపాధ్యాయులు అందరిపైన బాధ్యత వున్నది. కొన్ని ప్రాంతాలలో పాఠశాలలు లేవు అవివున్న విద్యార్థులు లేరు. వారువున్నా సక్రమంగా బోధన జరుగుట లేదు బాలకార్మిక వ్యవస్థ రూపుమాపాలి. జనాభా పెరుగుదల అరికట్టాలి. అని మాట్లాడిరి.

శ్రీ యం.జె.మాణిక్యరావు (మాజి యం.యల్.సి. ఆక్టా నాయకులు) మంత్రులు తమ పిల్లలను కాన్వెంటు స్కూళ్ళకు పంపుతున్నారు. అక్కడ అన్ని సౌకర్యాలు వుంటున్నాయి. ఉపాధ్యాయుల పిల్లలను పంపితే తప్పగా భావించడం సరికాదన్నారు. శిక్షణ లేని ఉపాధ్యాయులు పాఠాలు చెప్పడం సరికాదన్నారు.

## సాహితీ సదస్సు

సాహితీ సదస్సు సా॥ గం॥ 6-00కు శ్రీ వి. బాలసుబ్రహ్మణ్యంగారి అధ్యక్షతన ప్రారంభమయింది. అధ్యక్షులు తమ తొలిపలుకులలో నన్నయ గురించి, దేవుల పల్లి కృష్ణశాస్త్రిగురించి, చిలకమర్తి గురించి వివరించినారు.

శ్రీ అద్దేపల్లి రామమోహనరావు మాట్లాడుతూ గురజాడ ప్రజాకవి దురాచారాన్ని రూపుమాపడానికి ప్రజల భాషలో రచనలు చేశారు. తరువాత శ్రీ శ్రీ శ్రమైక జీవనసౌందర్యంగురించి, విప్లవ కవుల గురించి సోదాహరణంగా వివరించారు.

శ్రీ తెలకపల్లి రవి తెలుగు సాహిత్యంలో ఆధునిక ధోరణులు గురించి వివరిస్తూ, గురజాడ దేశమంటే మట్టి కాదోయ్ దేశమంటే మనుజులోయ్, తిండికలవాడేను మనిషోయ్ అన్నారు. శ్రీ శ్రీ గారి మహాప్రస్థానానికి నేటికి రోజులు చెల్లలేదని, అదియింకా యువకులను ఉత్సాహపరచి ఉరకలు వేయిస్తుందని అన్నారు.

శ్రీ యం. నరహరి గారు తెలుగు సాహిత్యంలో వీరేశలింగం యుగం గురించి మాట్లాడుతూ వీరేశలింగం, గురజాడ, సంఘ సంస్కరణలకై రచలను చేసిన విధం వివరించారు.

## సాస్కృతిక సభ - ప్రదర్శనలు

శ్రీ యం. రామకోటేశ్వరరావు సాస్కృతిక సదస్సుకు అధ్యక్షత వహిస్తూ యు.టి.యఫ్. మహాసభలలో సాస్కృతిక ప్రదర్శనల గురించి వివరించారు. ప్రముఖ సినీనటులు శ్రీ జె. వి. సోమయాజులు సాస్కృతిక సదస్సును ప్రారంభించుతూ, అభినయం జీవితంలో భాగమని, ఉపాధ్యాయులు అభినయంతో బోధన చేస్తే విధ్యార్థిలో హత్తుకుపోతాదని ప్రాథమిక స్థాయిలో విద్యార్థులు ఆటపాటలతో చదువుకోడానికి యివ్వవడతాడని, ఉపాధ్యాయుడు బోధనలో వాటిని ఉపయోగించుకోవాలని, తాను లెక్చరర్‌గా పనిచేసినప్పడు రెవిన్యూ డిపార్టుమెంటులో పనిచేసినప్పడు, ఉద్యోగ, ఉపాధ్యాయ సంఘాలలో ఐక్యపోరాటాలతో కలిసి పనిచేశానని, ఎంత పెద్ద ఉద్యోగంలో వున్నా చిన్ననాడు చదువు చెప్పిన గురువును మరిచి పో రాదన్నారు.

గురజాడ నాటికలో ఒక నాటకాన్ని సృష్టించి కన్యాశుల్కాన్ని పరిష్కరించారని, కన్యాశుల్కం యొక్క సామాజిక ప్రయోజనం వివరించారు.

తర్వాత రాత్రి గం॥9-00 నండి గం॥ 12-00 వరకు వైజ్ఞానిక ప్రదర్శనలు జరిగాయి.

## సామాజిక చైతన్య సదస్సు

19 వ తేది ఉదయం రాష్ట్ర సహఅధ్యక్షులు శ్రీ యన్. నారాయణగారి అధ్యక్షతన సామాజిక ,చైతన్య సదస్సు జరిగినది. అధ్యక్షులు తమ తొలిపలుకులలో సభప్రాధాన్యత, వివరించిరి.

డా॥ వై. రాధాకృష్ణ మూర్తి రాజ్యసభ సభ్యులు రాజ్యాంగ సమీక్ష ప్రతిపాదనల గురించి ప్రధానోపాన్యాసం చేస్తూ ఆస్థిహక్కు ప్రాథమిక హక్కుగా గుర్తించిన రాజ్యాంగం,

పనిహక్కును చేర్చలేక పోయిందని ఉద్ఘాటించారు. శ్రీ రాధాకృష్ణమూర్తిగారి ఉపన్యాసం పూర్తి పాఠం తరువాత పేజీలలో వున్నది).

డా॥ వి. కృష్ణ (సెంట్రల్ యూనివర్సిటి లీడర్) భారతీయ సమాజం సామాజిక న్యాయం గురించి మాట్లాడుతూ సామాజిక న్యాయం వ్యక్తుల మధ్యనే గాకుండా దేశాల మధ్య కూడా కొనసాగాలని నుడివిరి.

డా॥ కె. నాగేశ్వర్ ఎనాలసిస్ గౌరవ సంపాదకులు "ఆర్థిక సంస్కరణలు సామాజిక న్యాయం " గురించి మాట్లాడుతూ అభివృద్ధి అంటే విదేశీ అప్పులు విదేశీ పెట్టుబడులు కాదు క్లింటన్ రాకను ఒక సామ్రాజ్యవాద దోపిడిదారునిగా గుర్తించి, దానినివ్యతిరేకించడానికి కార్యక్రమం చేపట్టాలని చెప్పారు. బహుళజాతి సమస్యల పుణ్యమా అని అన్ని పేటెంట్లను కోల్పోతున్నామని చెప్పారు.

శ్రీ బి. వెంకట్ (వ్యవసాయకార్మిక సంఘ జాయింట్ సెక్రటరి) మాట్లాడుతూ భారతదేశంలో అభ్యుదయ సమాజం రావాలని కోరుకుంటున్నాము. దళితల పై పెత్తందారుల ఆగడాలు కొనసాగుతూనే వున్నాయి. సామాజిక న్యాయం రావాలంటే కులమత వివక్షతలు పోవాలని, ఆ పోరాటంలో ఉపాధ్యాయులు కలిసిరావాలని కోరారు.

జనవిజ్ఞాన వేదిక రాష్ట్రనాయకులు డా॥ పి. రామమోహనరావుగారు పంపిన సందేశాన్ని శ్రీ బాల సుబ్రహ్మణ్యం గారు చదివి వినిపించారు.. జనవిజ్ఞాన వేదిక ప్రచురించిన " కథలంటేనాకిష్టం" పుస్తకాన్ని డా॥ వై. రాధాకృష్ణమూర్తి గారు ఆవిష్కరించిరి,. శ్రీ సదానందమూర్తి గారు వందన సమర్పణ చేసిరి.

## మహిళా చైతన్య సదస్సు

శ్రీ మతి సి. కమలకుమారి అధ్యక్షతన మహిళాచైతన్య సదస్సు జరిగింది. మహిళలు అన్నిచరంగాలలో ముందుండాలని, అన్ని రంగాలలో మహిళలు అవమానాలు పాలవుతున్నారని, వివక్షతకు గురౌతున్నారని చెప్పారు.

డా॥ సోనియగుప్త (లీడరు సి.ఐ.ఎఫ్.ఎల్) మహిళలు ఉద్యోగాలుచేస్తూనే ఇంటిపని, పిల్లను పోషించడం అనేమూడు పనులలో మునిగిపోతున్నారు. మహిళలు రోజుకు 17 గంటలు పనిచేస్తున్నారు. పురాణాలలో చెప్పింది నేటికి అమలు జరుగుతోంది. సతీసహగమన దురాచారం ఇంకా అమలు జరుగుతూనే వుంది. మనం ఎక్కడవున్నామో గ్రహించండి అని చెప్పారు.

ఐడియల్ కళాశాల కరస్పాడెంట్ డా॥ పి. చిరంజీవిని కుమారి పరిణామక్రమంలో స్త్రీ కూలి మహిళగావుంటూ యిప్పుడు శ్రామిక మహిళగా మారింది. స్త్రీ వ్యాపారవస్తువుగా వువయోగించుంటున్నారు. దానికి వ్యతిరేకించాలి. మహిళాసంఘం గట్టిగా పనిచేయాలి. వీటిని వ్యతిరేకించి పోరాడాలని చెప్పిరి.

శ్రీమతి టి. పావని (కార్యదర్శి ఆం.ప్ర. మహిళాసంఘం) పేదరికం పెరిగి మొదట రోడ్డున పడేది స్త్రీయే. దేశంలో భద్రత లేనివారు మొదట స్త్రీ యే విద్యార్థులు తలెత్తుకతిరిగేలా ఉపాధ్యాయులు తయారు చేయాలన్నారు.

శ్రీ మతి ప్రభాఘోషఫ్ (కాకినాడ మున్సిఫల్ చైర్‌పర్సన్) భావిభారతం భవిష్యత్ ఉపాధ్యాలచేతులలో వుందని, ఆర్థిక పరిస్థితులు వేరైనా ఉపాధ్యాయుని దృష్టిలో పిల్లలందరు సమానులేనని, వారిపై ఉపాధ్యాయుని ప్రభావం ఎక్కువగా వుంటుందని చెప్పారు.

శ్రీమతి ఆలూరి విజయలక్ష్మి (అధ్యక్షులు లోక్‌సత్తా) 15 వేల మంది ప్రతినిధులలో 5 వేలమంది మహిళలు యీ సభలకు రావడం హర్షణీయమని తెలిపారు.

జిల్లా పరిషత్ చైర్ పర్సన్ శ్రీమతి వంగాగీతా విశ్వనాథ్‌మట్లాడుతూ, కందుకూరి గురజాడ స్త్రీవిముక్తికి పోరాడారని, 15 లక్షల మంది స్త్రీలు దేశంలో అధికారంలో వున్నారన్నారు. రాష్ట్రంలో 90 వేలమంది స్థానికసంస్థలలో అధికారంలోనికి వచ్చారు తలిదండ్రులు అబ్బాయిని, అమ్మాయిని ఒకే రకంగా చూడాలని, వారిలో వివక్షత చూపరాదని, దానికి తల్లి చొరవ చూపాలని ఉద్బోధించిరి.

## కాకినాడనే ఉర్రూతలూగించిన మహాగురుప్రదర్శన

సాయంత్రవ గం॥4-00 అమరజీవి సూర్యనారాయణ రాజు నగర్ (పి.ఆర్. కాలేజిగ్రౌండ్) నుండి మహాగురు ప్రదర్శన ప్రారంభమయింది. ముందుభాగంలో మహాప్రదర్శన బేనర్ వెనుక రాష్ట్రసెక్రటేరియట్ సభ్యులు నడువగా ఆ తర్వాత రజతోత్సవ గుర్తుగా 25 యు.టి.యఫ్. పతాకాలు వరుసలుతీరి నడువగా, ఆవెనుక తెల్లచీరలు, దరించిన 500 మంది మహిళలు ఆ తర్వాత తెల్ల యూనిఫారం ధరించిన 500 మంది పురుషులు ఆ తర్వాత మహిళలు, ఆతర్వాత ఆతిధ్యమిచ్చిన తూర్పు గోదావరి జిల్లా ఉపాధ్యాయ శాఖ బేనరు పట్టుకొని ముందు పీఠీన నడువగా 15 వేలమందికి పైగా ఉపాధ్యాయులు జిల్లాల వరుసలలో సుశిక్షితులైన సైనికులవలె విశాలమైన కాకినాడ వీధులలో అవిశ్రాంతంగా అరుణ పతకాలతో సాగిపోతూ వుంటే నేలయీనినట్లు నింగిపొంగినట్లు, సముద్రమే ఉప్పొంగినట్లు 7 కిలోమీటర్ల పొడవునా ప్రదర్శన కొనసాగింది దానిచివర ఎక్కడో కనిపించలేదు.

కాకినాడ పట్టణంలో అది నభూతోనభవిష్యత్‌గా చూపరులు వేనోళ్ల వినుతించారు. "అధికధరలు - అరికట్టాలి అంటే" ప్రదర్శనను తిలకిస్తున్న జనం పులకించిపోయారు.

ఉద్యోగుల ఐక్యత వర్ధిల్లాలి అంటే మధ్యతరగతి ఉద్యోగులు పులకించిపోయారు. కార్మికులు, కర్షకులు, ఉపాధ్యాయులు ఐక్యత వర్ధిల్లాలి. అంటే, కష్టజీవులు జేజేలు పలికారు. డాబాలపైన నిలిచినమహిళలు నినాదాలతో గొంతు కలిపి తమ కష్టాలు యీడేరే దానికి మనం కూడా రోడ్డున పడితే తప్ప మార్గంలేదని తలంచి ఆవైపు ఆలోచనలు సాగించారు.

ఇంతమందిలో ఆలోచనలు రేపి ఇంతమందితో క్రమశిక్షణ తో దిక్కులు పిక్కటిల్లే నినాదాలతో సాగిపోయిన ప్రదర్శన చరిత్రలో చిరస్థాయిగా నిలచిపోతుంది. సువర్ణాక్షరాలలో లిఖించబడుతుంది. వత్సవాయి సూర్యనారాయణ రాజునగర్‌నుండి ప్రారంభమైన మహాప్రదర్శన, కులాయి చెరువురోడ్డు, ప్రకాశం రోడ్డు, నూకాలమ్మగుడివీధి, టూటౌన్ సెంటర్ మీదగా, మెయినరోడ్డుచేరుకొని, టౌనువాలు, మసీదు సెంటరు మీదుగా జగన్నాధపురం వంతెన వద్దకు చేరుకుంది. అక్కడనుండి దేవాలయం వీధిలో ప్రవేసించి బాలాజీ చెరువు సెంటరు, అర్బన్ యం.ఆర్.ఓ. కార్యాలయంమీదుగా, ప్రభుత్వ ఆసుపత్రిదాటి, జిల్లా పరిషత్ ఆఫీసుమీదగా తిరిగి మహాసభ ప్రాంగణం చేరుకొంది. మొత్తం 7 కిలోమీటర్ల దూరం 15 వేలమందికి పైగా ప్రతినిధులు కదంత్రొక్కుతూ కదిలిపోయారు.

## సామాజిక స్పృహ కల్పించిన బహిరంగసభ

శ్రీ ఎ. వేంకటప్వామి బహిరంగసభకు అధ్యక్షత వహించి, విద్యారంగంపై ప్రభుత్వవైఖరి, ప్రపంచబ్యాంకు విధానాలకు కండిషన్లకు దానిని బలిపెడుతున్న తీరు. అభద్రత భావం అందరిలో పాదు కొల్పేదానికి ప్రభుత్వం పాల్పడుతున్న విధానాలు వివరించిరి.

శ్రీ ఎస్. సుధాకరరెడ్డి (సి.పి.ఐ.రాష్ట్ర కార్యదర్శి) కేంద్రరాష్ట్ర ప్రభుత్వాలు లోగడ ఉద్యమాలు సాదించుకున్న హక్కులపై దాడిచేస్తున్నాయని, మత విద్యను ప్రవేశపెట్టే ప్రయత్నాలు చేస్తున్నదని, విద్యాకమిటీలనే ముద్దు పేరుతో ప్రజల పై భారాలు మోపేప్రయాత్నాలు చేస్తున్నవని ఉన్నత విద్యపై పెట్టుబడులు తగ్గిస్తున్నది. ప్రపంచబ్యాంకు అప్పలు తీసుకొని కొన్ని దేశాలు అధ్వాన్న స్థితిలో వున్నాయి. మన దేశము ఆస్థితికి వెళ్లెదారిలోనే ఉందని చెప్పారు.

సి.పి.ఐ (యం) రాష్ట్రకార్యదర్శి శ్రీ బి.వి..రాఘవులు మాట్లాడుతూ స్వాతంత్ర్యానికి ముందున్న యిప్పుడు అక్షరాస్యత శాతం తక్కువ, ఇప్పుడున్న పాలకవర్గం అక్షరాస్యత పెంచేదానికి కృషి చేస్తుందా ! బహుళ జాతి సంస్థలకు కావలసిన గుమస్తాలను తయారు చేయడం పాలకులకు అవసరం. ఉద్యోగులలో అభద్రతాభావం వుండాలని ప్రభుత్వం అభిప్రాయపడుతున్నది. నాయకునిలో కూడా అభద్రతా భావం వుండలా ? యం.యల్.ఏలు. కూడా బెదిరిస్తే ఏమిజరుగుతుంది ?

ఇకపై ఉద్యోగాలు వుండవు అని ముఖ్యమంత్రి అంటున్నారు, చందాలు వసూలుచేసి చదువులు చెప్పించుకోవాలంటే, పాఠశాలలు విద్యా కమిటీలకు అప్పచెపుతారు. సూపర్ పవర్ కంప్యూటర్లు వస్తున్నాయి. వ్యక్తి లేకుండానే అన్ని జరిగి పోతాయట. ఇదే అభివృద్ధి అట. దీనిని అన్ని వర్గాల ప్రజలు ఏకమై ఎదుర్కోవాలని చెప్పిరి.

శ్రీ తోట వెంకటాచలం (జిల్లా కాంగ్రెసు అధ్యక్షులు) మాట్లాడుతూ, శ్రీ రాజశేఖరరెడ్డిగారు పనులు వత్తిడిచే రాలేకపోయారని, వారు, మేము ఉపాధ్యాయుల సమస్యలపై, శాసనసభలలోను, బయట సహకరిస్తామని, ప్రభుత్వం చెప్పే జిమ్మిక్కులు నమ్మక, విద్యార్థులను తీర్చిదిద్దాలని చెప్పిరి.

19 రాత్రి కూడా నాటికలు, వివిధ కళారూపాలు ప్రదర్శనలు సభ్యులను ఆహ్లాద పరిచాయి.

## ఉద్యమ స్పూర్తితో జరిగిన ప్రతినిధుల సభ

శ్రీ ఎ. వెంకటస్వామి అధ్యక్షవర్గ, సారధ్యసంఘ, అర్హతసంఘాలను ప్రతిపాదించారు. వారందరు ఏకగ్రీవంగా ఎన్నికయిరి.

**అధ్యక్ష వర్గంగా :** శ్రీయుతులు డి. రామిరెడ్డి, యస్. నారాయణ, కె. భద్రయ్య, కె. బ్రహ్మాజీరావు, శ్రీమతి సి. కమలకుమారి, సారధ్య సంఘంగా శ్రీయుతులు ఎ. వెంకటస్వామి, ఎన్. రమణయ్యశాస్త్రి , కె. జోజయ్య, పి. కృష్ణమూర్తి, జి. చిట్టిబాబు, యం. ఎ.కె. దత్తు, యస్. ఆనందనాయుడు, సి. హెచ్. సుభాచంద్రబోసు, డి. లక్ష్మి రెడ్డి, టి. కొండాచారి.

**అర్హతలసంఘంగా :** శ్రీ యస్. రామకోటేశ్వరరావు, ఎ. చెన్నకేశవరెడ్డి, బి. మోహనరావు, చావా రవి, టి. సీతారాం, కె.యస్.వి. దుర్గారావు ఎన్నికయిరి.

రాష్ట్రకౌన్సిలుకు కోప్షన్ సభ్యులుగా శ్రీ యుతులు, పి, సత్యనారాయణ, శ్రీ యస్. విజయకుమార్ కె. గోపయ్య, యం. నరహరి, ప్రగతి, గార్లపేర్లు ప్రతిపాదించగా వారు ఏకగ్రీవముగా ఎన్నికయిరి, వారు ప్రమాణ స్వీకారంచేసిరి.

## సీనియర్ నాయకులకు అభినందనలు

ఈ 25 సంవత్సరాల కాలంలో యు.టి.యఫ్. లో పనిచేసి, ఉపాధ్యాయునిగాను, ఉద్యమంలోను రిటైరయిన. రాష్ట్రసెక్రటేరియట్ సభ్యులుగాను, జిల్లా అధ్యక్షప్రధాన కార్యదర్శులుగాను, ఉద్యమానికి సేవలందించిన సీనియర్‌నాయకులను మహాసభలలో అభినందించిరి. శాలువాలు కప్పి, జ్ఞాపికలు అందజేసిరి. ఈ కార్యక్రమాన్ని శ్రీ యస్. ఆనందనాయుడు నిర్వహించిరి. తూర్పుగోదావరిజిల్లాలో శ్రీ పి.బి.ముత్తారావు, శ్రీ టి.వెంకటరావు, శ్రీ కె. బ్రహ్మాజీరావు, పశ్చిమగోదావరి శ్రీయస్. ఆర్. పోలిశెట్టి, కృష్ణ జిల్లాలో శ్రీ పి. సోమయ్య, విజయనగరంలో శ్రీ జె. అప్పలనాయుడు, శ్రీ యం. కృష్ణమూర్తి, శ్రీ. జి. వి. సత్యనారాయణ, శ్రీ యం. రామమూర్తి పంతులు, గుంటూరునుండి శ్రీ టి. అంజిరెడ్డి, యం. రాయన్న, శ్రీ వి. విశ్వనాధం, శ్రీ కె. నారాయణమూర్తి, శ్రీ కె. నారాయణరావు, ప్రకాశం జిల్లానుండి

శ్రీ యం. పానకాలరావు, నెల్లురు నుండి శ్రీ యం. పోతురాజు, ఖమ్మంజిల్లానుండి శ్రీ ఆర్. రాఘవయ్య, వి.యల్. నరసింహారావు , శ్రీ పి. సత్యనారాయణ, అదిలాబాదునుండి శ్రీ కంది కృష్ణారెడ్డి, కరీంనగర్‌నుండి శ్రీ వెంకట్, రంగారెడ్డి శ్రీ యం. మార్కు, చిత్తూరు శ్రీ ఆర్ముగం పిళ్లె నిజామాబాద్ సి.హెచ్. పట్టాభిరామయ్యగారలను అభినందించిరి.

ప్రతినిధులసభను శ్రీ మోటూరు హనుమంతరావు ప్రారంభించారు. యు.టి.యఫ్. ప్రారంభంనుండి వారితో అవినాభావ సంబంధం వుందని, ఉద్యమం నాయకుల త్యాగాల ఫలితంగానే ఇంత అభివృద్ధిలో వుందని సూత్రబద్ధవైఖరితో పనిచేసిందని, భాషాప్రయుక్త రాష్ట్రాల విషయంలోగాని, సత్సంప్రదాయాలు నెలకొల్పి, 90 వేల సభ్యత్వానికి ప్రాతినిధ్యం వహించే అతిపెద్ద సంఘంగా ఎదిగిందని ప్రస్తుతించారు. అధ్యక్ష వర్గం పక్షాన శ్రీ డి. రామిరెడ్డిగారు కార్యకలాపాలు నిర్వహించిరి.

విద్యాశాఖ కార్యదర్శి శ్రీమతి చాయారతన్ ముఖ్యఅతిథిగా హాజరయి, ఉపన్యసించిరి, ఇంకా 40 శాతం మంది చదువు రాని వారు వున్నారని, 55 శాతం మంది మధ్యలో చెరువు ఆపివేసేవారు వున్నారని, అది సరిచేయాలని, అందరం కలిసి అక్షరాస్యత పెంచుదాం, కౌన్సిలింగుపెట్టాం, వారు తరగతి గదులపై దృష్టిసారించాలని, తెలుగుభాషకు తగు ప్రాధాన్యత ఇవ్వాలని చెప్పిరి, నాయకులతో సత్సంబందాలు వున్నాయని చెప్పారు.

పాఠశాల విద్యాకమిషనర్ శ్రీ విజయకుమార్ మాట్లాడుతూ, సంఘాల సలహాలతోనే పనిచేస్తున్నామని, మీపనిమీరు చేయండి. మావైపు కావలసినవి మేము చేస్తాము . బోధనేతర పనులలో ఉపాధ్యాయులను వాడుకొవద్దని చెప్పారు. పంచాయితిరాజ్, మున్సిపల్ పాఠశాలలలో పోస్టులు నింపుతాము . 2005 నాటికి అందరిని అక్షరాశ్యులుగా చేద్దాము అనిచెప్పిరి.

తమిళనాడు ఉపాధ్యాయ సంఘునాయకులు శ్రీ మునుస్వామి, కళాశాలలు అధ్యాపకసంఘునాయకులు శ్రీధరరెడ్డి, శ్రీ పుల్లయ్య, ఎ.పి.టి. యఫ్. నాయకులు శ్రీ సత్యనారాయణ, శ్రీ ప్రశాంతబసు సందేశాలు ఇచ్చిరి.

## నూతన నిర్మాణము

రజతోత్సవాలు, 8వ విద్యావైజ్ఞానిక మహా సభల సంధర్భంగా కాకినాడలో ది : 20-01-2000 న జరిగిన నూతన జనరల్ కౌన్సిల్ సమావేశంలో నూతన కమిటీలను ఏకగ్రీవంగా ఎన్నుకోవటం జరిగింది. శ్రీ వి. బాలసుబ్రహ్మణ్యంగారు ఎన్నికలు నిర్వహించిరి, వారిచేత ప్రమాణ స్వీకారం చేయించిరి. తర్వాత వారందరిని సభకు పరిచయం చేసిరి. సభలో నినాదాలు మారుమ్రోగగా, మహాసభలు ముగిసినవి. శ్రీ జి. చిట్టిబాబుగారు వందన సమర్పణ చేసిరి.

### 1. రాష్ట్రకార్యదర్శి వర్గం

| | |
|---|---|
| గౌరవ అధ్యక్షులు : | శ్రీ డి. రామిరెడ్డి |
| అధ్యక్షులు : | శ్రీ కె. జోజయ్య |
| సహాధ్యక్షులు : | శ్రీ ఎన్. రమణయ్య శాస్త్రి |
| ప్రధాన కార్యదర్శి : | శ్రీ ఎన్. నారాయణ |
| కోశాధికారి : | శ్రీ పి. కృష్ణమూర్తి |
| కార్యదర్శులు : | శ్రీ ఎం. ఎ.కె. దత్తు |
| | శ్రీ ఎన్. విజయకుమార్ |
| | శ్రీ ఎన్. ఆనందనాయుడు |
| | శ్రీ సి.హెచ్. సుభాష్ చంద్రబోస్ |
| | శ్రీ బి. మోహన్ నావు |
| | శ్రీ పి. మాణిక్ రెడ్డి |
| | శ్రీ పి. వుల్లయ్య |
| | శ్రీ కె. ఆదినారాయణ |
| | శ్రీ పి. వెంకటేశ్వరరావు |
| | శ్రీ వై. రంగారెడ్డి |
| | శ్రీమతి సి. కమలకుమారి |

**2. ఐక్య ఉపాధ్యాయ సంపాదక వర్గం :** శ్రీ ఎ.వెంకట స్వామి (ప్రదాన సంపాదకులు), శ్రీ ఎన్. నారాయణ, శ్రీ కె. జోజయ్య, శ్రీ డి. రామిరెడ్డి, శ్రీమతి యం. సంయుక్త.

**3. యు.టి.ఎఫ్. వార్తలు సంపాదక వర్గం :** శ్రీ ఎన్. నారాయణ (ప్రధాన సంపాదకులు),శ్రీ కె. జోజయ్య, శ్రీ ఫ్. వెంకటస్వామి.

**4. ఆడిట్ కమిటి :** శ్రీ ఎస్ డి. జియవుద్దీన్ అహ్మద్ (కన్వీనర్), శ్రీ టి. కొండాచారి, శ్రీ ఎ. ఇజ్రాయిల్ రాజు.

**కార్యవర్గం :** శ్రీ గూన అప్పారావు (శ్రీకాకుళం) ,శ్రీ ఆర్. విజయకుమార్ (విజయనగరం) , శ్రీ యం. రామసుబ్బారెడ్డి (విశాఖపట్నం) , శ్రీ ఐ. వెంకటేశ్వరరావు (తూర్పుగోదావరి) , శ్రీ పి. సోమరాజు (పశ్చిమగోదావరి) , శ్రీ యన్. వి. ప్రసాదరావు (కృష్ణ) , శ్రీ కె. యన్.వి. దుర్గారావు (గుంటూరు), శ్రీ కె. వెంకటరావు (ప్రకాశం), శ్రీ పి. బాబురెడ్డి (నెల్లూరు), శ్రీ యం. జయరామనాయుడు (చిత్తూరు), శ్రీ పివి. రమణారెడ్డి (కడప) శ్రీ ఎం.ఎ. బేగ్ (కర్నూలు), శ్రీ సి.కె. నాగేంద్రబాబు (అనంతపురం),చావారవి (ఖమ్మం), శ్రీ టి. సీతారాం (వరంగల్), శ్రీ బి. అశోక్ (కరీంనగర్) , శ్రీ వి. బంగారయ్య (నల్గొండ) , శ్రీ యన్. కిష్టయ్య (మహబూబ్‌నగర్), శ్రీ యస్. దత్తాత్రిరావు (నిజామాబాదు) , శ్రీ పి. కృష్ణమూర్తి (మెదక్) , శ్రీ యన్. పురుషోత్తరావు (రంగారెడ్డి) , శ్రీ సి.హెచ్.వి. రాజన్‌బాబ్ (హైదరాబాద్) , శ్రీమతులు చావా చిట్టెమ్మ, టి.వి.టి. కన్యాకుమారి (మహిళా సభ్యులు) నిబంధనావళి ప్రకారం ఎన్నికయిరి.



# అధ్యక్షోపన్యాసము

**డి. రామిరెడ్డి EX. M.L.C**
అధ్యక్షులు, యు.టి.యఫ్.

వేదిక నలంకరించిన లోక్‌సభ సభాపతి ! అమాత్యులారా ! పెద్దలారా !
విద్యానేత్తలారా ! మహాసభ ప్రతినిధులారా ! సౌహార్థ ప్రతినిధులారా !
సోదర సంఘ నాయకులారా ! పురప్రముఖులారా !
వివిధ శాఖల అధికారులారా ! పత్రికా విలేఖరులారా ! రేడియో,
దూరదర్శన్ ! విలేఖరులారా!
మీ కందరకు నూతన సంవత్సర శుభాకాంక్షలు

ఎన్నో వ్యయప్రయాసల కోర్చి రాష్ట్రనలుమూలల నుండి, ఇతర రాష్ట్రాల నుండి ఈ సభలకు విచ్చేసిన మీకందరకు స్వాగతం ! సుస్వాగతం !

మన సంఘం 1974 ఆగష్టు 20న కాకినాడలో రిజిస్టరు చేయబడింది. ప్రథమ మహాసభ 1974 అక్టోబరు 20, 21, తేదీలలో రాజమహేంద్రవరంలో జరిగింది. 7వ మహాసభ ఒంగోలులో 1997 మార్చి 8,9,10 తేదీలలో జరిగింది.

కాకినాడ మన ఉద్యమానికి పుట్టినిల్లు. అందుచే ఈ పట్టణంలోనే 8వ మహాసభ, రజతోత్సవాలు జరుపుకుంటున్నాం. ప్రకృతి సంపదకు, ఆతిథ్యానికి పేరుగాంచిన తూర్పు గోదావరి జిల్లా ఉపాధ్యాయులు, ప్రజానీకం ఈ ఉత్సవాలు జయప్రదం చేయడానికి శక్తికిమించిన సహకారం అందించారు. అన్ని ఏర్పాట్లు సవ్యంగా చేసిన ఆహ్వానసంఘం వారికి, నిద్రాహారాలు మాని కృషి చేస్తున్న కార్యకర్తలకు ధన్యవాదాలు తెలుపుతున్నాను.

ఈ జిల్లా వాస్తవ్యులు, పార్లమెంటు స్పీకరు అయిన శ్రీ జి.యం.సి.బాలయోగిగారు మనకు ముఖ్య అతిథిగా రావడం హర్షదాయకం. ఈ జిల్లాకు చెంది, మంత్రివర్గంలో కీలక భాధ్యతలు నిర్వహిస్తున్న సీనియరు మంత్రులు శ్రీ యుతులు యనమల రామకృష్ణుడు, చిక్కాల రామచంద్రరావు, మన మాజీ యం.యల్.సి. దండు శివరామరాజు గారలు ఎన్ని పనులున్నా ఈ సభలకు విచ్చేయడం ముదావహం.

మనలో ఒకరిగా ఉపాధ్యాయ వృత్తిలో పనిచేసి, మన విద్యామంత్రిగా బాధ్యతలు నిర్వహిస్తూ, ఈ మహాసభల ప్రారంభానికి, మరియు విద్యాసదస్సుకు ముఖ్య అతిథిగా విచ్చేసిన శ్రీ కడియం శ్రీ హరిగారికి ప్రత్యేక ధన్యవాదాలు తెలుపుతున్నాను.

మనమధ్య జిల్లాలోని ప్రజాప్రతినిధులెందరో ఉన్నారు. ఈ మహాసభలు జయప్రదం చేయడానికి తోడ్పడిన జిల్లా కలెక్టర్ శ్రీ సతీష్‌చంద్ర I.A.S. గారు, అన్ని శాఖల అధిపతులున్నారు. వారందించిన సహకారానికి పేరు పేరున కృతజ్ఞతలు తెలుపుతున్నాను.

మనం కేవలం ఉపాధ్యాయుల సంక్షేమానికేగాక, సామాజిక దృక్పథంతో జాతి మొత్తం క్షేమాన్ని దృష్టిలో వుంచుకొని కృషిచేస్తున్నాము. "అధ్యయనం, అధ్యాపనం, , సామాజిక స్పృహ" మన ధ్యేయాలు. "హక్కులు - బాధ్యతలు" మన రెండు నేత్రాలు.

మనం ఈ రోజు 20వ శతాబ్దపు శిఖరాగ్రాన నిలుచుని వెనుదిరిగి చూసుకుంటూ 21వ శతాబ్దంలోకి ప్రయాణం సాగిస్తున్నాం. 20 వ శతాబ్దం మానవాళికి ఆశ, నిరాశల మిశ్రమం.

ఈ శతాబ్దంలోనే మానవాళిని సర్వనాశనం చేసే యుద్ధాలు జరిగాయి. . దానికి తగిన ఆయుధాలు తయారైనాయి. మరొకవైపు మనం కోరుకొన్న ప్రాణిని కోరుకున్న రీతిలో క్లోనింగు ద్వారా విశ్వామిత్ర సృష్టిచేయగలిగిన మేరకు శాస్త్రజ్ఞానం అభివృద్ధి చెందింది. మానవ శరీరంలో అన్ని అవయవాలు మార్చబడుతున్నాయి. అంతరిక్షయానం సాధారణ ప్రయాణమయింది. ఇంటర్‌నెట్ ద్వారా ప్రపంచం చిన్నదయిపోయింది. అత్యంతప్రమాదకర వ్యాధులు రూపుమాసిపోయాయి. అదే సందర్భంలో నూతనరీతిలో ఎయిడ్స్‌లాంటి భయంకర వ్యాధులు పుట్టుకొస్తున్నాయి.

ఇదే విధంగా సామాజిక శాస్త్రాలలో కూడ విప్లవం వచ్చింది. దోపిడీకి నిలయమైన, వ్యక్తి శ్రేయస్సే సర్వస్వమైనపెట్టుబడిదారీ వ్యవస్థకు ప్రత్యామ్నాయం ఉందని, దోపిడి రహిత సామ్యవాద సమాజం సృష్టించవచ్చని మార్క్స్ సూత్రీకరించారు. ఆయనను ఈ సహస్రాబ్దపు మేధావిగా ప్రకటించారు.

సామ్యవాద సమాజాన్ని స్థాపించడానికి వివిధ దేశాలలో వివిధ ప్రయోగాలు జరిగాయి. కొన్ని లోపాలతో రష్యాలాంటి చోట అపజయం ఎదురైంది. ఆ గుణపాఠాలతో జాగ్రత్త పడుతూ కొన్ని దేశాలు ముందుకు పోతున్నాయి. వర్ధమాన దేశాలన్నీ 1990 వరకు ఆ బాటలోనే

పయనించాయి.

ఈ నేపథ్యంలో మనం 21 శతాబ్దపు గమనాన్ని నిర్దేశించుకొని మన ప్రయాణం సాగిద్దాం.

విద్యారంగంలో పూర్తి నిరాశా నిస్పృహలు ఆవరించి ఉన్నాయి. స్వాతంత్ర్యం వచ్చి 53 సంవత్సరాలు దాటినా యింతవరకు స్థిరమైన శాస్త్రీయమైన విద్యావిధానం రూపుదాల్చలేదు. కమిటీల మీద కమిటీలు వేయడం, సర్వేల మీద సర్వేలు చేయడమేగాని ఆ కమిటీల సిఫారసులలో తమ కనుకూలమైన వాటిని తప్ప దేశానికి ఉపయోగపడే సిఫారసు లేవీ గత ప్రభుత్వాలు అమలు జరుపలేదు.

సర్వేపల్లి రాధాకృష్ణన్ కమిటి, లక్ష్మణస్వామి మొదలియార్ కమిటి, ఈశ్వరభాయి కమిటి, యశ్‌పాల్ కమిటి, రామమూర్తి కమిటి, రాజీవ్‌గాంధీ అధికార కమిటి సిఫారసులన్నీ పేపర్లకే పరిమిత మయినాయి.

ప్రపంచంలోని అన్ని అభివృద్ధిచెందిన దేశాలు 5 సంవత్సరాలలో నిరక్షరాస్యతను నిర్మూలించాయి. 10 సంవత్సరాలలో జనాభాలో 60 -70 శాతం వరకు డిగ్రీ వరకు చదివేలా కృషి చేశాయి. కాని మన దేశంలో 1991 జనాభా లెక్కల ప్రకారం అక్షరాస్యత శాతం 52..1% : మన రాష్ట్రంలో 45.11% : ఇండియాలో కూడ అక్షరాస్యత పురుషులలో 63.86% ఉండగా స్త్రీలలో 39.42% ఉంది. ప్రపంచంలో అక్షరాస్యతలో మన స్థానం 135 లో ఉంది. క్రింది నుండి 7-8 వ స్థానంలో ఉంది.

జనాభాలో స్త్రీల శాతం క్రమంగా తగ్గుతోంది. అయినా వారిలో నిరక్షరాస్యత శాతం ఎక్కువగా ఉండడం దేశానికే అరిష్టదాయకం.

షెడ్యూల్డు కులాల, షెడ్యూల్డు తరగతుల, వెనుకబడిన వర్గాల పరిస్థితి మరీ దారుణంగా ఉంది. మన రాష్ట్రంలో 1 -7 తరగతులలో దాదాపు 92 లక్షల మంది విద్యార్థులుండగా వారిలో యస్.సి.,యస్.టి. పిల్లలు 21 లక్షల మంది మాత్రమే ఉన్నారు.

పాఠశాలలో చేరిన తర్వాత మధ్యలో పాఠశాలలు వదిలివేల్లే వారి సంఖ్య అత్యధికంగా ఉంది. డ్రాపులవుటు రేటు 1 నుండి 8 తరగతులలో 58.80% ఉండగా, బాలికలలో 67.55% ఉంది. ఇది సగటున అప్పర్ ప్రైమరీ స్థాయిలో 44%, సెకండరీ స్థాయిలో 52% ఉండగా అండర్ గ్రాడ్యుయేట్ స్థాయిలో 50%, పోస్టు గ్రాడ్యుయేట్ స్థాయిలో 83%, రీసెర్చిలో 92% ఉంది. జనాభా పెరుగుతోంది. అక్షరాస్యులు పెరుగుతున్నారు. నిరక్షరాస్యత కూడా పెరుగుతోంది.

1991 తర్వాత 2001 లో మరల సర్వే జరుగబోతోంది. ఈ 9 సంవత్సరాలలో అన్ని అంశాలలో కొంత పురోగతి వుండవచ్చు : దానివల్ల అక్షరాస్యత 60% రావచ్చు.

10 సంవత్సరాలలో 6-14సం॥ లలో అందరికీ ఉచిత నిర్బంధ ప్రాథమిక విద్య అందించాలని రాజ్యాంగంలో స్పష్టంగా వ్రాసుకొన్నాం. ఈ గడువు ప్రతి 5 సం॥లకు పొడిగించుకుంటూ వస్తున్నాము. ప్రస్తుతం మన రాష్ట్రంలో ఈ గడువు 2005 సం॥గా నిర్ణయించుకున్నాము.

ఈ వైఫల్యాలకు గల కారణాలు విశ్లేషించుకోవాలి. గత కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలకు విద్యారంగం యెడ సరియైన రాజకీయ దృక్పథం, అవగాహన లేకపోవడమే దీనికి ప్రధాన కారణం. విద్య మానవ సర్వతోముఖాభివృద్ధికి, తద్వారా దేశాభివృద్ధికి తోడ్పడే కీలక అంశమనే దానిని విస్మరించి,కొంతకాలం సేవారంగంగా పరిగణించారు. నేడు కేవలం ఉత్పత్తికి తోడ్పడే రంగంగా పరిగణిస్తున్నారు.

ప్రపంచంలోని అన్ని దేశాలు జి.డి.పి.లో 6% కి తక్కువ గాకుండా నిధులు విద్యారంగానికి కేటాయిస్తున్నాయి. మన దేశంలో కేంద్ర ప్రభుత్వం మొదటి ప్రణాళికలో 7.86% కేటాయించి , 9వ ప్రణాళికలో 3.8% మాత్రమే కేటాయించింది. అందులో ప్రాథమిక విద్య వాటా కూడా మొదటి పంచవర్ష ప్రణాళికకు, 9వ ప్రణాళికకు తేడా ఉంది. మొదటి ప్రణాళికలో 5.6% ఉండగా నేడు అది 3.6% కు పడిపోయింది.

రాష్ట్రాల ఆర్థిక పరిస్థితి బాగా లేనందున, విద్యాభారం రాష్ట్రాలే మోయాల్సి వస్తున్నందున ఏనాడు రాష్ట్ర ప్రభుత్వాలు బడ్జెటులో 13-17% కు మించి ఈ రంగానికి కేటాయించలేదు. ఈ డబ్బు ఉపాధ్యాయుల, ఇతర సిబ్బంది జీతాలకు, ఆఫీసు నిర్వహణకే సరిపోతోంది. కాని యితర అభివృద్ధి పనులకు చాలడం లేదు.

1990 లో థాయిలాండులో జరిగిన ప్రపంచ దేశాల సదస్సులో ప్రపంచ వ్యూహంలో భాగంగా ఐక్యరాజ్యసమితి, దాని అనుబంధ సంస్థలు అన్ని దేశాలలో 2000 సం॥ నాటికి అందరికి విద్యనేర్పడానికి విశేషంగా నిధులు అందించుటకు తీర్మానించాయి. వారి ప్రధాన ఉద్దేశ్యం విద్యతోబాటు, సమాజాన్ని వారి చూపుతో చూడగలిగేలా విద్యార్థుల భావజాలాన్ని మలచడం.

దానిలో భాగంగానే మన దేశానికి గత 3 సం॥ల కాలంలో 5వేల కోట్లు ప్రపంచ బ్యాంకు విద్యాపద్దుకు అప్పుయిచ్చింది. కేంద్రంఖర్చు చేసిన 4,700 కోట్లలో 3,700 కోట్లు ప్రపంచబ్యాంకు అప్పు యిచ్చింది. మన రాష్ట్రంలో కూడ గత 5సం॥లో ఒ.డి.ఎ.పథకం క్రింద డి.పి.ఇ.పి. పథకం క్రింద, ప్రపంచ బ్యాంకు నిధులు సమకూరాయి.

ఈ నిధులు వచ్చిన తర్వాత మాత్రమే ప్రాథమిక విద్యారంగంలో కొంత పురోగమనం కనిపిస్తోంది. అయితే ఈ నిధులు శాశ్వతంగా రావని గమనించాలి. ఈ నిధులతో బాటు వారి భావజాలాన్ని మన మీద రుద్దే ప్రయత్నం జరుగుతున్నది.

53 సం॥ల క్రితం మనం పారద్రోలిన పాశ్చాత్యులు, మారు రూపంలో నేడు తిరిగి ప్రవేశించి, మరల అన్ని రంగాలను ఆక్రమించారు.

మాతృభాషలో యూనివర్సిటీ వరకు విద్యాబోధన జరగాలని, మన భాష, సంస్కృతి ఈ తరానికి పరిపుష్టంగా అందించాలని పోరాడిన మనం ఈనాడు ఆంగ్ల భాషా వ్యామోహంలో పడి కొట్టుకుపోతున్నాం. జపాను, జర్మనీ, చైనా, రష్యాలాంటి అభివృద్ధి చెందిన దేశాలలో కూడా ఇంగ్లీషు వ్యామోహం లేదు. అవసరమైన వారే నేర్చుకొంటారు. శాస్త్ర సాంకేతిక విజ్ఞానం మాతృభాషలోనే లభిస్తుంది.

స్వావలంబన, స్వశక్తితో అభివృద్ధి చెందాలనే లక్ష్యంతో స్వాతంత్ర్య పోరాటం జరిపిన మనం విదేశీ అప్పులే శరణ్యం అంటూ, విదేశీ గుత్త కంపెనీలకు దేశీయ ద్వారాలు పూర్తిగా తెరచివేశాం.

లాభాపేక్ష తప్ప, దేశాభిమానం, ప్రజాసంక్షేమం పట్టని ప్రైవేటు రంగజపం మితిమీరిపోయింది. అంతే గాకుండా మీడియా ద్వారా మన సంస్కృతి ఎంత విషపూరితమయిందో మన యిల్లు, ఒళ్లు, కుటుంబ వ్యవస్థ, సాంఘిక వ్యవస్థలో వచ్చిన మార్పులు చూస్తే అర్థమవుతుంది. "అమ్మ-నాన్న"బూతు పదాలైనాయి. "మమ్మీ-డాడీ" మురిపమయింది.

యు.టి.యఫ్. దీనిని తీవ్రంగా పరిగణిస్తోంది. స్వాతంత్ర్యపోరాట విలువలు కాపాడబడాలని కోరుతోంది.

ఉన్నత విద్యారంగాన్ని ప్రైవేటుపరం చేయమని మనకు నీతులు చెప్పే పాశ్చాత్యదేశాలలో కెనడా 90.1% : జపాన్ 73.9% : జర్మనీ 72.9% : ఫ్రాన్స్ 89.7% : అమెరికా 78.6% ఖర్చు చేస్తున్నాయి. ఇండియా 89.0% ఖర్చు చేస్తోంది. ప్రభుత్వం ఈ మేరకు ఖర్చుచేస్తుంటేనే జనాభాలో డిగ్రీ చదివినవారు 4% దాటలేదు. ప్రభుత్వం ఈ రంగం నుండి వైదొలిగితే జనాభాలో 20% ఉన్న ధనికులే మొత్తం ఉన్నత విద్యారంగాన్ని ఆక్రమిస్తారు.

మన వృత్తి పవిత్రమైనది. ప్రత్యేకమైనది. భావి భారత పౌరులను తయారుచేసేది, మన సంక్షేమం కొరకు పోరాడాలి: సాధించుకోవాలి. అది ఒక పార్శ్వమే. కాని దానితో సంబంధంలేకుండా విద్యార్థులకు ఆదర్శంగా ఉండేవిధంగా ప్రవర్తిస్తూ, అంకితభావంతో పనిచేయ్యాలి. విద్యార్థులలో నైతిక విలువలు, లౌకికతత్వం, దేశభక్తి పెంపొందించాలి. ప్రతిదానిని ప్రశ్నించే శాస్త్రీయ జిజ్ఞాస అభివృద్ధి చెయ్యాలి. అవినీతిని, అన్యాయాన్ని ఎదిరించే పౌరులుగ తీర్చిదిద్దాలి. ఈ లక్ష్యం సాధించాలంటే దానికి తగినట్లు మనం వుండాలి. సమాజం అంతా కుళ్లిపోయిందనే సాకుతో, మునుగుతో మన విద్యుక్తధర్మాన్ని విస్మరించరాదు. మన శ్రేయస్సు సమాజ శ్రేయస్సులో భాగమేకనుక నిరక్షరాస్యత నిండియున్న మనదేశంలో చదువుకున్న వర్గ ప్రతినిధులుగా ఉపాధ్యాయులు ప్రజలకు మార్గదర్శకులుగా పనిచెయ్యాలి.

ప్రభుత్వ పాఠశాలలపై క్రమంగా తరుగుతున్న ప్రజాభిమానాన్ని పునరుద్ధరించాలి. కేంద్ర ప్రభుత్వం చాపక్రింద నీరులా విద్యారంగంలో ప్రవేశపెడుతున్న మతతత్వ భావాలకు వ్యతిరేకంగా పోరాడాలి.

మనం ఆంగ్లభాషకు వ్యతిరేకం కాదు. అవసరమైనవారు, అవరమొచ్చినపుడు నేర్చుకోవచ్చు. ప్రాథమిక విద్యవరకైనా మాతృభాషలోనే నిర్బంధ బోధన జరిగేలా ఉద్యమించాలి.

ప్రైవేటు పాఠశాలల దాడిని ఎదుర్కోవాలి. మన రాష్ట్రంలో అన్ని కోర్సులకు ఎంట్రన్స్ విధానం వచ్చినప్పటి నుండే ప్రైవేటు పాఠశాలలు మూడుపువ్వులు ఆరు కాయలుగా విస్తరిస్తున్నాయి. ప్రభుత్వ సర్టిఫికేట్లకు యూనివర్సిటీ డిగ్రీలకు విలువ లేకుండాపోయింది. దానిని పున:ప్రతిష్టించేలా పోరాడాలి.ప్రభుత్వ పరీక్షల సర్టిఫికెట్లకు విలువ, గుర్తింపు సాధించాలి.

అశిక్షితులైనా ఉపాధ్యాయులుగ పనిచేయవచ్చని, అభద్రతా భావతో మరింత మెరుగుగా పనిచేస్తారని, ప్రైవేటు విద్యావ్యాపారమే దేశానికి శ్రీరామరక్ష అనే సిద్ధాంతాలు ఈ మధ్య వినిపిస్తున్నాయి. యివి విద్యారంగాన్ని సర్వనాశనం చేసే సిద్ధాంతాలు. విద్యార్థి మానసిక స్థితిని గమనించి బోధించడానికి సుశిక్షితులైన ఉపాధ్యాయులు కావాలి. మనం ఈ అపసిద్ధాంతాలను ప్రతిఘటించాలి.

20వ శతాబ్దంలో జరిగిన విద్యారంగ కృషిని సమీక్షించుకొని 21వ శతాబ్దంలో విద్యారంగంలో రావలసిన మార్పులకు ఈ సభలో రూపకల్పన జరగాలి.

3 రోజుల కార్యక్రమంలో ఈ సభలకు విచ్చేసే, పెద్దలు, విద్యావేత్తలు, రాజకీయ నాయకులు యిచ్చే సలహాలతో మనం ఈ సభలలో ప్రవేశపెడుతున్న విద్యారంగ ముసాయిదా పత్రాన్ని పరిపుష్టం చేద్దాము.

గత 25 సం॥ రాలలో మన ఉద్యమం కోసం విరామమెరుగని కృషిచేసి అమరులైన వారందరిని స్మరించుకొంటూ, జీవించి వున్న వారందరిని అభినందిస్తూ నూతన దృక్పథంతో మన ప్రయాణం కొనసాగిద్దాం. ఈ మహా ప్రస్థానంలో ఎన్ని అడ్డంకులొచ్చినా ఎదుర్కొంటూ పయనిద్దాం. సమసమాజ నిర్మాణంలో మన వంతు కర్తవ్యం నెరవేరుద్దాం. దేశ వ్యాప్తంగా జరుగుతున్న ప్రభుత్వ ప్రజావ్యతిరేక పోరాటాలలో ఇతర ఉద్యోగ, ఉపాధ్యాయ సంఘాలతోను, శ్రామిక, కార్మిక, జనావళితోను భుజం భుజం కలిపి పోరాడుదాం. దేశస్వావలంబనను మత సామరస్యాన్ని లౌకికతత్వాన్ని పరిరక్షిస్తామని మరొకసారి శపథం చేస్తూ స్వర్ణోత్సవాల నాటికి మన ఉద్యమాన్ని రెట్టింపు చేస్తామని ప్రతిజ్ఞ చేద్దాం.

**"అందరికీ విద్య" లక్ష్యం సాధించేందుకు కృషిచేద్దాం.**



# స్వాగతోపన్యాసం

వై.డి. రామారావు,
అధ్యక్షులు, ఆహ్వానసంఘం

***అందరికీ స్వాగతం ! సుస్వాగతం !***

ఆంధ్రప్రదేశ్ ఐక్యఉపాధ్యాయ ఫెడరేషన్ రజతోత్సవ, 8వ విద్యా - వైజ్ఞానిక మహాసభలకి, ఆంధ్రదేశం నలుమూలల నుండి, అపారమైన ఉత్సాహంతో విచ్చేసిన ఉపాధ్యాయులకు, విద్యావేత్తలకు, కార్యకర్తలకు, ఆహ్వాన సంఘాధ్యక్షుడుగా నా హృదయ పూర్వకమైన ఆహ్వానం పలుకుతున్నాను.

మహాభారత అనువాదంతో మహనీయమైన తెలుగు భాషకు మహోపకారం చేసి, ప్రజల నాలుకల పై నిలిచిన ఆదికవి నన్నయభట్టుకు ఆటపట్టు యీ భూమిక. మహిళాపురోగమనానికి మూలశక్తిగా , దురాచారనిర్మూలన ఉద్యమానికి సృష్టికర్త కందుకూరి వీరేశలింగం పంతులు గారు నడయాడిననేల, అపూర్వ దేశభక్తితో నిర్మించిన ప్రజా విప్లవాలతో తెల్ల దొరలను తల్లకిందులు చేసిన అల్లూరి సీతారామరాజు సాహసంతో పులకించిన పుణ్యభూమి.

డెల్టా శిల్పి కాటన్ నిర్మించిన వంతెన కింద నవ్వు లొలకబోస్తున్న పంటపొలాలతో పచ్చనైన పుడమి ఈ గోదావరి సీమ.

దాక్షారామం, కుమారారామం, అన్నవరం, కోటిపల్లి మొదలైన చరిత్ర ప్రసిద్ధమైన ఆలయాలు ఇక్కడివే. మహానది గోదావరి తన నిండైన రూపంతో ప్రజల్ని కటాక్షించేది ఇక్కడే. కొబ్బరితోటల పాటలతో, లెక్కకు మించిన రేవులతో అందాల కోనగా రాసికెక్కిన కోనసీమ ఇక్కడిదే !

పీఠికాపురాధీశ్వరుని సహకారంతో సకలకళలు విరాజిల్లిన నగరం బ్రహ్మర్షి రఘుపతి వెంకటరత్నం నాయుడుగారి అభ్యుదయ చైతన్యంతో సకల సంస్కారాలకూ నిలయమైన పట్టణం. విద్యలన్నిటికీ నిలయం, ఉద్యమాలకు ఊపిరి, కళలకు కాణాచి కాకినాడ నగరం. మీ అందరి రాకతో అపూర్వమైన ఉత్తేజం పొందుతోంది. కాకినాడ ప్రజలంతా మీతో కరచాలనం చేస్తున్నారు.

ప్రణాళికా బద్ధంగా నిర్మించిన సువిశాల వీధులతో సుందరనగరమై, అసంఖ్యాక స్వాతంత్ర్య సమరవీరులకు సన్నిధానమై మనోహర సాగరతీరంలో ప్రశాంత జీవన శైలితో కళకళ్ళాడే కాకినాడ మీ అందర్నీ సాదరంగా పలకరిస్తోంది.

***మహాశయులారా !***

మానవుని సంపూర్ణ వికాసానికి విద్యయే మూలకారణం. అటువంటి విద్యను బోధించి, విద్యార్థుల ప్రగతికి దోహదం చేస్తున్న మహావ్యక్తులు మీరు. విద్యతో పాటు, లోకజ్ఞానాన్నీ, నైతిక ప్రవర్తననీ, ఉత్తమ వ్యక్తిత్వాన్నీ తీర్చిదిద్దే బాధ్యత కూడ ఉపాధ్యాయులదే. అలాటి ఉన్నత సంప్రదాయాన్ని పోషిస్తూ వస్తున్న మీ అందరికీ నా హృదయపూర్వక అభివాదాలు అర్పిస్తున్నాను.

ఒక్కసారి సమకాలీన సమాజాన్ని గమనించినపుడు, రోజు రోజుకీ పతనమౌతున్న విలువల నేపథ్యాన్ని గూర్చి ఆలోచించినపుడు, ఈనాటి ఉపాధ్యాయుని బాధ్యత ఎంత గురుతరమైనదో అవగాహనకు రాక తప్పదు. పెరిగిపోతున్న వర్గవైరుధ్యాలు, విస్తరిస్తున్న పేదరికం, నిరాశకలిగిస్తున్న నిరుద్యోగం, ఇటు ఉపాధ్యాయులకూ, అటు విద్యార్థులకు, వారి తల్లిదండ్రులకూ, గందరగోళంగా పరిణమిస్తోంది. క్రమశిక్షణ భావాల్ని కూడా పట్టించుకోనివ్వడం లేదు.

ఉపాధ్యాయుల సమస్యలు పరిష్కరించడానికీ, విద్యార్థుల ఈఆశయాల్ని సఫలం చేయ్యడానికీ, ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్ ఎన్నో పోరాటాలు చేసింది. మరెన్నో త్యాగాలు చేసింది. మీ మహోద్యమాలన్నీ విద్యావ్యవస్థలో సమూలమైన మార్పుల్ని తెస్తున్న విషయం అందరికీ తెలిసిందే.

ఇట్లాంటి మహాసభలు మీ ఐక్య సంఘటనకి ఉత్తేజకరంగా, మీకూ ప్రజలకూ నడుమ గాఢమైన అనుబంధానికి సాంకేతాలుగా, మీ సమిష్టి పురోగమనానికి పునాదిరాళ్ళుగా సహకరించగలవనడంలో సందేహం లేదు.

ఎన్నో వ్యయ ప్రయాసలకోర్చి విచ్చేసిన మీకు ఆహ్వానసంఘం తన శక్తి కొలది వసతి, భోజన ఏర్పాట్లు చేసింది. క్రమ శిక్షణకు, త్యాగాలకు మారుపేరైన మీరు ఏదైనా అసౌకర్యం కల్గితే సహృదయంతో అర్థం చేసుకొని మన్నిస్తారని ఆశిస్తున్నాను.

ఇక్కడి మీ చర్చాగోష్టులు, సిద్ధాంత అవగాహనలూ భావికాల మహోదయానికి అరుణరేఖలుగా వికసించాలని కోరుతున్నాను. మీ నిరంతర విజయాల్ని ఆకాంక్షిస్తూ, మీ అందరికీ శుభాకాంక్షలు తెలుపుకుంటూ మీ నుండి సెలవు తీసుకుంటున్నాను.



# సంఘ నివేదిక

**శ్రీ ఎ. వెంకటస్వామి**
**యు.టి.యఫ్. ప్రధాన కార్యదర్శి**

**అధ్యక్షా !**

**ప్రత్యేకాహ్వానితులారా !!**

**రజతోత్సవాల జయప్రదానికి అహర్నిశలు శ్రమించి అరుదెంచిన కార్యకర్తలారా**

**స్వాగతం, సుస్వాగతం.**

1974 ఆగష్టు 10న స్థాపించుకొన్న ఉద్యమాన్ని 7000 నుండి 90,000 సభ్యత్వం వరకు పెంచి, ప్రగతిపథంలో సాటిలేని మేటి ఉద్యమంగా తీర్చిదిద్ది తిరుగులేని హక్కులు సాధించిన ఉద్యమ రథసారధులైన మీ అందరికి కృతజ్ఞతలు తెల్పుకుంటున్నాము.

నూతన సహస్రాబ్ది సందర్భంగా అందరికి అభినందనలు తెల్పుకొంటున్నాం. మానవ మహాప్రస్థానంలో, గత సహస్రాబ్ధి ఎంత విలువైనదో అంత విలక్షణమైనది. ప్రత్యేకించి గత శతాబ్దం శాస్త్ర సాంకేతిక రంగాల యుగం, అభ్యుదయ ఉద్యమాల కాలం. తొలి సోషలిష్టు రాజ్యావతరణ, వలస దేశాల విమోచనోద్యమాలు ఈ కాలానికి చెందినవే.

అంతర్జాతీయంగా సామ్రాజ్యవాదం. ఒక్కింత పై చేయిగా వున్నమాట వాస్తవమే . సోవియట్ రష్యాపతనం దీనికి కొమ్ములు తెచ్చిందీ నిజమే. అమెరికా అంతర్జాతీయ పోలీసుగా వ్యవహరిస్తూ, ఒక్కో చోట ఒక్కో వైఖరిని అవలంబించే అవకాశవాద విధానాలు చేపట్టడం అందరూ గమనిస్తునేఉన్నారు. కసావో, చెచెన్యా, తూర్పు తైవాన్, ఇరాన్‌లలో దాని వైఖరి స్పష్టం. ఐక్యరాజ్యసమితి కూడా దానికి తందానతాన అంటుంది. ప్రపంచ మార్కెటును గుప్పెటలో పెట్టుకొని, అన్నింటా అధిపత్యం చెలాయిస్తున్నది.

ఇటీవల భారత విమానం హైజాకింగ్‌కు గురైనప్పడు పాకిస్థాన్ పాత్ర మనకందరకు తెలుసు. ఆఫ్ఘనిస్థాన్ వైఖరి గమనించారు. పేరు మోసిన నేరగాళ్ళు తప్పించుకున్నా అమెరికా నోరు విప్పలేదు. ప్రభుత్వానికి చీమకుట్టినట్లు లేదు.

సోవియట్ యూనియన్‌ను విచ్ఛిన్నం చేసి, కుక్కలు చించిన విస్తరిలా మార్చిన సామ్రాజ్యవాదుల ఏజెంట్ ఎల్సిన్ క్షమాపణలతో నిష్క్రమించినా, అతడు దేశానికి మిగిల్చిన దరిద్రం, అరాచకం, నిరుద్యోగం, అంతులేనివి.

చైనాపై ఆంక్షలు, మానవహక్కుల పేర బెదిరెంపులు ఎన్ని తెచ్చిపెట్టినా, దాని అభివృద్ధినెవ్వరూ అడ్డుకోలేకపోవడం అభ్యుదయగాములకు ఆనందదాయకం. ప్రగతిశీల శక్తులకు ఉత్తేజం కల్గించే అంశం. గత ఏడాది హాంగ్‌కాంగ్ చైనాలో కలవడం. ఈసంవత్సరం చైనాలో మకావూ విలీనం సామ్రాజ్యవాదులకు చావుదెబ్బ. రేపో మాపో తైవాన్ కూడా మాతృభూమిలో మమేకం కావడం తప్పనిసరి పరిణామం.

క్యూబా ఎన్నోఅడ్డంకులు అధిగమించి మనగగలుగుతోంది. ఉత్తరకొరియా, వియత్నాం శక్తి కొలది పురోగమిస్తున్నాయి. అల్జీరియా, టర్కీ అఫ్ఘనిస్థాన్‌లలో మతతత్వ శక్తులు బలం పుంజుకొంటున్నాయి. శ్రీ లంకలో మారణకాండ సాగిపోతూనే వుంది. బర్మాలో పరిస్థితులలో మార్పులేదు.

ఆర్థిక సంక్షోబాలు, నిరుద్యోగం, పేదరికం, అసమానతలు, సరికొత్త సామాజిక సమస్యలు దీని ఫలితాలే. నిరసనలు, ఘర్షణలు, ఇండొనేషియా, థాయిలాండ్ దక్షిణ కొరియా, మలేషియాల దుస్థితి, ఆసియా టైగర్ల పరిస్థితి ప్రపంచం ముందు వెల్లడికావడం గమనార్హం. ఉగ్రవాదం , మతోన్మాదం, మాఫియాల స్వైరవిహారం, విలువల పతనం., ఇవన్నీ అసమానతల, నిరాశా నిస్పృహల ఉపరితల వ్యక్తీకరణలు.

సీటెల్ చర్చల సందర్భంగా అభివృద్ధిచెందిన దేశాలు పెట్టిన మెలికలు, వేసిన ఎత్తులు గమనిస్తే వాటి స్వభావం పట్ల ఎవరికైనా భ్రమలు వుంటే అవి తొలగిపోతాయి. ప్రపంచంలో జరిగిన అణ్వాస్త్ర పరీక్షలు 2047 లో 1032 పరీక్షలు జరిపిన అమెరికా సెనేట్ సి.టి.బి.టి.ని నిరాకరించిన తర్వాత అమెరికా వెనక్కు తగ్గితే ఏ మొగం పెట్టుకొని భారతదేశంతో సహా ఇతర దేశాలు సంతకాలు పెడతాయి.

గాట్ దేశాలు వాణిజ్య సంస్థగా విస్తరించాయి. యూరో కరెన్సీ ప్రపంచ దేశాలపై పెత్తనం చలాయించే ప్రమాదం వుంది. అయినా సామ్రాజ్యవాదుల మధ్య వైరుధ్యాలు చాలా వున్నాయి. పేటెంట్ హక్కులు, టర్మినేట్ విత్తనాల ప్రమాదం పొంచి వున్నది. వాటి నిలుపుదలకు

ఎదిరించిపోరాడాలి. అయినా వచ్చిన అవరోధాలు తాత్కాలికమైనవే.

మానవ నాగరికత పురోగామియే. కేంద్రంలో భారతీయ జనతాపార్టీకి సీట్లు పెరగకున్నా మిత్రపక్షాల పొత్తుతో మళ్ళీ అధికారంలోనికి వచ్చింది. కార్గిల్ యుద్ధ ప్రభావం, తృతీయ శక్తుల అనైక్యత, ప్రత్యామ్నాయం లేకపోవడం దానికి వరాలుగా మారాయి. కాని ఆర్థిక విధానాల దిగజారుడు, పేటెంట్ల బిల్లు ఆమోదం, ఇన్సూరెన్సు రెగ్యులేటరీ బిల్లు తెచ్చి విదేశీ వ్యాపారులకు భీమారంగాన్ని తాకట్టు పెట్టారు. 40 శాతం డీజిల్ ధరలు పెంచి ప్రజల నడ్డివిరిచి మరిన్ని భారాలకు సిద్ధంగా వుండాలని దేశ ప్రధాని చిలక పలుకులు పల్కుతున్నారు.

ఇప్పుడు చరిత్రనంతా తిరగరాస్తున్నారు. సముద్రాల పేర్లు మారుస్తున్నారు. పాఠ్యగ్రంథాలు తారుమారు చేస్తున్నారు. విద్యాపరిశోధనా సంస్థలను మతవాదులతో నింపుతున్నారు. సెక్యులర్ వ్యవస్థకు చేటు తెస్తున్నారు. అణ్వస్త్ర కొలిమిని రగిల్చి అభాసు పాలయ్యారు. కార్గిల్ యుద్ధ సమయంలో రక్షణ మంత్రి వైఖరి అభాసుపాలైంది. చైనాపై ఆయన కాలు దువ్వుతున్నా, కార్గిల్ యుద్ధంలో చైనా వైఖరి అందరి ప్రశంసలు పొందింది.

అయితే రాష్ట్రాలలో పలు పార్టీలు అధికారంలో వుండటం కొంత వూరట కల్గించే విషయం. పశ్చిమ బెంగాలు, కేరళ, త్రిపుర వామపక్షప్రభుత్వాలు, ప్రజల ముందు ప్రత్యామ్నాయ విధానాలు పెడుతూ, భూసంస్కరణలు అమలుచేస్తూ ప్రజారంజకంగా సాగించే పాలన అందరికి ఆనందోత్సాహాలు కల్గించుతోంది.

రాష్ట్రంలో తెలుగుదేశం హైటెక్ విధానాలతో ప్రపంచ బ్యాంకు కనుసన్నలలో, ఉద్యోగులపై దాడి మొదలు పెట్టింది. ఇప్పటికే రెండు లక్షల ఉద్యోగాలు నింపలేదు. అందులో టీచర్లు 50 వేల మంది వరకు వున్నారు. సంవత్సరానికి 1.9 శాతం మంది ఉద్యోగులను తొలగించే విధంగా ప్రపంచ బ్యాంకు ముందు ఒప్పందం వుంది. 10 లక్షలలో 5 లక్షల ఉద్యోగాలకు ఉద్వాసన చెప్పే పథకం అది.

30 సంవత్సరాల సర్వీసు వచ్చిన వారందరిని రిటైరు చేయాలనే ఆలోచన వున్నట్లు, ఆ విధంగా అయితే 3,80,000 మందికి ఉద్వాసన జరుగుతుంది. అట్టే అది మా ఆలోచనలో లేదని ముఖ్యమంత్రిగారు అంటున్నారు. కంటిన్‌జెన్సీ సిబ్బంది 70,000 ల మందిని తగ్గించేదానికి జి.ఓ. వచ్చింది. విద్యుత్ రేట్ల పెరుగుదల, బస్సు చార్జీల పెంపుదల ప్రజలపై పెనుభారాలు మోపింది.

ఇక యిప్పుడు ఉప్పు నుండి పప్పుల వరకు, నూనెల నుండి. నిత్యజీవితావసరవస్తువుల అన్నింటిపై పన్ను వడ్డింపులు జరిగిపోయాయి. కరువు రక్కసి కరాళ నృత్యం చేస్తుంటే, పన్నులు గోళ్ళు ఊడగొట్టి వసూలు చేస్తున్నారు. . ఆదరణ, చైతన్యం, చేయూత, రోష్ని, దీపం పథకాలు గట్టెక్కాయి.

పరిశ్రమలు మూతబడి, ఉన్న ఉద్యోగాలు పోయేవారు కొందరయితే, చదివి ఉద్యోగాలు రాని 40 లక్షల మంది నిరుద్యోగులు ఆందోళనకు దిగుతున్నారు. మూడు జన్మభూములు జరిగినా కాంట్రాక్టర్లు తప్ప కష్టజీవులకు ఒరిగింది లేదనేది ప్రజావాక్యం. సాక్షాత్తూ ముఖ్యమంత్రే ఉద్యోగులను వేదికలపై నిలదీస్తుంటే, సొమ్మసిల్లి పడిపోతుంటే ప్రచారానికి బాగుంటుందేమో కాని పనులు మాత్రం జరిగే సూచనలు కనిపించడం లేదు.

ఆంధ్రప్రదేశ్ ఆర్థిక పునర్ నిర్మాణం ప్రాజెక్టుకు 2310 కోట్లు, విద్యుత్ సంస్కరణలకు 4200 కోట్లు, రోడ్ల కోసం 336 కోట్లు వెరసి 12,000 కోట్లు విదేశాలనుండి అప్పు తెచ్చి మనం వడ్డీల వూబిలో దిగబడిపోతున్నాం. సంక్షేమ రాజ్యం పోయి కన్సల్టెన్సీల రాజ్యం వచ్చింది. గాంధీగారు స్వదేశీ అంటే యిప్పుడు విదేశీ అంటున్నారు. 30 లక్షల కోట్లు ఖర్చుకాగల విజన్ 2020 పై ఘనంగా ప్రచారం జరుగుచున్నది.

2005 నాటికి సంపూర్ణ అక్షరాస్యత సాధిస్తామని ప్రభుత్వం అంటున్నది. అది ఆచరణలో జరిగితే మనకంటే సంతోషించేవారు మరొకరు వుండరు. అయితే అందుకు చిత్తశుద్ధితో కూడిన కృషి అవసరం. అందుగురించి మన మహాసభలలో కూడా ఒక పత్రం విడుదల చేయాలనుకుంటున్నాం.

## యు.టి.యఫ్. ఆవిర్భావం

అవకాశవాద విధానాలు పెచ్చుపెరిగి, ప్రాంతీయ విద్వేషాలు పడగవిప్పి, కేడరు వారి వైషమ్యాలు అవదులు దాటిన సమయంలో సమైక్య శంఖారావంతో ఐక్యఉపాధ్యాయ ఫెడరేషన్ 1974 ఆగష్టు 10న ఆవిర్భవించింది . దానికి అవసరమైన నిబంధనావళి, అనువైన పాలసీ స్టేటుమెంటు 1974 అక్టోబరు 20,21, తేదీలలో జరిగిన ప్రథమ మహాసభలో రూపొందించుకొని అందుకనుగుణంగా 19-1-75 న తెలంగాణాకు విస్తరించాము.

అత్యవసర పరిస్థితులలో ఉద్యమాన్ని కంటికి రెప్పలా కాపాడుకొని, మిగిలిన సంఘాలు అత్యవసర పరిస్థితికి, 20 పాయింట్లకు స్వాగతం పలుకగా మనం ఏటికి ఎదురీది, పెంచినపని గంటలు, బడిదినాలకు, నేటివిటీ ఉత్తర్వు, నిర్బంధ రిటైరుమెంటులకు వ్యతిరేకంగాను పోరాడి రాష్ట్ర వ్యాప్తంగా సదస్సులు నిర్వహించి వాటన్నిటిని రద్దు చేయించాము. ఎమర్జన్సీలో ఉపాధ్యాయులు తమ హృదయాలలో శాశ్వత స్థానాన్ని యిచ్చి ఉద్యమాన్ని పెంచి పోషించారు. ఉద్యమం విశ్వరూపం ఖమ్మంలో 1977 ఆగష్టు 17,18 తేదీలలో రెండవ మహాసభలలో కనిపించింది. అత్యవసర పరిస్థితిలో తమకు అండగా నిలిచిన

సంఘానికి 5 వేలమంది ఉపాధ్యాయులు మహాసభలలో పాల్గొని తమ అండదండలు తెలిపారు.

1978లో కష్టపడి సాధించుకున్న పేకమిటీలో రిటైరుమెంటు సౌకర్యాలు 58 సంవత్సరాలకు పెరిగానా ప్రభుత్వం అమలు జరువ నిరాకరిస్తే కార్య కేంపెయిన్ జరిపి సాధించుకున్నాము. 1976 లో మన సంఘపక్షాన తూర్పు రాయలసీమలో శ్రీ యం. మాధవరావుగారిని ఎం.ఎల్.సి.గా నిలిపి, గెలిపించుకొన్నాం. సింగరాజు ఓటమి పాలైనారు. 1981 లో ఎయిడెడ్ ఉపాధ్యాయుల పక్షాన పోరాడి డైరెక్టు పేమెంట్‌ను ఏ విధమైన అగ్రిమెంట్లు లేకుండా సాధించుకున్నాం.

ఈ విజయాల ఫలితంగా భీమవరంలో 1981 ఆగస్టు 16,17,18 తేదీలలో 10 వేలమంది ప్రతినిధులతో మూడవ మహాసభలు జయప్రదంగా జరిగాయి.

1982 లో చరిత్రాత్మకమైన రీగ్రూపింగ్ వేతనాల సాధనకై మొదట యు.టి.యఫ్. సెక్రటేరియట్‌లో చర్చించి, ఫ్యాప్టోలో ప్రతిపాదించి, అది అంగీకరించిన తర్వాత పోరాటానికి పిలుపు యివ్వడం జరిగింది. 1982 డిశంబరు 17న ఒకరోజు సమ్మెచేసి రీగ్రూపింగ్ వేతనాలపై 1000 (యస్).జి.ఓ. సాధించుకొన్నాము. గ్రామ ప్రాంతాలకు ఇంటిఅద్దె అప్పడే వచ్చింది.

రీగ్రూపింగ్ ఫలితాలు 1986 పేస్కేళ్లలో కనిపించింది. రీగ్రూపింగ్‌పై 10,15 స్కేళ్లుయివ్వడంతో పెరుగుదల గణనీయంగా వుంది. 1984లో రాష్ట్ర వ్యాప్తంగా 50 వేలమందికి పి.ఎ.టి.పై శిక్షణా తరగతులు నిర్వహించి, వేలాదిమంది ఉపాధ్యాయులు పరీక్షలలో ప్యాసయి, 15 సం॥ల స్కేలు పొందుటకు సహకరించాము. ఈ సందర్భంలోనే 1986 జనవరి 8,9,10 తేదీలలో విజయవాడలో 10 వేలమంది ప్రతినిధులతో అత్యంత వైభవంగా నాల్గవ మహాసభలు జరిగాయి. సభ్యత్వంలో, పత్రికలో, ప్రచురణల విభాగంలో అభివృద్ధి సాధించిన సంవత్సరంగా 1989 నిలిచిపోతుంది. మనం ఎలక్ట్రానిక్ టైపుమిషను కొనుక్కొని ప్రచురణల విభాగాన్ని అభివృద్ధి చేసుకున్నాం.. మరోకరకంగా మనం పెద్ద మనుషుల ఒప్పందానికి విరుద్ధంగా తెలంగాణాకు విస్తరించామని, అన్ని మానేజిమెంట్లను ఒకటిగా కలిపామని, అన్ని కేడర్లను కలిపి సంఘాన్ని పెట్టామని మనలను ఎద్దేవా చేసినవారు 1974-89 కాలంలో మన ప్రగతి చూసినవారు, తాము చేసిన తప్పను సరిదిద్దుకొని, వారు కూడా ఆంధ్ర తెలంగాణా కలిపి సమైక్య ఉద్యమాలు నిర్మించుకొన్నారు. మనం 1974 లో నిర్ణయించుకొన్న మార్గం ఎంత సరైనదో దీనితో ధృవపడింది. ఈసందర్భంగా 1989 జూన్ 22-25 తేదీలలో నెల్లూరులో మన 5వ మహాసభలు 10 వేలమంది ప్రతినిధులతో ఘనంగా జరిగాయి.

ఆంధ్రప్రదేశ్‌లో శాసనమండలి ఏర్పాటు చేయాలని ప్రభుత్వం తిరిగి సంకల్పించగా ప్రాథమికోపాధ్యాయులకు కూడా ఓటింగు హక్కు కల్పించాలని, నియోజకర్గాలు పునర్ విభజించాలని, అసెంబ్లీలోను, పార్లమెంటులోను పిటీషన్లు పెట్టి 23-5-93న 50 వేల కార్డులు దేశ ప్రధానికి పోస్టు చేశాము. హైదారాబాద్‌లో జరిగిన మత ఘర్షణలను నిలవరించాలని ప్రదర్శనలు చేశాము.

కేంద్రంలో బిజూ పట్నాయక్ కమిటీ రిపోర్టుకు వ్యతిరేకంగా 1991 నవంబరు 29న, 1992 జూన్ 16న కార్మికులు, ఉద్యోగుల ఐక్యకార్యచరణ కమిటీ సమ్మె చేస్తే మనం మద్దతు తెలియజేశాం. 1992 నవంబరు 25 న ఢిల్లీలో జరిగిన బ్రహ్మాండమైన ప్రదర్శనకు 100 మంది యు.టి.యఫ్. పక్షాన పాల్గొని కేంద్ర, రాష్ట్రప్రభుత్వ విధానాలకు తీవ్ర నిరసన తెలియజేశారు. 9-9-93న ఆలిండియా సమ్మెలో మనం కూడా పాల్గొన్నాము. అలాగే 11-12-99 సమ్మెలో కూడా పాల్గొన్నాము.

1992 ఆగష్టు 8,9 తేదీలలో రంపచోడవరంలో వేయిమందితో ఏజన్సీ సదస్సు జరిపి, తర్వాత 45 అంశాలపై చర్చలు జరిపాము.

1992 సెప్టెంబరు 21న 5000మందితో మన సంఘ పక్షాన బ్రహ్మాండమైన ప్రదర్శన జరిపాము. ఫ్యాప్టో,జాక్టాలు కలిసి పోరాటాలు సాగించి 1993 మార్చి 3,4 తేదీలలో చర్చలు జరిపి ఒప్పందానికి వచ్చికొన్ని సమస్యలు పరిష్కరించుకున్నాం. అందులో మున్సిపల్ ఉపాధ్యాయుల జీతాలకు బడ్జెట్ కంట్రోలు తొలగించకోవడం ముఖ్యమైనది.1993 మన సమైక్య పోరాట ఫలితంగా పే కమిటీ రిపోర్టు రప్పించుకొని, అమలు జరిపించుకొన్నాం.

యు.టి.యఫ్.కు జి.ఓ. 15 తేదీ 13-1-88 ద్వారా ప్రభుత్వ గుర్తింపు సాధించుకున్నాం తర్వాత పోరాటం సాగించి జి.ఓ. 716 తేది 26-12-9 ద్వారా జాయింట్ స్టాఫ్ కౌన్సిలులో సభ్యత్వం తెచ్చుకున్నాం. తర్వాత శాశ్వత సభ్యత్వం జి.ఓ. 287 తేది 9-7-97 ద్వారా సాధించుకొన్నాం.

క్యూబాకు ఆహారధాన్యాలు మందులు అందకుండా అమెరికా దిగ్బంధనం చేసినప్పడు మన సంఘపక్షాన రూ. 12,000/- లకు పైగా ఆర్థికంగా సహకరించాం. ఈ సమయంలోనే 1993 ఆగష్టు 8,9,10 తేదీలలో గుంటూరులో 6వ మహాసభలు 10 వేలమంది ప్రతినిధులతో జరిగాయి. అనేక సంధర్బాలలో ఐక్యకార్యాచరణలో మనం ముందుండి పోరాటాలలో భాగస్వాములమయ్యాము. 14-9-93 నుండి దశల వారి పోరాటాలలో జె.ఎ.సి. తో కలిసి ధర్నాలు ప్రదర్శనలు, చివరికి సమ్మె పిలుపు,త తర్వాత ప్రభుత్వం దిగివస్తే చర్చలు సాగించి ఎ.వి.యస్. రెడ్డి కమిటీతో ఒప్పందానికి వచ్చాము.

ప్రభుత్వ గుర్తింపు పొందిన నాల్గు సంఘాలతో 11 సార్లు చర్చలు జరిపి కొన్ని సమస్యలు పరిష్కరించుకున్నాము. వీటి పక్షాన పోరాటానికి పిలుపు యిచ్చి స్పాట్ వేల్యుయేషన్

రేట్లు 12-4-96న పెంచుకున్నాము.

గిరిజన ఉపాధ్యాయుల ద్వితీయ సదస్సు భద్రాచలంలో 96 అక్టోబరు 6,7తేదీలలో 1500 మంది ప్రతినిధులతో జరుపుకున్నాము. 12-2-97న వేయిమందితో హైదరాబాద్‌లో పికెటింగు చేశాము. సింగరేణి సమస్యపై జనరల్ మేనేజరుతో 16-6-96న చర్చలు జరిపాము.

జె.ఎ.సి.పక్షాన పోరాటానికి పిలుపు యిచ్చిన తర్వాత ముఖ్యమంత్రితో 7-2-97 న చర్చలు, కేబినెట్ కమిటీతో, ఫిబ్రవరి 14,25 చర్చలు విఫలంకాగా, సమ్మెకు కూడా పిలుపు యివ్వడం జరిగింది. చివరకు చర్చలు జరిపి అగ్రిమెంటుకు రావడం జరిగింది. డి.ఎ. వాయిదాల చెల్లింపు, వృత్తిపన్ను పాతపద్ధతిలోనే వసూలు, మెడికల్ ఇన్‌వాలిడేషన్ అమలు మిగిలిన 27 సమస్యలపై ఒప్పందానికి వచ్చిపోరాటం విరమించడం జరిగింది.

## ప్రస్తుత రంగం

ఈ సమయంలో 7వ విద్యావైజ్ఞానిక మహాసభలు 12 వేలమంది ప్రతినిధులతో 1997 మార్చి 8,9,10 తేదీలలో ఒంగోలులో జరిగాయి.

ఒంగోలు మహాసభలు అత్యంత జయప్రదంగా జరిగాయి. అన్ని గోష్ఠులు అందరిని అలరించాయి. మహాప్రదర్శన పురప్రజలను ముగ్ధులను చేసింది. ఎగ్జిబిషన్‌లు అందరిని ఆకట్టుకున్నాయి. మహాసభలకు ప్రకాశం జిల్లాలో వసూళ్ళు అయినది మాత్రమే ఖర్చుచేసి, ఇతర జిల్లాల్లో వసూల్లు భవనానికి కేటాయించాము. ఆర్థికంగా కూడా మహాసభలు అత్యంత జయప్రదమయ్యాయి. అన్ని జిల్లాలు కొద్దోగొప్పో మిగుల్చుకొని, తమ జిల్లా అవసరాలు తీర్చుకున్నారు.

## అలిండియా కో - ఆర్డినేషన్ కమిటీ

మనం ఇంతకు ముందు సెకండరీ టీచర్స్ ఫెడరేషన్‌లో వుండేవారం, అది ఆర్భాటం తప్ప ఆచరణలో ఏకార్యక్రమాలు నిర్వహించని పరిస్థితులలో ఆలిండియాలో భావసారూప్యంగల 10 రాష్ట్రాలలోగల 14 సంఘాలతో 1997 మార్చి 15, 16 తేదీల 300 మందితో మద్రాసులో సదస్సు జరిపి కో-ఆర్డినేషన్ కమిటి ఏర్పడింది.

16-7-97న 11 సమస్యలపై డిమాండు డే జరిపాము. మన రాష్ట్రంలో 60 వేలమంది బేడ్జీలు పెట్టారు 10 వేల మందితో 144 కేంద్రాలలో ప్రదర్శనలు నిర్వహించాము. 1998 ఆగష్టు 2,3 తేదీలలో ఆలిండియా కో-ఆర్డినేషన్ కమిటీ కార్యవర్గం జరిపి సమీక్ష చేసుకున్నాము. దేశం మొత్తం పై మన కార్యకర్తలు 10 లక్షలు మంది ప్రదర్శనలలో పాల్గొన్నారు. మన రాష్ట్రంలో సదస్సు 26-4-98న జరిగింది.

రాష్ట్రపతికి 11 సమస్యలపై సంతకాలు చేయించి విజ్ఞాపన పత్రం అందించే కార్యక్రమం యివ్వబడింది.

## పే కమిటీ రిపోర్టు

1997 అగ్రిమెంటు ప్రకారం 1998 జనవరిలో పే కమిటీని నియమించారు, ప్రభుత్వం ఏకపక్షకంగా 99 సెప్టెంబరు వరకు టైం పొడిగించింది.

15-5-98న పే రివిజన్ కమిటీకి మన సంఘపక్షాన మెమొరాండం యిచ్చి దానిని ఒక పుస్తకంగా కూడా తీసుకొచ్చాము.. 8-1-99న ఆయన మనలను చర్చలకు పిలిచారు. చర్చలలో అధికారులతో మన సెక్రటేరియట్ సభ్యులు పాల్గొన్నారు.

కేంద్ర పద్ధతిలో వేతనాలు, 40 శాతం ఫిట్‌మెంటు, కనీస వేతనం రూ. 3950/- లు ప్రయిమరి, అప్పర్ ప్రయిమరిలలో ప్రధానోపాధ్యాయ పోస్టులు, 400 దాటిన పాఠశాలలో 2 పి.ఇ.టి. పోస్టులు, అదనపు యింక్రిమెంట్లు ఆర్టు, క్రాఫ్టు, హైస్కూలు హెడ్మాష్టరు అందరికి యివ్వాలని, అనేక సూచనలు వారి ముందు వుంచి చర్చించాము. ఇతర రాష్ట్రాల పేకమిటీ రూల్సు కూడా అందజేశాము.

ప్రభుత్వం పే కమిటీ రిపోర్టు యిచ్చేదానికి సెప్టెంబరు నెలాఖరు వరకు టైం పొడిగించింది. అంటే ఎన్నికలు అయిపోయిన తర్వాత వారి యిష్టము వచ్చిన రీతిలో అమలు జరపాలని ప్రభుత్వం అనుకున్నది.

జూలై 5న జె.ఎ.సి. సమావేశం జరిగింది. జూలై 14న ధర్నాలు, 18 నుండి సమ్మె చేయాలని నిర్ణయించింది. జె.ఎ.సి. నాయకత్వం 3 బ్యాచీలుగా ఏర్పడి రాష్ట్ర పర్యటన చేయాలనుకోవడం జరిగింది. ప్రెస్ కాన్ఫరెన్సు జరిపి ప్రభుత్వానికి నోటీసు యిచ్చాము.

10-7-99న ముఖ్యమంత్రి నుండి ఆహ్వానం వచ్చింది. పే కమీషన్ రిపోర్టు ఎన్నికకు ముందే రప్పిస్తానని కేబినెట్ సబ్‌కమిటీని ఏర్పాటు చేసి జె.ఎ.సి.తో చర్చించి తర్వాతే పి.ఆర్.సి అమలు జరుపుతానని చెప్పారు. దానితో సమ్మె వాయిదా వేసుకొని ధర్నా రద్దు చేసుకున్నాము.

ఆ మర్నాడే ఎన్నికల నోటిఫికేషన్ వచ్చింది 14-7-99న ముఖ్యమంత్రిని కలిసి చర్చలు జరిపాము. అన్న ప్రకారం అన్నీ అమలు జరుపుతానని చెప్పారు. 15-7-99 కేబినెట్ సమావేశంలో కేబినెట్ సబ్ కమిటీని వేశారు. పి.ఆర్.సికి వర్తమానం పంపారు. కేంద్ర ఎన్నికల కమిటీకి లెటరు పెట్టారు.

21-7-99న పి.ఆర్.సి. రిపోర్టు వచ్చింది. అదేరోజు కేబినెట్ సబ్‌కమిటీ మనతో చర్చలు జరిపింది. మనం తీవ్ర

అసంతృప్తిని వెలిబుచ్చాం. వెయిటేజి 40 శాతం యివ్వాలని, రద్దు చేసినవన్నీ పునరుద్ధరించాలని, ఇంటి అద్దె లిమిట్ పెంచాలని, రివ్యూ కమిటీని వేయాలని, ఉపాధ్యాయుల వేతనాలు ఒకస్టేజిపైన పెట్టాలని, స్టాగ్నేషన్ యింక్రిమెంట్లు యివ్వాలని కోరుట జరిగింది.

జిల్లాలో ఏక్షన్ కమిటీ పర్యటన జరిగింది. హైదరాబాద్ ప్రదర్శన చాలా జయప్రదంగా జరిగింది. జూలై 24న ముఖ్యమంత్రితో చర్చలు జరిగి ఒప్పందానికి రావడం జరిగింది. ఒక రిద్దరి కారణంగా వేయిటేజి 30 రావలసింది 25 కే అంగీకారం. కుదిరింది. పి.ఆర్.సి. రద్దు చేసిన వాటిపై ముఖ్యమంత్రి నోటిమాట తప్ప వ్రాతపూర్వక అగ్రిమెంటు జరుగలేదు.

వెయిటేజి 25 శాతం సాధించుకోవడంగాని,స్కేల్సు 1-7-98 నుండి పొందడం గాని ఎన్నికల తర్వాత అయితే సాధ్యమయ్యే విషయాలు కావు.

4-11-99న ముఖ్యమంత్రిని కలిసి, పి.ఆర్.సి. లో రిటైర్డు టీచర్లకు జరిగిన అన్యాయం సరిచేయాలని, 1-7-98 నుండి గ్రాట్యుటి, కమ్యూటేషన్‌లు యివ్వాలని, సబ్జిక్వెంటు యింక్రిమెంట్లు, అవకాశం యివ్వాలని, పి.ఆర్.సి. రద్దు చేసిన అదనపు యింక్రిమెంటుకు, కుటుంబ నియంత్రణ యింక్రిమెంట్లు, స్టాగ్నేషన్ యింక్రిమెంట్లు, బి.సి.ఎ. వెంటనే అమలు జరుపుతానని చెప్పారు.

30 సం॥రాల సర్వీసు, 55 సం॥రాల వయసుకే ఉద్యోగులను రిటైరుచేసే ప్రమాదం గురించి అడుగగా అటువంటిదేమీ లేదని చెప్పారు. ప్రకటనలు మాత్రం మామూలుగానే వస్తున్నాయి. ఉపాధ్యాయులు, ఉద్యోగులు భయాందోళన చెందుతున్నారు.

దానిని బట్టి ఆటోమేటిక్ అడ్వాన్సుమెంటు స్కేల్సు వున్నాయి. స్పాన్ 24 సంవత్సరాల వరకు వున్నది. వీటి అమలుకు, సవరణలకు, విద్యాశాఖ కార్యదర్శి, డైరెక్టరు గార్లను కలిసి రాయబారములు జరుపుట జరిగింది. సెకండరీగ్రేడ్ స్కేలు రూ. 3,850/- గా సవరించాలని కోరాం.

యల్.యఫ్.డైరెక్టరు గారితో అనేక దఫాలుగా రాయబారములు జరిపి, ఫిక్షేషనుచేయు విధానం గరించి, జిల్లా ఆఫీసులలో జరుగుచున్న కాల విలంబన గురించి. జిల్లాలో తేదీల ప్రకారం ఫిక్షేషనుల షెడ్యూలు యిచ్చుట గురించి రాయబారములు జరిపి, వివరణ ఉత్తర్వులు యిప్పించాము.

మన జిల్లా శాఖలు ఈ సారి, యల్.యఫ్. ఆఫీసులలో జయప్రదంగా ఫిక్షేషనులు చేయించగలిగారు. అవినీతికి తావు లేకుండా చాలా జిల్లా శాఖలు జాగ్రత్త పడ్డాయి. డి.ఇ.ఓ. ఆఫీసులో ఎయిడెడ్ టీచర్ల ఫిక్షేషనులు గురించి తేదీలలో యిప్పించుకొనే విషయంలో గట్టి కృషి చేశారు.

ఆంధ్ర ఏరియాలో మున్సిపాలిటీలలో ఫిక్షేషనుల నిమిత్తం మున్సిపల్ అడ్మినిస్ట్రేషన్ డైరెక్టరు గారితో రాయబారములు జరిపి, వివరణ యిప్పించుటకు కృషి చేశాము.

## ఉపాధ్యాయ సంఘాల పోరాట సమితి (USPS)

17 సంఘాలతో పోరాట సమితి ఏర్పడింది. వాటి అధ్యక్ష ప్రధాన కార్యదర్శులు యాక్షన్ కమిటీగా, 6 మందితో స్టీరింగ్ కమిటీగా ఏర్పడి పోరాట కార్యక్రమానికి పిలుపు యిచ్చింది. కేబినెట్ సబ్‌కమిటీతో కూడా చర్చలు జరిగాయి. ముఖ్యమంత్రితో అర్ధరాత్రి చర్చలు జరిపి సమ్మె విరమించడం జరిగింది.

538, 505, జి.ఓ.లు వచ్చాయి.కొందరికి డి.ఇ.ఓ. ప్రమోషనులు, దానిని బట్టి మరికొందరికి ప్రమోషనులు వచ్చాయి. ఎయిడెడ్ ఉపాధ్యాయులకు 62 జి.ఓ. పంచాయితీ రాజ్ ఉపాధ్యాయులకు 63 జి.ఓ.ల ప్రకారం ట్రజరీల ద్వారా జీతాలు యివ్వాలని ఉత్తర్వులు వచ్చినా, అమలు జరుగలేదు. పంచాయితీరాజ్ ఉపాధ్యాయులకు అన్నిచోట్లా బ్యాంకులు లేవు.

అలాగే ఎయిడెడ్ ఉపాధ్యాయులకు డిశంబరు నుండి జీతాలు లేవు 92 కోట్ల గ్రాంటు వస్తే తప్ప జీతాల సమస్య పరిష్కారం కాలేదు. ఎయిడెడ్ ఉపాధ్యాయుల అన్ ఎయిడెడ్ సర్వీసు విషయమై కోర్టుకు వెళ్లాలని నిర్ణయించాము. అందరకు జిల్లాల వారీగా బ్యాచీలు తయారుచేయాలి.

## పోరాట కార్యక్రమాలు

అప్రంటీస్ ఉపాధ్యాయులకు నోషనల్ యింక్రిమెంట్లు యిస్తానని ప్రభుత్వం అమలు జరుపలేదు. వారికి యిచ్చే స్టైఫండ్ పెంచలేదు. అప్రంటీస్ కాలంలో కుటుంబనియంత్రణ, అదనపు అర్హతల యింక్రిమెంట్లు యివ్వటం లేదు. దీనిపై ముఖ్యమంత్రికి కార్డు క్యాంపెయిన్ నిర్వహించాము.

అలాగే పంచాయితీ రాజ్ ఉపాధ్యాయుల జీతాలు ట్రజరీల ద్వారా యిచ్చే విషయంలో ఎదురైన యిబ్బందులు తొలగించాలని, దానిపై ప్రభుత్వ ప్రధాన కార్యదర్శిగార్కి విజ్ఞాపన పత్రంపై సంతకాలు చేయించి, పంపాలని కార్యక్రమం యిచ్చాం.

ఇది అప్రంటీస్ టీచర్లలోను పంచాయితీ రాజ్ ఉపాధ్యాయులలోను మంచి స్పందన తెచ్చింది. అలాగే పంచాయితీ రాజ్ ఉపాధ్యాయుల జీతాలపై మనమే కార్యక్రమం తీసుకోవడాన్ని ఉపాధ్యాయులు హర్షించారు.

కొందరు మానేజర్లు ఎయిడెడ్ ఉపాధ్యాయుల జీతాల బిల్లు తదితర అంశాలపై హైకోర్టుకు వెళ్లి స్టే తెచ్చారు. దానిపై మనం మూడవ పార్టీగా చేరాము. స్టే వెకేట్ చెయించే ప్రయత్నం చేస్తున్నాము.

దీనిపై కొందరు కోర్టుకు వెళ్తే దానికి డబ్బులు వసూలు చేస్తున్నారు. ఇది సరైంది కాదని, చెప్పాము. సంఘమే ఆ ఖర్చులు భరిస్తుందని అందరికి తెలియజేశాము.

## గిరిజన సొసైటీ పోరాట కార్యక్రమం

గిరిజన పాఠశాలలు సొసైటీకి అప్పగించాలని ప్రభుత్వం 1998 జూన్‌లో ఉత్తర్వులు యిచ్చింది. దానిపై మనం కరపత్రాలు వేసి ప్రచారం చేశాం. జిల్లాలో సదస్సులు నిర్వహించాము. ముఖ్యమంత్రికి కార్డు క్యాంపెయిన్ నడిపి, 1-3-99 నుండి 10-3-99 వరకు 10 వేల కార్డులు పోస్టు చేయించాము.

## డిమాండ్లు

1. గిరిజన విద్యాలయాలను సొసైటీలకు అప్పగించకుండా ప్రభుత్వం ఆధ్వర్యంలోనే వుంచాలి.
2. గిరిజన విద్యాలయాలకు సర్వీసు రూల్సు ప్రకటించాలి.
3. గిరిజన సంక్షేమ ఉపాధ్యాయులకు ప్రమోషన్ సౌకర్యాలు కల్పించాలి.
4. గిరిజన విద్యావికాస కేంద్రాలన్నిటికి ఒ.బి.బి. పథకం వర్తింపచేయాలి.
5. గిరిజన విద్యాలయాల టీచరు పోస్టులకు ట్రజరీ కంట్రోలు లేకుండా జీతాలు యివ్వాలి.
6. గిరిజనేతర తాత్కాలిక ఉపాధ్యాయులను, ప్రభుత్వ, పంచాయితీ పాఠశాలలలో విలీనం చేసి ఉద్యోగ భద్రత కల్పించాలి.
7. గిరిజన సంక్షేమ కమీషనరుతో జరిగిన ఒప్పందంపై ఉత్తర్వులు యివ్వాలి.

తర్వాత గిరిజన ఉపాధ్యాయుల సమస్యలపై కలిసి వచ్చే 9 సంఘాలను కలుపుకొని ఏక్షన్ కమిటీని శ్రీ డి. రామిరెడ్డి కన్వీనరుగా ఏర్పాటుచేసి పోరాట కార్యక్రమానికి పిలుపు యిచ్చాము.

1999 జూలై 29, 30, 31 తేదీలలో నల్లబేడ్జీలు ధరించి ఉపాధ్యాయులు పాఠశాలలో పని చేశారు. 7-8-99న హైదరాబాద్ లో ప్రదర్శన జరుపాలని నిర్ణయించి కార్యక్రమం యిచ్చాం. విద్యార్థి, యువజన సంఘాలు గిరిజన ప్రజలు మన పోరాటానికి మద్దతుగా ముందుకు వచ్చారు. ఎన్నికలకు ముందు ఎదురైన పరిస్థితులు ప్రభుత్వం గమనించి వెనకడుగు వేసింది. 6-7-99న అంటే ప్రదర్శనకు ఒకరోజు ముందు ప్రభుత్వం, పాఠశాలలను సొసైటీలకు అప్పగించే నిర్ణయాన్ని ఉపసంహరించుకొని, ఆవిషయం మనకు తెలియజేసింది. జిల్లాలకు ఫోన్లు చేసినా వార్త అందని కారణంగా 2 వేలమంది గిరిజన ఉపాధ్యాయులు ప్రదర్శనకు వచ్చారు. చివరికి దానిని విజయోత్సవ సభగా జరుపుకున్నాము.

## సింగరేణి కాలరీస్ యాజమాన్యం

ఈ మానేజిమెంటులోని టీచర్లకు, ప్రభుత్వ పంచాయితీరాజ్ టీచర్లకు అమలు జరిగే అనేక సౌకర్యాలు అమలు జరుగుటలేదు. మన ప్రాతినిధ్యాలతో, యింక్రిమెంట్లు, ఫిక్షేషనులు వంటివి కొన్ని పరిష్కారమైనా, ముఖ్యమైన సమస్యలు అపరిష్కృతంగానే వున్నాయి. హైదరాబాద్‌లో వున్న కంపెనీ అధికారులను, సింగరేణి మానేజిమెంటును కలిసి మాట్లాడినా సమస్యలు అపరిష్కృతంగానే వున్నాయి.

సింగరేణి యాజమాన్యం స్కూల్సు ఉపాధ్యాయుల సదస్సు జరుపాలని ఇప్పటికే మూడుసార్లు తేదీలు నిర్ణయించుకొన్నా వాయిదాలు పడుతున్నాయి. మహాసభల తర్వాత తేదీ నిర్ణయించి సదస్సు జరుపాలి.

## మున్సిపల్ ఉపాధ్యాయుల సమస్యలు

మునిసిపల్ ఉపాధ్యాయులకు బడ్జెట్ కంట్రోలు తొలగించినా, వారికి జీతాలు సక్రమంగా రావడం లేదు. వారినుండి మినహాయించిన పి.యఫ్. జనరల్ ఫండ్‌లో కలిసిపోయి మున్సిపల్ అధికారులు ఇతర అవసరాలకు వాడుకొని రిటైరయినప్పుడు సక్రమంగా యివ్వడంగాని, వారికి రావలసిన 12 శాతం వడ్డీ చెల్లించడంగాని చేయుట లేదు. వారిని ప్రోవిన్షలైజేషన్ చేస్తామని కేబినేట్ సబ్‌కమిటీ హామీ యిచ్చినా, కేబినెట్ చర్చించినా ఇంతవరకు ఉత్తర్వులు రాలేదు. ఏ ఉత్తర్వు వెలువడినా, తిరిగి డైరెక్టరు మున్సిపల్ అడ్మినిస్ట్రేషన్ నుండి కమ్యూనికేట్ కానిదే సదరు ఉత్తర్వులు అమలు జరుగుట లేదు.

వెంటనే మున్సిపల్ ఉపాధ్యాయుల సమస్యలు పరిష్కరించవలసినదిగా ప్రభుత్వాన్ని కోరినా ఫలితం కనిపించుట లేదు. దీనిపై ఆందోళన కార్యక్రమం చేపట్టవలసి వున్నది.

# రాయబారాలు

అలాగే ప్రభుతం నుండి సమస్యలు పరిష్కరించుకొనుటకు ముఖ్యమంత్రి, విద్యామంత్రి, పంచాయితీరాజ్ మంత్రి, విద్యాశాఖ కార్యదర్శి, పాఠశాల విద్యాసంచాలకులను తరచు కలిసి సమస్యల పరిష్కారానికి కృషి చేస్తున్నాము.

11-11-99న విద్యాశాఖమంత్రి కడియం శ్రీహరిగారు ఉపాధ్యాయ సంఘాలతో సమావేశం ఏర్పాటుచేసి సమస్యలు తెలుసుకొనేదానికి ఒక మంచి ప్రయత్నం చేశారు. త్వరలో సమస్యలపై పూర్తిస్థాయి సమావేశం ఏర్పాటు చేస్తానని హామీ యిచ్చారు. నెల్లూరు జిల్లా అక్రమబదిలీలపై కృషి చేసినా, వారి గేప్ పీరియడు సమస్య ఇంకా పరిష్కారం కాలేదు.

# ఉత్తర భారత విజ్ఞాన విహార యాత్ర

## ఉపాధ్యాయులకు మాత్రమే

**30 ఏప్రిల్ 2000 నుండి 20 మే 2000 వరకు 20 రోజులు**

సోదర ఉపాధ్యాయులారా!

తృతీయ సహస్రాబ్ది మరియు యిరవై ఒకటవ శతాబ్దిలోనికి ప్రవేశించిన ఆనంద సమయమును పురస్కరించుకొని ఉత్తర భారతములోని ప్రపంచ ప్రఖ్యాతిగాంచిన, సుప్రసిద్ధమైన, చారిత్రాత్మకమైన, ప్రకృతి రమణీయమైన, మహారాష్ట్ర మధ్యప్రదేశ్, ఉత్తరప్రదేశ్ మరియు ఢిల్లీ రాష్ట్రాలలోని యాత్రాస్థలములను ఉపాధ్యాయులు సతీసమేతంగా సందర్శించుటకు చక్కటి, అరుదైన, అతితక్కువ ఖర్చుతో వేసవి సెలవులలో తేది: 30-4-2000 నుండి 20-5-2000 వరకు 20 రోజులు విజ్ఞాన విహార యాత్ర ఏర్పాటు చేయబడుచున్నది. ఈ టూరులో నర్మదా, యమునా, గంగా మరియు సరయూనదులలో స్నానమాచరించ వచ్చును. వింధ్యసాత్పుర, హిమాలయాలలోని అరణ్యాలను తిలకించు అవకాశము లభించును. ఈ యాత్రలో అనేక ప్రాంతాలతోపాటు ఈ క్రింది తెలుపబడిన ప్రధానమైన దర్శనీయమైన స్థలములు కలవు.

శిరిడి-ఎల్లారలోని హిందు, బౌద్ధ,జైన గుహలు మరియు కైలాష్ దేవాలయము - దౌలతాబాద్ ఖిల్లా - విజయస్థూపము - బీబీకామక్ ఖారా - పంచకి - అజంతా గుహలు - శిల్ప సంపదకు ప్రసిద్ధిగాంచిన ఖజురహో దేవాలయాలు - ఝాన్సీకోట - ఆగ్రా - తాజ్‌మహల్ - పోర్ట్ - ఫతేపూర్‌సిక్రి - పంచమహల్ - భులంద్‌గేట్ - ఒంటి స్థంభం మేడ - గోకుల్ - మధుర - బృందావన్ - ఢిల్లీ- రాజఘాట్ - శక్తిస్థల్ - వీరభూమి - శాంతివన్ - ఎర్రకోట - చాందినీచౌక్ గురుద్వార్ - జుమామసీద్ - బిర్లామందిర్ - కుతుబ్‌మినార్ - లక్ష్మి టెంపుల్ - లోటస్ బిల్డింగ్ - ఇందిరానివాస్ - గాంధీజి నివాస్ - తీన్‌మూర్తి భవన్ - పార్లమెంటు, రాష్ట్రపతి భవన్ - ఇండియాగేట్ , హరిద్వార్ - మానస దేవాలయము - గాజు బిల్డింగ్ - మాతా మందిర్ - రుషికేష్ - లక్ష్మణ్ మరియు రామ్ జూలాలు నైనిటాల్ - లక్నో - అయోధ్య - కాశి (వారణాసి) కాశి విశ్వనాధ దేవాలయము, హరిశ్చంద్రఘాట్ - బనారస్ విశ్వవిద్యాలయము, సారనాథ్ దేవాలయము సాంచి స్థూపము - బౌద్ధ మ్యూజియము - అలహాబాద్ - త్రివేణి సంగమము నెహ్రూ గారి స్వస్థలము- నర్మదా జలపాతము కరీంనగర్‌లోని రాజరాజేశ్వరి దేవాలయము.

ఈ టూరు 2+2 సీట్లు కలిగి, కుషన్ మరియు వీడియో సౌకర్యము గల డీలెక్స్ బస్సులు రెండు ఏర్పాటు చేయబడును. ఒక బస్సులో 19 జతలు సతీసమేతంగా కూర్చొను అవకాశము కలదు. రెండు బస్సులలో మొత్తం 38 జతలకు మాత్రమే వీలు కలదు. ప్రతి బస్సుకు యిద్దరు డ్రైవర్స్ ఉంటారు. రోజుకు దాదాపు 400 కి.మీ. చొప్పున బస్సు ప్రయాణం చేయును.

ఈ టూరులో భోజనము ఉదయం 9 గంటలకు సాయంత్రం 6 గంటలకు అందచేయబడును. గ్యాసుపై వండి, వంటవాళ్ళు వడ్డిస్తారు. నెంబర్ 1 రకము బియ్యంతో అన్నము, కర్రీ, చట్నీ, సాంబారుతో సకాలంలో లభించును.

శిరిడి - ఔరంగాబాద్ - ఖజురహో - ఆగ్రా - నైనిటాల్ - కాశీలలో సత్రములు ఏర్పాటు చేయడం జరుగును. ఔరంగాబాద్ - ఆగ్రా - ఢిల్లీ - కాశి చోట్ల సందర్శనము రెండు రోజులు ఉండును. దాదాపు ప్రతి రెండవ రోజు రాత్రి సత్రములో విశ్రాంతి ఉంటుంది.

ఈ టూరుకు అగు ఖర్చు ఈ విధంగా నున్నది. బస్సుకు, రోడ్ పర్మిషన్స్, స్టేట్ ఎంట్రీ టాక్సులు, సిటీ ఎంట్రీలు, పార్కింగ్ ఛార్జీలు, దర్శనీయ స్థలము వద్ద టికెట్స్, టోల్‌గేట్స్, సత్రాలు, గైడ్స్, డ్రైవర్, ఇతరమామూళ్ళు, రోప్‌వే ఛార్జీ, బోట్ ఛార్జీలు, హరిద్వార్, రుషికేశిలలో ఆటో చార్జీలు అన్ని కలుపుకొని జతకు పదివేలు రూపాయలుగా అనుభవముగా నిర్ణయించడం జరిగింది. ఈ 20 రోజులలో మీరు టీ, పెరుగు మరియు వస్తువులు కొన్నచో అదనంగా మీరే భరించాలి.

ఈ టూరులో పాల్గొను ఉపాధ్యాయులు సతీసమేతంగా ఏ జిల్లా వారయినా పాల్గొనవచ్చును. పాల్గొను వారు 10-4-2000 నాటికి బస్సు కొరకు జతకు రెండు వేల రూపాయలు ఈ క్రింది నా అడ్రసుకు డి.డి. ద్వారా పేరు, తండ్రి/ భర్త పేరు, వయస్సు, పోస్టల్ చిరునామాతో సహా పంపాలి. తేది: 20-4-2000 సం॥ నాటికి భోజన సామాగ్రి సమకూర్చుకోవడానికి జతకు రెండు వేలు పంపాలి. మిగిలిన ఆరు వేలు 30-4-2000నాడు బస్సు ఎక్కునపుడు చెల్లించాలి. 30-4-2000 ఉదయము విజయవాడలోను, మధ్యాహ్నము 2 గంటలకు నకిరేకల్‌లోను, సాయంత్రం 6 గంటలకు హైదరాబాద్‌లోను మీరు బస్సు ఎక్కుటకు సిద్ధముగా నుండును.

యింకా వివరములు కావలసిన వారు రాత్రి 9 గంటల నుండి ఉదయం 7 గంటల వరకు 08682-52586కు ఫోన్ చేసి తెలుసుకొనండి. ఈ టూరులో ఎటువంటి మార్పులు, చేర్పులు ఉండవు.


**దేవుపల్లి ఓంప్రకాశ్**

విటి కాలనీ, నకిరేకల్ - 508211. నల్గొండ జిల్లా టూరు వాలెంటరీ ఆర్గనైజర్

అలాగే పరీక్షల కమీషనరును, ప్రభుత్వ ప్రధానకార్యదర్శిని, ఆర్థికశాఖ కార్యదర్శిని కూడా కలిసి, సమస్యల పరిష్కారం గరించి, తాత్కాలిక సహాయం, నాల్గవ ఆర్థిక సర్వేబహిష్కరణ గురించి వివరించాము.

చివరకు విద్యాశాఖ కార్యదర్శితో చర్చల అనంతరం ఈ ఒక్కసారి ఆర్థిక సర్వే చేయుటకు, ఇకపై ఏఇతర పనులు అప్పగించమని జి.ఓ. కూడా యిచ్చారు. అయినా తిరిగి మామాలుగానే జిల్లాలో అధికారులు ఉపాధ్యాయులచే కోళ్లు, కుక్కలు, ఇతర సర్వేలు అప్పగిస్తూనే వున్నారు.

మెడికలు ఇన్సూరెన్సు స్కీము ఉద్యోగులకు, ఉపాధ్యాయులకు అమలు జరుపుటకు మూడుసార్లు చర్చలు జరిపి ఒప్పందానికి వచ్చాము. ప్రభుత్వంతో చర్చల సందర్భంలో మెడికల్ ఇన్సూరెన్సు కంపెనీలు నెలకు రూ. 90/- లు చెల్లించమన్నాయి. అందులో సగం ప్రభుత్వం భరించేలా ఒప్పందానికి కూడా వచ్చాము.

రాష్ట్రంలో గల 1400 హాస్పిటల్సులో ఈ స్కీము అమలుజరిపి దానికి, కుటుంబ సభ్యులందరికి ఒక్కొక్కరికి 2 లక్షలు మించకుండా సంవత్సరానికి 10 లక్షల వైద్య ఖర్చులు భరించేలా "న్యూ ఇండియా ఇన్స్యూరెన్సు" కంపెనీ మొదట అంగీకరించి తర్వాత మడత పేచీ పెట్టింది. నెలకు రూ. 600/- కట్టాలని, తర్వాత రూ. 464/- అని రెండుసార్లు సమావేశాలు వాయిదావేసింది. ఆ స్కీము ఇక కొండెక్కినట్లే.

ఉపాధ్యాయుల బదిలీలలో, అపాయింటుమెంట్లలో, రేషనలైజేషనులలో కౌన్సిలింగ్ విధానాన్ని చాలాకాలంగా ప్రభుత్వంతో చర్చలలో ప్రతిపాదించి అమలు జరిపించుకున్నాము. అందులో కూడా మరికొన్ని మార్పులు ప్రతిపాదించాం. అధికారులు అంగీకరించారు. అయితే ఈ సంవత్సరం బదిలీలు లేని కారణంగా అవి వెలుగుచూడలేదు.

## ఐక్యఉపాధ్యాయ ప్రచురణలు

ఐక్యఉపాధ్యాయ ప్రచురణలపరంగా ఇప్పటికి 16 భాగాలు అధ్యాపకదర్శినిలు వేశాము. అందులో సగంభాగాల వరకు 2, 3 ముద్రణలు వేశాము. వ్యాయామదర్శిని మూడు ముద్రణలు వేశాము. ఉపాధ్యాయులు అపూర్వంగా ఆదరించారు. అడ్మినిస్ట్రేటివ్ ట్రిబ్యునల్, యల్.యఫ్. ఆఫీసులు కూడా ఆర్డరు యిచ్చి మన నుండి కొన్నారు.పనుల వత్తిడితో ఈ సంవత్సరం తేవలసిన 17 వ భాగం తేలేకపోయాము. త్వరలో తీసుకురాగలము. అయిపోయిన అధ్యాపకదర్శిని 1,2,3,13,15 భాగాలు పునర్ ముద్రణ చేయాలి. ఆ పనికూడా యీ సంవత్సరం చేయగలం. ఇవిగాక ఇండెక్సుగైడు, ఎ.పి.జి.యల్.ఐ.సి., సర్వీసు రూల్సు, పి.ఆర్.సి.లపై చిన్న చిన్న పుస్తకాలు వేశాము. మహాసభల సందర్భంగా మరికొన్ని చిన్న పుస్తకాలు తేవాలకున్నా తేలేక పోయాము.

ప్రచురణల విభాగం పరంగా 1981 నుండి ప్రఖ్యాతి చెందిన యు.టి.యఫ్.డైరీ తెస్తున్నాము. ఆ తర్వాత అన్ని సంఘాలు ఆ పనిచేస్తున్నాయి. మన డైరీ, కేలండరు, టేబుల్ కేలండరు ప్రాచుర్యం పొందాయి. 25 వేలు వేసినా చాలని స్థితి వచ్చింది . ఈ సంవత్సరం రజతోత్సవాల సందర్భంగా డీలక్సు డైరీ వేశాము. డైరీ కవర్లు అందించే దానిలో ఏర్పడిన ఇబ్బందుల కారణంగా నకాలంలో యివ్వలేకపోయాము. జనవరి 10 వచ్చినా 23,000 మాత్రమే అందివ్వగలిగాము. వాల్ కేలండర్లు అదనంగా 5 వేలు, టేబుల్ కేలండర్లు 20 వేలు వేశాము. తగ్గిన డైరీలుకై తిరిగి ఆర్డరు యిచ్చాము. మహాసభలలో అవి యివ్వాలనుకున్నాము.

యిప్పటివరకు అందిన మేరకు తూర్పుగోదావరి 3,330, ప.గో. 2,514, ప్రకాశం 2,400, ఖమ్మం 2,305, నెల్లూరు 2,100, కృష్ణ 1,631, గుంటూరు 1,513, చిత్తూరు 1,145, నల్గొండ 1,000, హైదరాబాద్ 1,125, అనంతపురం 500, శ్రీకాకుళం 448, విజయనగరం 412, వరంగల్లు 336, మహబూబ్‌నగర్ 317, కర్నూలు 300, విశాఖపట్నం 250, అదిలాబాద్ 205, కడప 185, నిజాంబాద్ 80, కరీంనగర్ 44, ఇతరములు 1053. ఇవిగాక 25,000 లకు తగ్గిన రెండు వేలు, మరికొన్ని అదనంగా వేయించి మహాసభలలో యివ్వాలనుకున్నాము.

## యు.టి.యఫ్. విద్యావిషయక విభాగము

ఉపాధ్యాయుల సమస్యలపైనేగాక, వారు వృత్తిలో ఎదుర్కొనుచున్న దైనందిన సమస్యలపై, బోధనా పద్ధతుల మెరుగుదలకు, విద్యార్థులను తీర్చి దిద్దే షయంలో ఉపాధ్యాయులకు సహకరించాలనే ఉద్దేశ్యంతో విద్యావిషయక విభాగం ప్రారంభించాము.

4వ తరగతి పిరియడ్ ప్లానులు బాగానే వున్నాయని పేరు వచ్చింది. తర్వాత 3, 5 వేయాలని ప్రయత్నించినా, చేయలేకపోయాము. దానిని పూర్తి చేయవలసి వున్నది.

1983 నుండి ప్రతి సంవత్సరం 10 వ తరగతి టెస్టు పేపర్లు తీసుకువస్తున్నాము. అవి మంచి ప్రాచుర్యం పొందినవి. 80 శాతం మార్కులు మనం ప్రచురించిన పుస్తకంలోంచి వస్తున్నాయి. మొదట తక్కువగా వేసినా, ప్రస్తుతం 15 వేలు వేస్తున్నాము. అతి తక్కువ రేటుకి అనగా రూ. 22/-లకే అన్ని సబ్జెక్టులు కలిపివేయడంతో సామాన్యులకు చాలా అందుబాటులో వున్నాయనే పేరు వచ్చింది.

నో కాస్టు, లో కాస్టు టీచింగ్ ఎయిడ్స్‌పైఖమ్మం జిల్లాశాఖ పరంగా పుస్తకం ప్రచురించి అటువంటి టీచింగ్స్ ఎయిడ్స్ తయారుచేయడంలో శిక్షణ యిస్తున్నారు.

గత సంవత్సరం 10వ తరగతి పుస్తకాలు మారాయి. దీనితో 1 నుండి 10 వరకు పుస్తకాల మార్పు కార్యక్రమం పూర్తి అయినది. ఆ సందర్భంగా విద్యాశాఖ అధికారులుజరిపిన చర్చలలో మనం పాల్గొన్నాము.

## యు.టి.యఫ్. భవనాలు

మన ఉద్యమ అవసరాలకు, కార్యకర్తలు ఒకచోటకుచేరి పనులు చేసుకునే కేంద్రాలుగా ఉపపయోగపడేదానికి, సమావేశాలు నిర్వహించుకొనేదానికి భవనాలు ఎంతో ఉపయోగపడతాయి. అలాగే మన భవనాలు, విద్యావిజ్ఞాన కేంద్రాలుగా,సాహితీ, సాంస్కృతిక నిలయాలుగా ఉపయోగపడాలని, సాటి ప్రజాసంఘాల సమావేశాలకు ఉపయోగపడాలని, పనుల మీద వచ్చే కార్యకర్తలకు వసతి కల్పించేదానికి మన భవనాలు పనికి వచ్చేలా వుండాలని మన ఆశ అందుకు నిర్విరామంగా కృషి చేస్తున్నాం.

**1) హైదరాబాద్ చెన్నుపాటి భవనం :** హైదరాబాద్‌లో 1983 సెప్టెంబరు 19న భవనం ప్రారంభించుకున్నాము. ప్రక్కన ఖాళీస్థలం అమ్మకానికి వస్తే కొన్నాము. దాని నిర్మాణానికి ఎంప్లాయీస్ వెల్‌ఫేరు ఫండు నుండి అప్పు తీసుకొని భవనం నిర్మించాలని అప్లయి చేశాము. 30 లక్షలు శాంక్షను అయింది. ఎ.పి.టి.యఫ్. విజయవాడ సంఘం వారు మరొక 7 సంఘాల్ని కలుపుకొని కోర్టుకు వెళ్ళి భవనాలకు అప్పులు యివ్వరాదని స్టే తెచ్చి శాంక్షను అయిన అప్పును నిలుపుదల చేయించారు.

దానికి కొంత బాధపడ్డాం, మన కార్యకర్తలలో పట్టుదల పెరిగింది. ఏమైనా భవనం కట్టాలనే నిర్ణయించుకొన్నాం, మన జిల్లాలు వసూలు చేయగల్గినంత చేశాయి. ఆ తర్వాత వివాహాలు తదితర శుభకార్యాల సందర్భంగా విరాళాలు సేకరించి పంపారు.

పాత భవనాన్ని కలుపుకొని మూడు అంతస్థుల భవనం నిర్మించుకొన్నాము. క్రింద ఆఫీసు,పై అంతస్థులో గెస్టురూములు, అందులోనే పత్రికా కార్యాలయము, లైబ్రరి, రంగారెడ్డి జిల్లా కార్యాలయము, హైదరాబాద్ జిల్లా కార్యాలయాలు వున్నాయి. మూడవ అంతస్థులో 300 మంది పట్టే సమావేశ మందిరము కుర్చీలతో సహా వున్నది.

జిల్ల నుండి కుర్చీలకు పిలుపు యివ్వగా తూర్పుగోదావరి జిల్లా నుండి 92, ప.గో 37, ప్రకాశం 37, గుంటూరు 27, ఖమ్మం 20, వరంగల్ 10 చిత్తూరు 6 అనంతపురం 6, మహబూబ్‌నగర్ 5, కృష్ణ 4, విశాఖ 3, శ్రీకాకుళం 2, నల్గొండ 2, నెల్లూరు 1, అదిలాబాదు 1, రంగారెడ్డి 1, **మొత్తం 255 వచ్చాయి.** నెల్లూరు జిల్లా నుండి సీలింగ్ ఫాన్లు 25 ఇచ్చారు. శ్రీ వైయల్. నారాయణ గుంటూరు జిల్లా నుండి హాలులో మైక్ ఏర్పాటు చేశారు. అలాగే మీటింగుహాలులోనికి మహబూబ్‌నగర్‌జిల్లా నుండి కృష్ణారెడ్డిగారు ఒక గడియారం యిచ్చారు.

చరిత్రలో అవకాశం అన్నప్పుడల్లా రాదు. వచ్చినపుడు స్పందించడం. మన ధర్మం భవనం పునాదిలో మనవంతు ఎంత, ఆఫీసు అలంకరణలో ఏమి యిచ్చాము అని ప్రతి ఒక్కరు ప్రశ్నించుకోవాలి. ఆఫీసుకు యిచ్చినవస్తువులుగాని, డబ్బుగాని కలకాలం వుండిపోతాయి. ఆ విధంగా చిరంజీవి కాగల్గుతాం.

భవనానికి వెచ్చించిన నిధులు

| | |
|---|---|
| 1. జిల్లాలనుండి వసూళ్లద్వారా | 11,38,329-00 |
| 2. గుంటూరు మహాసభల నుండి | 2,14,979-00 |
| 3. ఒంగోలు మహాసభల నుండి | 7,48,135-00 |
| 4. కాకినాడ మహాసభల నుండి | 8,49,000-00 |
| 5. సంఘం నుండి | 6,30,000-00 |
| 6. విద్యావిషయక విభాగం నుండి | 4,00,000-00 |
| 7. ప్రచురణల నుండి | 3,00,000-00 |
| 8. ఇతరములు | 72,559-00 |
| **మొత్తం** | **43,53,002-00** |

మొదటి నుండి విజయవాడ గాని, ఖమ్మంగాని, భవన కట్టడాల నిర్మాణాలు పర్యవేక్షించిన శ్రీ పి.సత్యనారాయణగారు అహోరాత్రులు ఆరోగ్యాన్ని సైతం లెక్కచేయక హైదరాబాద్ పనులు పర్యవేక్షించారు.

**2విజయవాడ చెన్నుపాటి భవనం :** 9-12-98న ప్రారంభించుకున్నాము. ఇది గత 24 సంవత్సరాలుగా సంఘ ప్రధాన కార్యాలయంగా వుపయోగపడింది. ఇప్పుడు ప్రాంతీయ కార్యాలయంగా వుపయోగపడుతున్నది. 2 అంతస్థులతో, ఒక గోడవున్, ఒక ఔట్ హౌస్ వున్నాయి. ప్రస్తుతం మనం కొంతభాగం వాడుకొని, మిగతాది అద్దెకు యిచ్చాము. పై అంతస్తులో విజయవాడ పట్టణ కార్యాలయం వున్నది. విశాలమైన స్థలంలో ఫలవృక్షాలు కూడా వున్నాయి.

3. తూర్పుగోదావరి జిల్లా ఏలూరులో శ్రీ వి. సూర్యనారాయణరాజు పేరుతో కాకినాడలో రెండు అంతస్థుల భవనం వున్నది.
4. పశ్చిమగోదావరిజిల్లా కాకినాడలో శ్రీ పి.వి. సుబ్బరాజు గారి పేరుతో రెండు అంతస్థుల భవనం వున్నది.
5. కృష్ణాజిల్లా మచిలీపట్నంలో శ్రీ నాదెళ్ళ సీతారామాచారి పేరుతో భవనం వున్నది. పైన ఒక అంతస్థు వేసే ప్రయత్నంలో వున్నారు.
6. గుంటూరులో మైనేని గారి పేరుతో రెండు అంతస్థుల భవనం వున్నది.
7. ప్రకాశంజిల్లా ఒంగోలులో మూడు అంతస్థుల భవనం ఉన్నది. ఖాళీ స్థలంలో భవనం నిర్మించే దానికి మరొక చోట స్థలం కొన్నారు.
8. నెల్లూరులో రెండు అంతస్థుల భవనం నిర్మించుకొన్నారు.
9. చిత్తూరు జిల్లా చిత్తూరులో భవనం నిర్మించుకొన్నారు.

10. చిత్తూరు జిల్లా తిరుపతిలో మరొక భవనం ఏర్పాటు చేసుకొన్నారు.

11. ఖమ్మం జిల్లాలో విశాలమైన రెండంతస్థుల భవనం నిర్మించుకున్నారు.

12. నల్గొండ జిల్లాలో భవనం వున్నది. ఖాళీస్థలంలో మీటింగు హాలు వేయాలనుకుంటున్నారు.

13. మహబూబ్‌నగర్ జిల్లాలో భవనం వున్నది. పైన ఒక అంతస్థు వేసి మొత్తం నిర్మాణం పూర్తి చేయాలనుకుంటున్నారు.

14. కరీంనగర్‌లో ఒక భవనం కొని కార్యాలయం ప్రారంభించారు.

15. అదిలాబాద్‌లో స్థలం వున్నది. దానిలో తాత్కాలికంగా షెడ్ వేసి కార్యాలయం నిర్వహిస్తూ వున్నారు.

16. నిజాంబాద్‌లో స్థలం కొన్నారు భవనం నిర్మించాలి.

17. కర్నూలులో కొన్న భవనం అమ్మివేసి, ఫిక్స్‌డ్ డిపాజిట్‌లో వేశారు. సెంటరు ప్లేస్‌లో భవనం కొనాలని చూస్తున్నారు.

18. వరంగల్లు జిల్లాలో స్థలం వున్నది. దానిని అమ్మివేసి, సెంటరులో స్థలం సేకరించి, భవనం కట్టాలనుకొంటున్నారు.

ఇవి గాక మండల పట్టణ స్థాయిలో మనకు స్థలాలు, భవనాలు చాలా జిల్లాలలో వున్నాయి. తూర్పు గోధావరి జిల్లా అమలాపురంలోను, ప్రకాశం జిల్లా పర్చూరులోను, నెల్లూరు జిల్లా ఆత్మకూరు, కలువాయి, పొదలకూరు, నాయుడు పేటలోను, ఖమ్మంజిల్లా మధిర, భద్రాచలం వైరాచిత్తూరులోను భవనాలు ఉన్నాయి.

## అమరజీవుల వర్థంతి సభలు

ఉద్యమం గురించి త్యాగాలు చేసి అసువులర్పించిన అమరజీవులను తలచుకొంటూ ఉద్యమాన్ని వారు పయనించినమార్గంలో నడుపుతామని, సదావారి ఆదర్శాలు మననం చేసుకొంటూ ఘనలుకుంటామని విన్నవించుకొంటూ వారి సంతాపసభలలోదీక్షగైకొని వారిఆశయాలకు పునరంకితమవుతామని విన్నవించుకొంటున్నాం.

రాష్ట్రస్థాయి కార్యకర్తగా పనిచేసి అమరులైన వారి గురించి కొన్ని వివరాలు.

1. **అమరజీవి చెన్నుపాటి** : 1907 లో జన్మించి 1968 డిశంబరు 9న మరణించారు. ఉద్యమ నిర్మాతగా, ఉపాధ్యాయుల హక్కుల పరిరక్షకుడుగాపేరు పొందారు. ఆయన వర్థంతి ప్రతి సంవత్సరము డిశంబరులో రాష్ట్రవ్యాప్తంగా వారంరోజులు జరుపుతున్నాము.

2. **అమరజీవి పి.వి. సుబ్బరాజు** : 1917 మార్చి 19న జన్మించి 15-12-83న మరణించారు. ఆయన వర్థంతిసభ పశ్చిమగోదావరిలో జరుపుతున్నారు.

3. **అమరజీవి మైనేని** : 12-1-90 న మరణించారు. యు.టి.యఫ్. ఏర్పడినప్పటి నుండి మరణించేవరకు పత్రిక ప్రధాన సంపాదకుడుగా పనిచేశారు. వారి వర్థంతి గుంటూరు జిల్లాలో జరుపుతున్నారు.

4. **అమరజీవి నాదెళ్ల సీతారామాచారి** : యు.టి.యఫ్. ఏర్పడినప్పుడు వ్యవస్థాపక అధ్యక్షులుగా పనిచేసి, 5-7-91న మరణించారు. వారి వర్థంతి సభ బందరులో జరుపుచున్నారు. వారు పత్రిక సంపాదకకర్గ సభ్యులుగా కూడా పనిచేశారు.

5. **అమరజీవి శ్రీ వి. సూర్యనారాయణరాజు** : 1946 లోజన్మించి జిల్లా ఉద్యమాన్ని అభివృద్ధి చేసి 26-3-93న మరణించారు. వారి వర్థంతి జిల్లా వ్యాప్తంగా ప్రతి సంవత్సరం పక్షం రోజులు నిర్వహిస్తున్నారు.

6. **అమరజీవి చంద్రమౌళి** : కొద్దికాలమే రాష్ట్ర కార్యదర్శిగా పనిచేశారు. భవన నిర్మాణానికి పునాదులు వేశారు 19-5-89న మరణించారు.

వీరుగాక రాష్ట్ర ఉద్యమగీతం రచించిన కదలి గంగిశెట్టి, కృష్ణాజిల్లా ప్రధాన కార్యదర్శిగా పనిచేసిన ఏసురత్నం, తదితరులు మరణించారు. ఈ రజతోత్సవ సంవత్సరంలో వారందరికి అశృతర్పణ చేస్తున్నాము. నిండు హృదయంతో నివాళులర్పించుకొంటున్నాము.

## ఆడిట్ గురించి కొన్ని విషయాలు

మనం ఉద్యమం స్థాపించినప్పటి నుండి, సంఘం, పత్రిక ప్రచురణల పేరుతో తప్ప వ్యక్తుల పేర్లతో అకౌంట్సు లేవు. వాటిని ప్రతి సంవత్సరం ఆడిట్ చేయించి సంవత్సరానికి రెండుసార్లు జరిగే కౌన్సిలు సమావేశాలలో ఆమోదం పొందుచున్నావు. ఉపాధ్యాయుల నుండి వసూలు చేసే ప్రతి పైసా సద్వినియోగం కావాలనేది, జమా ఖర్చులు చెప్పాలనేది యు.టి.యఫ్. ధ్యేయం. పొదుపుగా ఖర్చు చేయడమనేది అమరజీవి చెన్నుపాటి పెట్టిన ఒరవడి మనం ఆ మార్గంలోనే పయనిస్తున్నాము.

నాలుగు జిల్లాలు 1) ప్రకాశం 2) తూర్పుగోదావరి 3) నెల్లూరు 4) చిత్తూరు జిల్లాలో సంక్షేమ పథకాలు వున్నాయి. సంఘీభావ వివరాలు వసూలు చేసి ఉపాధ్యాయ కుటుంబాలను ఆదుకోవడం బాగానే వున్నది. కాని కార్యకర్తలపై పనిభారం చాలా ఎక్కువగా వున్నది. వీటి ఆడిట్‌లో కూడా సంఘీభావ విరాళాలు సరిగా వసూలుగాక మూలధనమే ఖర్చు అవుతున్నట్లు వున్నది.

ఈ సంవత్సరం 5 జిల్లాలు ఇంకా ఆడిట్ చేయించుకోవాలి. రజతోత్సవ మహాసభలకు ఎక్కువ ఖర్చు పెట్టారనేది ఒకటి. బ్యాంకు అకౌంట్లు కొన్ని జిల్లాలలో లేకపోవడం అకౌంట్సు విషయంలో

క్లాసులు నిర్వహించాలని ఆడిట్ కమిటీ సూచించింది. జమలకు కూడా అసలు రశీదులు యివ్వని జిల్లాలు కొన్ని వున్నాయి. రజతోత్సవాలలో మిగిలినది ఫిక్సెడ్ డిపాజిట్లలో వేయాలి.

## రజతోత్సవాలు, 8వ విద్యావైజ్ఞానిక మహాసభలు

1974 ఆగష్టు 10న స్థాపించుకున్న మన సంఘానికి, 1999 ఆగష్టు 10కి 25 సం॥లు నిండాయి. ఆరోజు రాష్ట్ర వ్యాప్తంగా పతాకావిష్కరణలు జరుపుకొన్నాము. సాయంత్రం ప్రదర్శనలు కూడా జరుపుకొన్నాము. ఆరోజు నెల్లూరు పట్టణంలో 1500 మందితో ఊరేగింపు జరిగింది. సంఘం విచ్ఛిన్నమైపోయిందని ప్రచారం చేసిన వారు మ్రాన్పడిపోయి ప్రదర్శనను తిలకించారు. కార్యకర్తల ఉత్సాహానికి అవధులు లేవు.

రాష్ట్రవ్యాప్తంగా అన్ని జిల్లాలో పతాకావిష్కరణలు కన్నుల పండుగగా జరిగాయి. ఆ తర్వాత రాష్ట్ర వ్యాప్తంగా మండల పట్టణశాఖల రజతోత్సవాలు, జిల్లా రజతోత్సవాలు బ్రహ్మాండంగా జరిగాయి. ఎక్కడ చూపినా యు.టి.యఫ్. పతకాలు, ఎక్కడ చూపినా ప్రదర్శనలు , ఏ పత్రిక తిరగవేసినా, రజతోత్సవ వార్తలు, అరుణ తోరణాలు, అరుణ పతాకాల రెప రెపలతో రాష్ట్రమంతా నిండిపోయింది.

జిల్లా రజతోత్సవాల సందర్భంలో జిల్లా నిర్మాణాలు కూడా జరిగిపోయాయి. నూతన కమిటీలు ఎన్నికైనాయి. యువకులు కార్యరంగంలోనికి వచ్చారు. ఉత్సాహంతో భాధ్యతలు నిర్వహించేదానికి ముందడుగేస్తున్నారు.

ఆర్థికంగా మహాసభలుజయప్రదమయ్యే పరిస్థితులు కనిపిస్తున్నాయి. ముందుగా తూర్పు గోదావరి జిల్లాలో మే నెలలో జరిపిన ఫండు కేంపెయిన్‌లో రాష్ట్ర, జిల్లా నాయకులు పాల్గొన్నారు. ఆ క్యాంపెయిన్‌లో 13 లక్షలకు పైగా వచ్చాయి. కార్యకర్తలు నెల జీతాలు వేశారు. సామాన్య టీచర్లెవరూ వేయికి తక్కువ యివ్వలేదు.

ఈ విషయం యు.టి.యఫ్. వార్తల ద్వారా, ఐక్యఉపాధ్యాయ పత్రిక ద్వారా రాష్ట్రమంతా వ్యాపించింది. రాష్ట్రవ్యాప్తంగా కార్యకర్తలు తూర్పుగోదావరి జిల్లాతో స్ఫూర్తిపొంది అదేబాటలో పయనించారు. వేలు, లక్షలు వసూలు చేశారు. రజతోత్సవాల జయప్రదానికి రాచబాట పడింది.

ఈ విధంగా తూర్పుగోదావరిజిల్లాలో రాష్ట్రం యిచ్చిన కోటా 30 లక్షలు వసూలు చేసి, మహసభల జయప్రదానికి మార్గం సుగమమం చేశారు.

జిల్లాలకు యిచ్చిన కోటాలు కూడా యించుమించు వసూలు అయ్యాయి. మండల పట్టణ రజతోత్సవాలకు 10 లక్షలు, జిల్లా రజతోత్సవాలకు 10 లక్షలు, రాష్ట్ర భవననిధికి 10 లక్షలు పోను రూ. 8,49,000/- వచ్చాయి. ఇంకా కొద్దిగా రావాలి.

జిల్లాలు అదనంగా కూడా వసూలు చేసుకొని, వారి వారి భవనాలు నిర్మించుకోవడంగాని, అప్పులు తీర్చుకోవడంగాని అదనపు వనరులు చేకూర్చుకోవడంగాని, ఫిక్సెడ్ డిపాజిట్లు చేసి, ఉద్యమ అవసరాలకు ఉపయోగించుకోవడం గాని చేశారు.

ఇవిగాక ఏ జిల్లాలో ఏ పదార్థాలు, ఏ సరుకు దొరికితే అవి తెచ్చేదానికి అన్ని జిల్లాలు ఆనందంతో సమాయత్తమవుతున్నాయి. మహాసభలలో పెట్టే భోజనాలలో అవి తమ వంతు పాలుపంచుకొనే దానికి అన్ని జిల్లాల నుండి తెచ్చారు.

మహాసభలు జరిగిన జిల్లాల నుండి పతాకయాత్రలు వస్తున్నాయి. 16వ తేదీన నెల్లూరులో బయలుదేరి, ఒంగోలు, గుంటూరు, విజయవాడ మీదుగా దారిలో ఖమ్మం, భీమవరం, రాజమండ్రి పతాకాలు కలుపుకొని 18వ తేదీ ఉదయానికి కాకినాడ మహాభల ప్రాంగణానికి చేరుకుంటారు.

## సంఘ నిర్మాణ విషయాలు

చెన్నుపాటి ఆశయాలబాటలో సామాజిక స్పృహతో పయనిస్తూ రాష్ట్రవ్యాప్తంగా ఏకైక పెద్ద సంఘంగా ఎదిగిన సంస్థ మనది. అధ్యయనం, అధ్యాపనం, సామాజిక స్పృహ ధ్యేయంగా, హక్కులు బాధ్యతులు రెండు నేత్రాలుగా, అవినీతికి వ్యతిరేకంగా పనిచేయడమే జీవన విధానంగా అకడమిక్ విషయాలలో ఆదర్శప్రాయంగా వుద్యమాన్ని తీర్చిదిద్దే సప్తస్వరాలతో పయనిస్తున్న సంస్థమనది.

అట్టి సంస్థకు అంకితభావంతో పనిచేసే కార్యకర్తలు ఎంతో అవసరం. అందుకే మనం ప్రతి సంవత్సరం జిల్లాలో రాష్ట్రస్థాయిలో కార్యకర్తలకు, మహిళలకు ఉద్యమ క్లాసులు నిర్వహిస్తూ, కార్యకర్తలకు శిక్షణ యిస్తూ, నిప్పులాంటి నిజాయితీతో పనిచేసే కార్యకర్తలను రూపొందించుకొంటూ ముందడుగేస్తున్నాము.

మన జిల్లాల పరిస్థితి క్లుప్తంగా యిలావుంది. 12 వేల నుండి 5 వేల వరకు సభ్యత్వం ఉన్నవి. తూర్పు గోదావరి, పశ్చిమ గోదావరి,కృష్ణ, గుంటూరు, ప్రకాశం, నెల్లూరు, చిత్తూరు, ఖమ్మం, 8 జిల్లాలు, 3000 నుండి 1000 వరకు సభ్యత్వం కల్గినవి శ్రీకాకుళం, విజయనగరం, కడప, కర్నూలు, అనంతపురం, వరంగల్లు, కరీంనగర్, అదిలాబాద్, నల్గొండ, మహబూబ్‌నగర్, హైదరాబాద్ 11 జిల్లాలు 1000 లోపు గలవి విశాఖపట్నం, నిజామాబాద్, మెదక్, రంగారెడ్డి 4 జిల్లాలు వున్నాయి. రెండుమూడుస్థానాలలో వున్న జిల్లాల సభ్యత్వం పెరిగితే తప్ప లక్ష అధిగమించలేము.

## యు.టి.యఫ్. వార్తలు సర్క్యులర్లు

1981 సెప్టెంబరు నెలలో యు.టి.యఫ్. వార్తలు ప్రారంభించాము. ఈనాటికి 18 సంవత్సరాలు నిండి 19వ

సంవత్సరంలో ప్రవేశించింది. ఉద్యమ చరిత్రలో గణనీయమైన స్థానం కల్గి వున్నది. ప్రధానమైన పాత్ర నిర్వర్తించింది. కార్యకర్తల హృదయంలో ప్రముఖ స్థానాన్ని పొందింది.

సభ్యత్వ వివరాలు, పత్రికల ఫలితాలు, పోరాట కార్యక్రమాలు, ఉద్యమం సాధించిన విజయాలు ఉపాధ్యాయులకు, కార్యకర్తలకు ఎప్పటికప్పుడు ఎరుకపరుస్తూ, వారిని సమాయత్తం చేసుకుంటూ, యు.టి.యఫ్. వార్తలు సముచిత పాత్ర నిర్వర్తించింది.

ప్రతినెల తప్పనిసరిగా 20,21, తేదీలలో వార్తలు పంపిస్తున్నాం. అవి రాష్ట్ర కౌన్సిలర్లకు, జిల్లా సెక్రటేరియట్ సభ్యులకు, మండల పట్టణ అధ్యక్ష ప్రధాన కార్యదర్శులకు 2000 మందికి పైగా పంపిస్తున్నాము.

సర్క్యులర్లు ప్రతినెల తప్పక ఒకటి అయినా పంపుతున్నాము: ఈ నివేదిక కాలంలో 13 సర్క్యులర్లు కార్యకర్తలకు, జిల్లా సంఘాలకు సూచనలతో పంపిస్తున్నాము.

అలాగే ఆయా సందర్భాలలో ఎదురైన సమస్యలపై జిల్లాలు, రాష్ట్రసంఘం అనేక కరపత్రాలు ప్రచురిస్తూ మన వైఖరిని తెలియజేస్తూ వున్నాము. ప్రభుత్వ వైఖరి, కార్యకర్తలకు వివరిస్తూ , వారిని అప్రమత్తం చేసుకొనేదానికి, జాగ్రత్తలు తీసుకుంటూ వున్నాము.

కుల వివక్షత సందర్భంలోను, ప్రపంచ బ్యాంకు నిర్ణయాల గురించి వెల్లడిస్తూ కరపత్రాలు వేశాము. గిరిజన పోరాటాల గురించి, రజతోత్సవాల గరించి, కరపత్రాలు ప్రచురించాము.

## సంఘ సమావేశాలు

సమావేశాలు సాధారణంగా ప్రతినెల జరుపుకొని నిర్ణయాలు తీసుకొని. వాటిని అమలు జరుపుతున్నాము. సమిష్టి నాయకత్వం, సమిష్టి నిర్ణయాలతోనే సంఘాన్ని నడుపుతున్నాము.

| | | |
|---|---|---|
| 1999 | మార్చి 13,14 తేదీలు | 26వ వార్షిక జనరల్ కౌన్సిల్ కాకినాడ. |
| 1999 | ఏప్రిలు | 14 సెక్రటేరియట్ హైదరాబాద్ |
| 1999 | జూన్ 10 | కార్యవర్గం విజయవాడ |
| 1999 | జూలై 10 | సెక్రటేరియట్ హైదరాబాద్ |
| 1999 | ఆగష్టు 21 | జనరల్ కౌన్సిల్ హైదరాబాద్ |
| 1999 | సెప్టెంబరు 25 | సెక్రటేరియట్ విజయవాడ |
| 1999 | అక్టోబరు 15 | సెక్రటేరియట్ ఒంగోలు |
| 1999 | నవంబరు 21 | కార్యవర్గం హైదరాబాద్ |
| 1999 | డిశంబరు 19 | కార్యవర్గం విజయవాడ |

ఈ నివేదికా కాలంలో 2 జనరల్ కౌన్సిలు సమావేశాలు, 3 కార్యవర్గ సమావేశాలు, 4 సెక్రటేరియట్ సమావేశాలు మొత్తం 9 సమావేశాలు జరిగాయి. మే నెలలో మాత్రం సమావేశం జరుగలేదు.

సెక్రటేరియట్ సభ్యుల హాజరు కూడా సంతృప్తికరంగానే వుంది. పనివిధానం అన్నీ మెరుగు.

## రాష్ట్రకార్యాలయం - హోల్ టైమర్లు

హైదరాబాద్ రాష్ట్ర ప్రధాన కార్యలయంగా పనిచేస్తున్నది. అక్కడ అధ్యక్షులు శ్రీ డి. రామిరెడ్డి, సహాధ్యక్షులు శ్రీ యన్. నారాయణ. ప్రధాన కార్యదర్శి శ్రీ ఎ. వెంకటస్వామి హోల్‌టయిమర్లుగా వుండి బాధ్యతలు ,చూస్తున్నారు. పత్రిక ప్రధాన సంపాదకులు శ్రీ కె. జోజయ్య పత్రిక పనులు చూస్తూ విజయవాడ ప్రాంతీయ కార్యాలయం బాధ్యతలు అకడమిక్ విభాగ బాధ్యతలు చూస్తున్నారు. శ్రీ పి. సత్యనారాయణ ఇది వరకు భవన నిర్మాణ పనులు చూసేవారు. ఇప్పుడు పత్రికకు సహకరిస్తున్నారు. సంపాదక వర్గ సభ్యులుగా శ్రీమతి సంయుక్త, శ్రీయం, మాణిక్యరెడ్డి పత్రిక బాధ్యతలు చూస్తున్నారు. అలాగే హైదరాబాద్ ఆఫీసులో శ్రీ జి. సత్యనారాయణ,శ్రీ ఎన్. భగవాన్లు, శ్రీ. ఇ. లక్ష్మణ్‌రావు గుమస్తాలుగా పనిచేస్తున్నారు. అలాగే ఒక వాచ్‌మెన్, ఒక స్వీపరు వున్నారు. కంప్యూటరుపై పనిచేయుటకు ఒకరిని ఏర్పాటు చేసుకోవాలి.

## సంఘ-పత్రిక-ప్రచురణల ఆర్థిక పరిస్థితి

సంఘానికి ఏవిధమైన అప్పులు లేవు. గతంకంటె నిర్వహణ ఖర్చులుపెరుగుతాయి. ప్రయాణాలరేట్లు పెరిగిన కారణంగా అదనపు ఖర్చులు వుంటాయి. సిబ్బందిని ఇంకా పెంచవలసి వున్నది. రెండు లక్షలకు పైగా నిల్వ వున్నది.

పత్రిక న్యూస్ ప్రింటు అయిపోయింది దానిని కొనాలి అందుకు రెండు లక్షలు పైగా అవుతుంది. అదిగాక వున్న రెండు లక్షలతో పత్రిక నిర్వహణ చూడాలి. నెలకు 50 వేల చొప్పున చూస్తే ఇదీ నాల్గు నెలలకు సరిపోతుంది. ప్రకటనలు సేకరించే పని అన్ని జిల్లాలు చేయాలి. జీవిత చందాల విషయం ఆలోచించాలి.

జీవిత చందాలు 7 వేల పత్రికల డబ్బు ఫిక్సెడ్ డిపాజిట్లలో 17 లక్షలు వుంది. దాని వడ్డీతో పత్రిక నిర్వహణ కష్టం.

ఐక్య ఉపాధ్యాయ ప్రచురణల పరంగా నిత్యం పుస్తకాలు

ప్రచురిస్తూ వుండాలి. ఆర్థిక యిబ్బందుల కారణంగా కొన్ని భాగాలు ప్రచురించలేకపోయాము. అచ్చువేసిన వాటికి వెంటనే చేతికి డబ్బురాదు దానికి కొంత సమయం పడుతుంది. హైదరాబాద్, విజయవాడ రెండు భవనాలు కోటికి పైగా విలువకల్గి వున్నాయి. జిల్లాల్లో గల 15 భవనాలు ఒక కోటికి పైగా విలువ చేస్తాయి.

## మన ఆఫీసులో వున్న వస్తువులు

హైదరాబాద్ కార్యాలయంలో, ఇంటర్‌నెట్‌తో కూడిన కంప్యూటరు టీ.వి.లు 2 (ఒకటి కలర్), కర్రటేబిల్స్, 2, కర్ర కుర్చీలు2, ఇనుప బీరువాలు 12, కర్రబీరువాలు 4, అద్దాల బీరువాలు3, రేకులు4, ఇనుప డ్రాయర్లు 5, ఇనుప యస్.టైపు కుర్చీలు (చేతులవి) 16, ఇనుప కుర్చీలు 15, ఫైబరు కుర్చీలు 319, మీటింగు టేబిల్సు3, ఇనుప మంచాలు 3, టైపుమిషన్లు3, డూప్లికేట్స్ 2, సీలింగ్ ఫ్యాన్లు 55 స్టాండు ఫ్యాను 2, టేబుల్ ఫ్యాను 1, ఎలక్ట్రానిక్ టైపుమిషను 1, గడియారాలు 6, గ్యాసుపొయ్యి 1, గ్యాసులైటు 1, మైక్ సెట్టు 2, ప్లేట్లు 100, గ్లాసులు 100, మోటారు సైకిలు 1, మామూలు సైకిలు 1, రేడియో 1, టేపురికార్డర్లు 2, స్టీలు నీళ్ళడ్రమ్ములు 2, వంటసామాన్లు 40, జంపఖానాలు 5. స్టూల్సు 6, జెట్ మోటార్లు (నీళ్ళకు) 2 కలవు. విజయవాడలోని చాలా సామాన్లు హైదరాబాద్‌కు తెచ్చాము.

విజయవాడ కార్యాలయంలో టి.వి.(మామూలుది)1, కర్రటేబిల్సు4, కర్రబీరువాలు2 , రేకు1, అద్దాల బీరువా 1, ఇనుప డ్రాయిరు 1, ఇనుప చేతుల కుర్చీలు 2, కర్ర కుర్చీలు 2, ఇనుప కుర్చీలు 32, మీటింగు టేబుల్ 1, ఇనుప మంచాలు 3, టైపుమిషన్లు 2, డ్యూప్లికేటింగ్ మిషను 1, రేడియో 1, సీలింగ్ ఫ్యాన్లు 23, స్టాండు ఫ్యాను 1, టేబిలు ఫ్యాను 1, నీళ్ల స్టీలు డ్రమ్ము 1, స్టీలు గ్లాసులు 13, స్టూల్సు 6, గడియారాలు 4, గ్యాసు పొయ్యి సిలిండర్సుతో 1, మైక్ 1, జెట్ మోటారు 1, మామూలు సైకిలు 1, జంపఖానాలు 5, జెట్‌మోటారు 1, గ్యాసులైటు 1 కలవు.

## భవిష్యత్ కార్యక్రమం

పంచాయితీరాజ్, ఎయిడెడ్, ఉపాధ్యాయులకు ట్రజరీల ద్వారా జీతాల గురించి జి.ఓ. లు వచ్చినా మనం కోరిన పద్ధతిలో అమలు జరిపించుకోవాలి. మున్సిపల్, ఏజన్సీ, సింగరేణి ఉపాధ్యాయుల సమస్యలపై కార్యక్రమం చేపట్టాలి. నవంబరు 3 అగ్రిమెంటులోని సమస్యలు పరిష్కరింపజేసుకోవాలి. పి.ఆర్.సి. సందర్భంలో ముఖ్యమంత్రి యిచ్చిన హామీలు అమలు జరిపించుకోవాలి. రివ్యూ కమిటీ వేయించుకొని ఉపాధ్యాయులకు షెడ్యూలు 2 వేతనాలతో పాటు మిగిలిన సమస్యలు పరిష్కరించుకోవాలి.

అన్నిటికంటె ప్రధానమైనది ప్రపంచబ్యాంకు షరతుల ప్రకారం, ఉద్యోగ అవకాశాలు తగ్గించేదానికి. జీతాలు క్రమబద్ధం చేసే దానికి ,పెన్షను సౌకర్యాలు కుదించేదానికి ప్రభుత్వం తల పెట్టుచున్న చర్యలను, సమైక్య ఉద్యమ నిర్మాణం ద్వారా అరికట్టాలి.

## ముగింపు

కామ్రేడ్స్ !

గత 10 మాసాల నివేదిక సంక్షిప్తంగా మీ ముందుంచాము. కొంతమేరకు చేయగలిగినా, ఇంకా చేయవలసినది చాలానే వున్నది. జిల్లా రిపోర్టులు దీనికి జోడించి, మీ అమూల్యమైన సూచనలతో భవిష్యత్ ఉద్యమ డాక్యుమెంటుగా దీనిని తీర్చిదిద్దండి.

## చందాదారులకు - కార్యకర్తలకు సూచనలు

1.ఐక్య ఉపాధ్యాయ పత్రిక విజయవాడనుండి హైదరాబాదుకు మారిన కారణంగా తిరిగి ఢిల్లీలో R.N.I మార్పు జరగాలి. అంతవరకు హైదరాబాదులో తాత్కాలికంగా 3 నెలలకు పర్మిషన్ యిచ్చారు. జనవరితో అదికూడా అయిపోయింది. ఢిల్లీ నుండి పర్మిషను ఇంకా రాలేదు. ప్రయత్నం చేస్తున్నాం.

2. రజతోత్సవాల సందర్భంగా ఫిబ్రవరి మార్చి పత్రికలు కలిపి ఒకే సంచికగా తీసుకువస్తున్నాం. అది రెండు నెలలదిగా లెక్కించబడుతుంది.

3.పత్రిక కార్యాలయం విజయవాడ నుండి హైదరాబాదు మారిచాలా కాలమైనా, ఇంకా అడ్రస్ మార్పు గురించి విజయవాడకే రాస్తున్నారు. పత్రిక చందాల డబ్బు కూడా విజయవాడకే పంపిస్తున్నారు. అది సరికాదు. అలా పంపిన వాటికి మాబాధ్యత లేదు.

4.పత్రిక డబ్బు యం.ఓ. ద్వారా పంపువారు యం.ఓ. కమీషను తగ్గించి పంపితే ఎంత డబ్బు తగ్గించి పంపితే అన్ని పత్రికలు తగ్గించి పంపుతాము.

5.పత్రిక చందా రూ. 50/- లు ఎడిటరు ఐక్యఉపాధ్యాయ గగనమహల్ రోడ్ నెం. 7, దోమల్‌గూడ, హైదరాబాదు - 500029 అడ్రసుకు మాత్రమే పంపించండి. యం.ఓ. ఫారం అడుగున పూర్తి అడ్రసు పిన్‌కోడ్‌తో సహా వ్రాయండి.త

6.పత్రిక సంవత్సర చందాలు, జీవితచందాల లిస్టులు టైపు కాగానే జిల్లా శాఖకు ఒక కాపీ పంపిస్తున్నాము. అడ్రసులు సరిగా లేక పోతే వెంటనే వ్రాయండి. పత్రిక అందకపోతే వెంటనే ఒక పోస్టు కార్డు వ్రాయండి.

7.పత్రిక విజయవాడనుండి హైదరాబాదుకు మారిన సంధి కాలంలో సిబ్బంది మారిన కారణంగా కొన్ని ఇబ్బందులు ఎదురైనాయి. చాలా కంప్లయింటులు వచ్చాయి. వాటిని చాల వరకు సరిచేశాము. అసౌకర్యానికి చింతిస్తున్నాము.

ఎడిటరు
ఐక్యఉపాధ్యాయ



# ప్రతికా నివేదిక

కె. జోజయ్య
ప్రధాన సంపాదకులు

అధ్యక్షా!

రాష్ట్ర కౌన్సిల్ సభ్యులారా !

ప్రత్యేకాహ్వానితులారా !

తమందరికి స్వాగతం !

యు.టి.యఫ్ అమూల్య వారసత్వాన్ని కొనసాగిస్తూ, ఉపాధ్యాయులలో సామాజిక చైతన్యాన్ని పెంపొందింపజేస్తూ, హక్కులతో పాటు బాధ్యతలు గుర్తెరిగి, అధ్యయనం, అధ్యాపనం, సామాజిక స్పృహ అను త్రినామాలకు అనుగుణంగా ఉపాధ్యాయులు తమ విధ్యుక్తధర్మాన్ని అంకితభావంతో నెరవేర్చాలని ఉద్భోధిస్తూ, అవినీతి, అక్రమాలకు వ్యతిరేకంగా నికరంగా నిలబడి పోరాడుతూ ఉద్యమాన్ని మునుముందుకు నడిపిస్తూ, ఉత్సాహంగా యీ రజతోత్సవాలలో పాల్గొనుటకు విచ్చేసిన తమందరికి "ఐక్యఉపాధ్యాయ" సంపాదకవర్గం పక్షాన యివే ఉద్యమాభినందనలు.

1997 మార్చి 8,9,10 తేదీలలో ఒంగోలులో జరిగిన సప్తమ మహాసభలలో అప్పటివరకు పత్రిక సాధించిన ప్రగతిని, ఉద్యమవాణిగా అది నిర్వహించిన పాత్రను సమీక్షించుకొన్నాము. సాహిత్య, సామాజిక, కళారంగాలకు పుట్టినిల్లయిన తూర్పు గోదావరి జిల్లాలోని కాకినాడలో నేడు యు.టి.యఫ్. రజతోత్సవాలను జరుపుకొంటున్న సందర్భంగా మన పత్రిక ఏ మేరకు పురోగమించిందీ సమీక్షించుకొందాం.

అయితే ఏ పరిస్థితుల మధ్య ఐక్య ఉపాధ్యాయ మన ఉద్యమవాణిగా పనిచేయవలసి వచ్చిందో గమనించవలసి వున్నది. సామ్రాజ్యవాద దేశాలు, వాటి అనుంగు పుత్రికలైన ప్రపంచ బ్యాంకు, ఐ.యం.యఫ్. వంటి అంతర్జాతీయ సంస్థలు, బహుళజాతి సంస్థలు, పారిశ్రామిక వేత్తలు తమ విధానాలకు అనువైన వాతావరణం కల్పించుకొనేందుకు ప్రచార, ప్రసార సాధనాలను విరివిగా వినియోగించుకొంటున్నారు. ప్రజల ఆశలను, యువత ఉద్రేకాలను ప్రక్కదారి పట్టించేందుకు సెక్స్, క్రైం, హర్రర్, టెర్రర్‌లతో కూడిన కార్యక్రమాలను పత్రికలు, టి.వి.ల ద్వారా ప్రసారం చేస్తున్నారు. మన ప్రభుత్వాధినేతలు కూడా సరళీకృత ఆర్థికవిధానాలే సత్వర పురోభివృద్ధికి సోపానాలని, ప్రైవేటీకరణే సమస్త సమస్యలకు "సర్వరోగ నివారిణి" అని నమ్మబలుకుతూ ప్రచారం చేస్తున్నారు.

ఈ నేపథ్యంలో గత మూడు సంవత్సరాల కాలంలో ఉద్యమ ప్రచార సాధనంగా మన పత్రిక సాగించిన కృషిని, యీ రాష్ట్రంలోని విద్యావిషయిక మాసపత్రికలలో దాని ప్రత్యేకతనూ వరవడినీ, అట్టి పత్రికా నిర్వహణలో చోటుచేసుకున్న ఇబ్బందుల్నీ, వాటి నధిగమించడానికి తీసుకొన్న చర్యల్ని సంపాదకవర్గం తరపున సంగ్రహంగా మీ ముందుంచుతున్నాను.

వైవిధ్యమున్న వివిధ శీర్షికల ద్వారా వైయక్తిక, సామాజిక, వృత్తిపర విషయాలపై ఉపాధ్యాయుల, కార్యకర్తల అవగాహన పెంచడానికి మన పత్రిక యీ కాలంలో కృషి చేయడం జరిగింది.

## సంపాదకీయాలు - కార్టూన్లు

ఒక వాక్యం చదవడంవల్ల కలిగే స్పందన కంటే కార్టూన్ చూస్తే కలిగే స్పందన అధికంగా వుంటుంది. చూడగానే పాఠకుని హృదయాన్ని తట్టడంతో పాటు ఆలోచనలను గిలకొడుతుంది. ఈ ప్రక్రియను యీ రంగంలో మన పత్రిక మాత్రమే కొనసాగిస్తోంది. మచ్చుకు కొన్ని..

98 ఫిబ్రవరి సంచిక ముఖచిత్రంగా - డబ్బు సంచులతో ఓటరును కొనుగోలు చేయ ప్రయత్నిస్తున్న రాజకీయ నాయకుల కార్టూన్, దానిక్రింద "డబ్బుతో వేస్తున్నారు అధికారానికై ఎరలు, లొంగావో ఆపైన ఎవరూ వినరు నీ మొరలు " అనే వ్యాఖ్య : జూలై 98 సంచికపై - ఎయిడెడ్ ఉపాధ్యాయుల ఈతి బాధలు పట్టించుకోని రాష్ట్రాధినేతల వైఖరిని తెల్పే కార్టూను, " హైటెక్ ఆలోచనల్లో తేలియాడుతున్నారు పాలకులు, వేతనాల్లేక వెతలతో అల్లాడుతున్నారు ఎయిడెడ్ టీచర్లు" అనే వ్యాఖ్య: నవంబరు 98 సంచికపై - మతతత్వాన్ని చొప్పిస్తూ విద్యాప్రణాళికలను తయారుచేస్తున్న కేంద్ర ప్రభుత్వ నేతల ధోరణిని తేటతెల్లం చేస్తున్న కార్టూను, అందుకు అనుగుణంగా" తయారు చేస్తున్నారు హిందూత్వ విద్యావిధానాన్ని, తూట్లు పొడుస్తున్నారు మనదేశ లౌకికతత్వాన్ని" అంటున్న వ్యాఖ్య : 99 జూలై సంచికపై - కార్గిల్ యుద్ధంలో పోరాడుతున్న భారత సైనికుల చిత్రాలు, వారిని ప్రోత్సహిస్తూ "వీరజవానులారా! విజయభేరితో ముమ్మందుకు

సాగండి ! అఖిల భారతి జేజేలుపల్కుతు మీ కండగ వున్నదండి !' అనేవి గమనించదగిన ఉదాహరణలు.

అట్లే సామాజిక సమస్యలను, విద్యారంగ వైఫల్యాలను ఎత్తిచూపుతూ ఐక్యఉపాధ్యాయ ఫెడరేషన్ సూత్రబద్ధవైఖరిని సుస్పష్టం చేస్తూ, ఉపాధ్యాయులను, కార్యకర్తలను కార్యోన్ముఖులను చేస్తున్న సంపాదకీయాలు పలువురి ప్రశంసలు అందుకొంటున్నాయి. పరీక్షలు పవిత్రంగా జరిపించండి ! (మే ' 97'), తస్మాత్ జాగ్రత్త ! (సెప్టెంబరు '98), మతతత్వాన్ని చొప్పించే ప్రయత్నాన్ని నిరసించండి ! (నవంబర్ '98' భీమారంగ ప్రైవేటీకరణ అశనిపాతం (నవంబరు'99') వంటి సంపాదకీయాలు ఆ కోవకు చెదినవే.

ముఖచిత్రంతో పాటు కవరు పేజీలలో రాష్ట్రం, జిల్లా, మండలశాఖలు నిర్వహించిన కార్యక్రమాలు, పోరాటాలకు సంబంధించిన ఫోటోలను ప్రచురిన్తున్నాము. పాఠకుల అభిప్రాయాలకు, సంపాదకుల లేఖలకు 2వ పేజీలో స్థానం కల్పిస్తున్నాము.

**ఉద్యమ సంబంధమైనవి :** వార్తా ప్రపంచం, సంపాదక లేఖలు, పోరాటాలు - ఫలితాలు, రాయబారాలు - ప్రాతినిధ్యాలు, ఉద్యమవార్తలు, శాఖల నిర్మాణాలు మున్నగునవి.

**వృత్తి సంబంధమైనవి :** ప్రశ్నోత్తరాలు, నియమ నిబంధనలు సమస్యాతోరణం, బదిలీలు కావాలా ? ప్రభుత్వ ఉత్తర్వులు మున్నగునవి.

**విద్యాసంబంధమైనవి :** విద్యారంగం - తీరుతెన్నులు, పాఠ్యగ్రంథాల తీరుతెన్నులు, అకడమిక్ సెల్ మొదలగునవి.

**విజ్ఞాన సంబంధమైనవి :** నడుస్తున్న చరిత్ర, ఆర్థిక రంగం, చైతన్య స్రవంతి, మనలో మనం, మనము-మన ఆరోగ్యం, మీకు తెలుసా? ఆలోచించండి మున్నగునవి.

**సాహిత్యసంబంధమైనవి :** కథలు-గేయాలు, గ్రంథ స్వీకారం, మీరు చదివారా? మున్నగునవి.

## కథలు - గేయాలు

మంచి శిల్పంతో వ్రాయబడిన మినీకథలోని సందేశం సూటిగా హృదయాన్ని తాకుతుంది. ఆలోచనలను రేపుతుంది. మన పత్రికలో ప్రచురించిన స్వామిగారి "దేశభక్తి, జన్మభూమి, నారు పోసినవాడు నీరు పోయడా ? వి. విజయకుమార్ గారి" జ్ఞానోదయం, మిడిల్‌క్లాస్ మేష్టారు, బి. నరసింహారావు గారి "అవినీతి రక్షతి, అరక్షితః , యం. హరికిషన్ గారి "చిలకముక్కు సారు" వి. వెంకటేశ్వర్లు గారి "కె.జి.ఇంటర్వ్యూ". ఎన్నదగిన కథానికలు.

అట్లే యీ కాలంలో మన పత్రికలో ప్రచురించిన గేయాలు మానవతను చాటేవి, సామాజిక రుగ్మతలను ఎత్తిచూపేవి, నిర్లిప్తతతో వున్న వారిని వెన్నుచరిచి లేపేవిగా వున్నాయి. ప్రశ్నాపత్రాల లీకేజి బండారాన్ని ఎత్తిచూపిన శ్రీ వి. విజయకుమార్ గారి "అమ్మకో ఉత్తరం" సైన్సు వినియోగంలో మంచి చెడ్డలను విశ్లేషించిన శ్రీ సి.హెచ్.వి.రమణయ్య గారి "సైన్సు రాజ్యం" స్వర్ణోత్సవ భారతిలోని దౌర్భాగ్య పరిస్థితులను వర్ణించిన కె. రవికుమార్ గారి "జమ్మిచెట్టు మీదనుంచి', షేక్ మహబూబ్ సుబాసు గారి "స్వతంత్ర భారతం", షేక్ అక్బర్ గారి "స్వర్ణభారతి". ఆర్. విద్యాసాగరశర్మగారి "సందేశం". స్త్రీల స్థితిగతులపై యన్.కె. నాగేశ్వరరావుగారి "ఇదెక్కడి న్యాయం". ఎ. శశికళ గారి "చెరిగిన గీత", అన్యాయాలను ఎదిరించాలని ఉద్బోధించిన గుర్రాల శ్రీరామమూర్తి గారి "చీమకుట్టింది", బాల కార్మికుల దీనస్థితిని ఎత్తిచూపిన శ్రీ కె. వెంకటేశ్వరరెడ్డి గారి "ప్లీజ్! బాల్యాన్ని బలికోరకండి " మొదలగు గేయాలు సామాజిక అవగాహనను, స్పృహను కలిగించేవి, హృదయాంతరాళాలను స్పృశించేవి.

## విజ్ఞానదాయకమైన వ్యాసాలు

డాక్టర్ వై. రాదాకృష్ణ మూర్తి గారి "విద్యశాస్త్రీయ దృక్పథాన్ని కలిగించాలి"అనే ప్రసంగ వ్యాసం. శ్రీ కె. కేశవరెడ్డి గారి "ప్రైవేటీకరణ-ప్రతిఘటన", డా॥ బ్రహ్మారెడ్డిగారి "కొత్త తోడేలు-కొత్త గొర్రెలు" , శ్రీ జెరిమీసీబ్రూక్ గారి "మానవ స్వభావం మార్పున కతీతమా ?, జస్టిస్ బి.పి. జీవనరెడ్డి గారి "ప్రపంచీకరణ వల్ల పెనుప్రమాదం" మున్నగునవి పాఠకులను బాగా ఆకర్షించిన విజ్ఞానదాయకమైన వ్యాసాలు.

శ్రీ జి.సి. మధుసూదనరావుగారు అందిస్తున్న వైవిధ్యంగల వ్యాసాలు - "అర్ధరాత్రి స్వాతంత్ర్యం తెల్లవారేదెన్నడో ?", "నీళ్ళకోసం ప్రపంచ యుద్ధం రానున్నదా ?". "ప్రపంచ బ్యాంకు రుణం రాష్ట్రానికి భస్మాసుర హస్తమా ?", "మనం నిత్యం విషాన్ని తింటున్నామా ?" వంటివి పాఠకులకు అమూల్య సమాచారాన్ని అందిస్తున్నాయి.

## మనము - మన ఆరోగ్యం

వైద్యశాస్త్రానికి సంబంధించిన పలు విషయాలను సులభ గ్రాహ్యం చేస్తూ డా॥వి. బ్రహ్మారెడ్డిగారు తమదైన ప్రత్యేక శైలితో అందరికి ఆసక్తి కలిగిస్తూ నెలనెలా వ్యాసాలను అందిస్తున్నారు.

## మనలో మనం

మనలొ మనం తర్కించుకొనేటట్లు చేస్తూ వ్యక్తుల మూర్తిమత్వ వికాసానికి దోహదపడే ప్రొ॥ యశపాల్ గారి "విమర్శను స్వీకరించడం పరిణతికి చిహ్నం", "వ్యతిరేక స్వభావం", "వృద్ధులు వ్యర్థులు కారు - వృద్ధాప్యం శాపం కాదు", "పరాధీనతను పారద్రోలండి" వంటి వ్యాసాలు పాఠకులను బాగా ఆకర్షిస్తున్నాయి.

## చైతన్య ప్రవంతి

ఈ శీర్షిక క్రింద ప్రచురిస్తున్న వ్యాసాలు - శ్రీ గుర్రాల శ్రీ రామమూర్తి గారి "కులనిర్మూలనకు ఏం చేయాలి?", శ్రీ కె. శ్రీనివాసులు గారి "జ్యోతిషం శాస్త్రమా?" బాలసుబ్రహ్మణ్యం గారి "వందేమాతరం ఎంత లౌకికం" వంటివి పాఠకులను ఆలోచింపజేస్తున్నాయి.

## నియమ నిబంధనలు

యు.టి.యఫ్. రాష్ట్ర అధ్యక్షులు శ్రీ డి. రామిరెడ్డి, శ్రీ వి. శ్రీ హరి ఉద్యోగుల - ఉపాధ్యాయుల సర్వీసుకు, సౌకర్యాలకు సంబంధించిన అంశాల వారీ నియమ నిబంధనలను సరళమైన భాషలో అందిస్తున్నారు.

## ప్రశ్నోత్తరాలు

సర్వీసుకు, సౌకర్యాలకు సంబంధించి ఉపాధ్యాయులు ఎదుర్కొనే పలుసమస్యలకు సాధికారిక రిఫరెన్సులతో వివరణలనిస్తూ శ్రీ డి. రామిరెడ్డి, కె. జోజయ్య, యస్. రమణయ్యశాస్త్రి యీ శీర్షికలను నిర్వహిస్తున్నారు.

## ఇతర శీర్షికలు

పైన పేరొన్న శీర్షికలతో పాటు విద్యారంగం - తీరుతెన్నులు, ఆర్థికరంగం, అకడమిక్ సెల్, మీరు చదివారా ? మీకు తెలుసా? మున్నగు శీర్షికలకు ఎందరో రచయితలు తమ రచనల నందిస్తూ పత్రికకు నిండుదనాన్ని చేకూరుస్తున్నారు. వారందరికి సంపాదకర్గం తరపున ఉద్యమాభినందనలు.

## రచయితలు - రచనలు

క్రొత్త రచయితలు పరిచయమవుతున్నారు. వారి సంఖ్య యింకా పెరిగి వైవిధ్యమున్న రచనలు వారినుండి రావాలి. రచనా సామర్ధ్యం వున్న అట్టి వారిని స్థానికంగా గుర్తించి, ప్రోత్సహించే ప్రయత్నం అన్ని శాఖలు చేయాలి. అప్పుడే వాసిలోను, రాశిలోను మన పత్రిక మెరుగవుతుంది.

## పత్రికా క్యాంపెయిన్లు

ఒంగోలు మహాసభల నాటికి 19,500 గా వున్న పత్రిక సర్క్యులేషన్ కార్యకర్తల ప్రత్యేక కృషి వలన గణనీయంగా పెరిగింది. 1997-98 స్పెషల్, జనరల్ క్యాంపెయిన్లలో 11 జిల్లాలు కోటాల నధిగమించగా సర్క్యులేషన్ 22 వేలకు పెరిగింది అట్లే 1998-99 స్పెషల్ మరియు జనరల్ క్యాంపెయిన్లలో అనేక జిల్లాలు కోటాల నధిగమించగా సర్క్యులేషన్ 24 1/2 వేలకు పెరిగింది. ప్రస్తుత 1999-2000 సం॥లో సర్క్యులేషన్ మరింతగా పెరగవలసిన అవసరమున్నది. అందుకు అందరు పూనుకోవాలని విజ్ఞప్తి.

## పత్రికల మిస్సింగ్

పత్రికలు సక్రమంగా అందడం లేదని, చందాదారులకు సమాధానం చెప్పడం కష్టంగా వున్నదని కార్యకర్తలు తరచూ ఆవేదన వ్యక్తం చేస్తున్నారు. పత్రికా కార్యాలయం హైదరాబాదుకు తరలించిన సందర్భంలో పత్రికల మిస్సింగ్‌పై ఫిర్యాదులు ఎక్కువగా వచ్చాయి. గత రెండు మాసాలలో యీ లోపాన్ని సవరించడానికి ప్రత్యేక శ్రద్ధ చూపడం జరిగింది. ఇంకా మరిన్ని జాగ్రత్తలు తీసుకొంటాము. ఏమైనా పత్రిక అందనివారిని తమ చందా నంబరుతో తెలియజేయమనండి. మరో కాపీ వెంటనే పంపిస్తాము.

## ముద్రణ

ముద్రా రాక్షసాలు వుంటూనే వున్నాయి. ప్రూఫ్ రీడింగ్ చూసే కార్యకర్తల అవసరముంది. పత్రిక టైటిల్ మరింత ఆకర్షణీయంగా వుండేదానికి యిటీవల ఆర్ట్‌పేపర్‌పై ముద్రిస్తున్నాము. అందువలన పెరుగుచున్న ఖర్చును తట్టుకోవడానికి జిల్లాశాఖలు ప్రకటనలను సేకరించి పంపాలి.

## జీవిత చందాలు

7 వేలతో జీవిత చందాలు నిలుపుదల చేయబడ్డాయి. 20 యేళ్ళనాడు రూ. 116/-, రూ. 150/- కట్టినవారికి పత్రికను పంపడం నేటి ధర లలో భారంగా వున్నది. చందా రూ. 250/- లు అయ్యేదానికి కొరవలు చెల్లించమని కోరితే 1000 మంది వరకు మాత్రమే చెల్లించారు. ఏమైనా యీ జీవితచందాల భారం పత్రికపై పడకుండా వుండేదానికై మనం ఆలోచన చేయవలసిన అవసరముంది.

## ముగింపు

పత్రికలోని శీర్షికలపైన, లోపాలపైన మీ అభిప్రాయాలను, సూచనలను తెలియజేయండి. అన్నివిధాల మన పత్రిక మెరుగయ్యేదానికి, సర్క్యులేషన్ మరింతగా పెరిగేదానికి మీ సహకారాన్ని అందించండి.

మిత్రులారా! గత 3 సంవత్సరాల పత్రికా నివేదికను సంగ్రహంగా మీ ముందుంచాను. తగు సూచనలతో దీనికి మెరుగులు దిద్దండి. మన పత్రిక పురోభివృద్ధికి తోడ్పడండి.

### గమనిక

1. సంఘమునకు సంబంధించిన డబ్బు A.P. UNITED TEACHERS FEDERATION పేరుతోను,
2. పత్రికకు సంబంధించిన డబ్బు "IKYA UPADHYAYA" పేరుతోను,
3. ప్రచురణలకు సబంధించిన డబ్బు "IKYA UPADHYAYA PRACHURANALU" పేరుతోను,

డి.డి. తీసి అకౌంటు పేయీ అను స్టాంపువేయించి హైదరాబాదు రాష్ట్ర కార్యాలయానికి పంపించండి.

యు.టి.యఫ్.

# ఐక్య ఉపాధ్యాయ పత్రిక ఆర్థిక నివేదిక

**తేది 1-3-1999 నుండి 31-12-1999 వరకు**

**జమలు**

| | |
|---|---|
| ప్రారంభ నిల్వ | 2,945-50 |
| బ్యాంక్ నిల్వ | 2,50,405-52 |
| జమలు సం॥ర చందాలు | 4,41,230-00 |
| ఏజెన్సీలు | 70,700-00 |
| ప్రకటనలు | 16,016-00 |
| జీవిత చందాలు | 1,388-00 |
| వడ్డీలు | 2,33,925-00 |
| హాలు అద్దెలు | 980-00 |
| ఇతర అమ్మకాలు | 12,294-00 |
| గత అడ్వాన్స్‌ల జమలు | |
| ॥ సంఘం | 5,00,000-00 |
| ॥ ఇతరులు | 12,659-00 |
| **మొత్తం :** | 15, 42,543-02 |

**ఖర్చులు**

| | |
|---|---|
| ప్రింటింగ్ | 2, 15,105-25 |
| పేపర్ కొనుగోలు | 57,498-00 |
| ప్రయాణం | 23,732-20 |
| పోస్టేజి | 47,643-50 |
| టెలిఫోన్ | 11,637-00 |
| ఆఫీసు నిర్వహణ | 21,048-75 |
| లైబ్రరీ | 4,510-60 |
| స్టేషనరీ & ఫర్నిచర్ | 15,877-00 |
| జీతాలు | 29,685-00 |
| బహుమతులు | 2,174-00 |
| హైదరాబాద్ భవన అడ్వాన్సు | 2,00,000-00 |
| ఫిక్స్‌డ్ డిపాజిట్స్ | 5,00,000-00 |
| అడ్వాన్సు ప్రచురణలకు | 15,000-00 |
| అడ్వాన్స్ ఇతరులకు | 12,686-10 |
| బ్యాంక్ నిల్వ | 3,84,993-52 |
| నిల్వ | 952-10 |
| **మొత్తం :** | 15,42,543-02 |

# ఆంధ్రప్రదేశ్ ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్ ఆర్థిక నివేదిక

**తేది 1-3-1999 నుండి 31-12-1999 వరకు**

**జమలు**

| | |
|---|---|
| ప్రారంభ నిల్వ | 3,894-89 |
| బ్యాంక్ గత నిల్వ | 2,24,307-00 |
| జమలు సభ్యత్వం | 4,11,705-00 |
| గత సం॥ర సభ్యత్వ బకాయి | 7,662.50 |
| రజతోత్సవ నిధి | 8,15,500-00 |
| జనరల్ ఫండ్ | 8,540-00 |
| వడ్డీలు | 4,154-00 |
| డెలిగేట్ ఫీజులు | 5,860-00 |
| ఇతరములు | 1,704-00 |
| పాతబాకీల జమలు | 6,480-00 |
| **మొత్తం :** | 15,20,307-39 |

**ఖర్చులు**

| | |
|---|---|
| ప్రయాణం | 92,158-06 |
| కార్యాలయ నిర్వహణ | 89,363-35 |
| ప్రింటింగ్ | 39,030-70 |
| న్యూస్‌ప్రింట్ | 8,474-00 |
| పోస్టేజి | 15,603-20 |
| టెలిఫోన్ | 34,226-21 |
| స్టేషనరీ | 3,096-25 |
| సమావేశాల నిర్వహణ | 15,150-00 |
| పోరాటాల నిర్వహణ | 5,400-00 |
| లైబ్రరీ | 6,113-50 |
| జీతాలు, అలవెన్సులు | 53,170-00 |
| రిట్స్ | 1 0,000-00 |
| ఇతరములు | 1,090-00 |
| అడ్వాన్సు ఖాతా | |
| ॥ హైదరాబాదు భవనం | 1,37,000-00 |
| ॥ పత్రిక బాకీ | 7,00,000-00 |
| ఆప్షన్ ఫారాలు | 2,200-00 |
| జండాలు | 10,680-00 |
| ఇతరములు | 14,536-06 |
| బ్యాంకు నిల్వ | 2,77,155.00 |
| చేతి నిల్వ | 5,861-06 |
| **మొత్తం :** | 15,20,307-39 |

# ఆంధ్రప్రదేశ్ ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్

## రజతోత్సవాలు 8వ విద్యా వైజ్ఞానిక మహాసభలు

**తేది 19-4-1999 నుండి 20-2-2000 వరకు**

| జమలు | | ఖర్చులు | |
|---|---|---|---|
| తూ.గో.జిల్లా విరాళాల జమలు | 30,22,319-00 | విరాళాల సేకరణ | 69,855-10 |
| శ్రీకాకుళం | 10,000-00 | ప్రయాణాలు | 1,10,791-10 |
| విజయనగరం | 4,000-00 | ప్రింటింగు | 92,717-00 |
| విశాఖపట్టణం | 3,000-00 | ఫోన్లు, పోస్టేజి, పార్శిల్స్ | 23,135-20 |
| పశ్చిమగోదావరి | 2,00,000-00 | స్టేషనరీ | 14,583-50 |
| కృష్ణ | 83,000-00 | సమావేశములు, ఆఫీసు నిర్వహణ | 11,024-90 |
| గుంటూరు | 1,00,000-00 | భోజనములు సప్లయి సామాగ్రి | 8,12,246-35 |
| ప్రకాశం | 1,00,000-00 | టెంట్లు, మైక్ | 4,78,260-00 |
| నెల్లూరు | 1,00,000-00 | అలంకరణ | 1,74,976-00 |
| చిత్తూరు | 30,000-00 | వసతి ఏర్పాట్లు | 97,329-50 |
| కడప | 1,500-00 | పతాకజాతా, ప్రదర్శన | 29,071-00 |
| కర్నూలు | 15,000-00 | విద్యుత్ ఏర్పాట్లు | 1,23,509-00 |
| అనంతపురం | 10,000-00 | మెమెంటోలు, బహుమతులు | 46,657-00 |
| ఖమ్మం | 1,00,000-00 | క్రీడలు, వైజ్ఞానిక ప్రదర్శనలు | 10,510-00 |
| వరంగల్లు | 10,000-00 | ప్రచారం | 55,428-15 |
| కరీంనగర్ | 1,000-00 | ఫోటోలు, వీడియోలు | 24,061-00 |
| అదిలాబాద్ | 1,000-00 | క్యాసెట్లు | 44,717-50 |
| నల్గొండ | 50,000-00 | అలవెన్సులు | 46,136-50 |
| మహబూబ్‌నగర్ | 8,000-00 | అప్పుతీర్చినది | 2,20,450-00 |
| నిజాంబాద్ | 500-00 | భవనం అప్పు తీర్చినది | 2,25,625-00 |
| మెదక్ | 1,000-00 | హైదరాబాదు భవన నిర్మాణానికి | 8,49,000-00 |
| రంగారెడ్డి | 4,000-00 | డెలిగేటు బ్యాగులు | 4,95,000-00 |
| హైదరాబాద్ | 17,000-00 | బ్యాంకు నిల్వ | 5,72,431-00 |
| డెలిగేటు ఫీజులు | 5,37,865-00 | ఆఫీసు నిల్వ | 16,705-20 |
| అప్పు జమలు | 2,20,000-00 | | |
| అమ్మకాలు | 13,694-00 | | |
| బ్యాంకు వడ్డీ | 1,342-00 | | |
| మొత్తము : | 46,44,220-00 | మొత్తము : | 46,44,220-00 |

రజతోత్సవాలు 8వ విద్యావైజ్ఞానిక మహాసభల ఆహ్వానసంఘ సమావేశం శ్రీ కె. బ్రహ్మాజీరావు గారి అధ్యక్షతన కాకినాడ యు.టి.యఫ్. కార్యాలయం శ్రీ వి. సూర్యనారాయణరాజు భవనంలో 20-2-2000 న జరిగింది. ఆహ్వాన సంఘ ప్రధానకార్యదర్శి శ్రీ ఎ. వెంకటస్వామి మహాసభల నివేదిక ఆహ్వాన సంఘ కోశాధికారి శ్రీ జి. చిట్టిబాబు జమాఖర్చులు ప్రవేశపెట్టిరి. ఆహ్వాన సంఘ అధ్యక్షులు శ్రీ వై.డి. రామారావు, శ్రీ పి. పుల్లయ్య, రాష్ట్ర అధ్యక్షులు శ్రీ కె. జోజయ్య, ప్రధాన కార్యదర్శి శ్రీ యన్. నారాయణ, శ్రీ జి. ఆంజనేయులు తదితరులు మహాసభలు జరిగిన తీరు ప్రశంసించిరి. సభ్యులు అభిప్రాయములు వెలిబుచ్చిరి. అనంతరం నివేదికలు ఏకగ్రీవముగా ఆమోదించిరి. శ్రీ.ఐ. వెంకటేశ్వరరావు వందన సమర్పణ చేసిరి.

# 1974 నుండి రజతోత్సవం వరకు సభ్యత్వం

| నెం. | జిల్లా పేరు | 1974 సం॥ | 1975 సం॥ | 1976 సం॥ | 1977 సం॥ | 1978 సం॥ | 1979 సం॥ | 1980 సం॥ | 1981 సం॥ | 1982 సం॥ | 1983 సం॥ | 1984 సం॥ | 1985 సం॥ | 1986 సం॥ |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1. | శ్రీకాకుళం | - | - | - | - | - | - | - | 11 | 150 | 150 | 225 | 364 | 510 |
| 2. | విజయనగరం | - | - | - | - | - | 300 | 358 | 445 | 500 | 500 | 500 | 600 | 510 |
| 3. | విశాఖపట్నం | - | 111 | 250 | 400 | 500 | 400 | 384 | 605 | 500 | 620 | 500 | 700 | 550 |
| 4. | తూర్పుగోదావరి | 3000 | 3300 | 3500 | 4500 | 4500 | 5500 | 6000 | 6000 | 6300 | 6250 | 7200 | 7000 | 6000 |
| 5. | పశ్చిమ గోదావరి | 1500 | 2022 | 2050 | 2800 | 3800 | 3300 | 4090 | 5000 | 5000 | 5000 | 5212 | 5000 | 4553 |
| 6. | కృష్ణ | 500 | 900 | 697 | 1100 | 1600 | 2500 | 2900 | 2000 | 1500 | 2500 | 2500 | 3300 | 3000 |
| 7. | గుంటూరు | 700 | 1112 | 1900 | 2600 | 3740 | 4260 | 5000 | 5000 | 5500 | 6000 | 6000 | 5500 | 4700 |
| 8. | ప్రకాశం | 300 | 800 | 1330 | 1700 | 2650 | 3000 | 3504 | 4508 | 4000 | 4500 | 4000 | 4500 | 4500 |
| 9. | నెల్లూరు | 500 | 1394 | 1400 | 1856 | 3000 | 3000 | 3000 | 3700 | 4000 | 4000 | 4500 | 5000 | 4600 |
| 10. | చిత్తూరు | - | - | - | 2000 | 1000 | 550 | 310 | 915 | 2000 | 1200 | 2200 | 2200 | 1020 |
| 11. | కడప | - | - | - | - | - | - | 100 | 500 | 500 | 400 | 500 | 500 | 500 |
| 12. | కర్నూలు | 500 | 500 | 1100 | 440 | 500 | 430 | 750 | 1000 | 1000 | 920 | 1300 | 1000 | 920 |
| 13. | అనంతపురం | - | - | - | 100 | 200 | 250 | 500 | 650 | 500 | 600 | 500 | 500 | 350 |
| 14. | ఖమ్మం | - | 550 | 900 | 1100 | 1500 | 2000 | 1932 | 2004 | 2200 | 2025 | 2087 | 2350 | 2500 |
| 15. | వరంగల్ | - | 100 | 400 | 700 | 1032 | 1600 | 1880 | 923 | 1300 | 760 | 1218 | 1300 | 1193 |
| 16. | కరీంనగర్ | - | 100 | - | - | - | 500 | 400 | 500 | 1000 | 700 | 1200 | 1000 | 1300 |
| 17. | అదిలాబాద్ | - | 60 | - | - | 500 | 500 | 653 | 510 | 500 | 600 | 700 | 1100 | 1000 |
| 18. | నల్గొండ | - | 100 | 234 | 400 | 550 | 1000 | 1000 | 1200 | 1300 | 1200 | 1200 | 1200 | 1000 |
| 19. | మహబూబ్‌నగర్ | - | 60 | 25 | 200 | 500 | 700 | 670 | 800 | 1300 | 1200 | 1200 | 1000 | 1000 |
| 20. | నిజాంబాద్ | - | 54 | 144 | 100 | 63 | 450 | 300 | 305 | 350 | 400 | 500 | 300 | 184 |
| 21. | మెదక్ | - | - | - | 23 | 100 | 55 | 20 | 50 | 50 | 50 | 100 | 100 | 112 |
| 22. | రంగారెడ్డి | - | - | - | - | - | 24 | 35 | 27 | 50 | 56 | 100 | 160 | 150 |
| 23. | హైదరాబాద్ | - | 65 | 82 | 84 | 150 | 300 | 300 | 400 | 500 | 600 | 600 | 700 | 512 |
| 24. | ఇతరములు | - | - | - | - | - | - | - | - | - | - | - | - | - |
| | మొత్తం | 7000 | 11,068 | 13,012 | 20,103 | 25,885 | 30,479 | 34186 | 37053 | 38,200 | 40,231 | 44,092 | 45,374 | 40,467 |

## జిల్లాల వారి పత్రికలు

| నెం. | జిల్లా పేరు | 1974 సం॥ | 1975 సం॥ | 1976 సం॥ | 1977 సం॥ | 1978 సం॥ | 1979 సం॥ | 1980 సం॥ | 1981 సం॥ | 1982 సం॥ | 1983 సం॥ | 1984 సం॥ | 1985 సం॥ | 1986 సం॥ |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1. | శ్రీకాకుళం | - | - | - | - | - | - | - | 18 | 26 | 34 | 68 | 103 | 59 |
| 2. | విజయనగరం | - | - | - | - | - | 13 | 51 | 95 | 109 | 127 | 142 | 111 | 120 |
| 3. | విశాఖపట్నం | - | 22 | 50 | 38 | 107 | 79 | 63 | 112 | 115 | 125 | 159 | 154 | 166 |
| 4. | తూర్పుగోదావరి | - | 429 | 829 | 1018 | 918 | 1033 | 931 | 1422 | 1606 | 1438 | 1756 | 1744 | 1791 |
| 5. | పశ్చిమ గోదావరి | - | 300 | 558 | 562 | 549 | 796 | 825 | 1067 | 1189 | 1117 | 1457 | 1338 | 1398 |
| 6 | 6. కృష్ణ | - | 270 | 527 | 512 | 448 | 504 | 583 | 765 | 789 | 833 | 936 | 882 | 9147 |
| గుంటూరు | | - | 262 | 628 | 552 | 733 | 578 | 686 | 803 | 843 | 824 | 1176 | 910 | 999 |
| 8. | ప్రకాశం | - | 234 | 380 | 396 | 466 | 609 | 696 | 1001 | 973 | 964 | 1182 | 1197 | 1146 |
| 9. | నెల్లూరు | - | 234 | 420 | 393 | 599 | 713 | 792 | 1509 | 1481 | 843 | 1532 | 1086 | 1290 |
| 10. | చిత్తూరు | - | - | - | 102 | 35 | 34 | 51 | 91 | 140 | 169 | 258 | 346 | 257 |
| 11. | కడప | - | - | - | - | - | - | - | 96 | 100 | 54 | 56 | 93 | 110 |
| 12. | కర్నూలు | - | 8 | 56 | 14 | 51 | 45 | 50 | 144 | 186 | 221 | 287 | 246 | 198 |
| 13. | అనంతపురం | - | - | - | 13 | 32 | 65 | 64 | 266 | 209 | 191 | 206 | 208 | 242 |
| 14. | ఖమ్మం | - | 184 | 530 | 612 | 546 | 736 | 694 | 928 | 839 | 797 | 586 | 902 | 1010 |
| 15. | వరంగల్ | - | 44 | 125 | 186 | 193 | 271 | 248 | 361 | 345 | 365 | 519 | 472 | 450 |
| 16. | కరీంనగర్ | - | - | - | - | - | 44 | 75 | 227 | 277 | 375 | 289 | 431 | 375 |
| 17. | అదిలాబాద్ | - | - | - | - | 155 | 103 | 76 | 137 | 130 | 158 | 208 | 232 | 179 |
| 18. | నల్గొండ | - | 12 | 84 | 117 | 246 | 306 | 248 | 444 | 534 | 495 | 589 | 521 | 547 |
| 19. | మహబూబ్‌నగర్ | - | 20 | 125 | 136 | 215 | 344 | 266 | 458 | 576 | 562 | 595 | 669 | 778 |
| 20. | నిజాంబాద్ | - | 45 | 241 | 253 | 155 | 519 | 444 | 365 | 386 | 285 | 424 | 338 | 306 |
| 21. | మెదక్ | - | - | - | 4 | 7 | 15 | 25 | 25 | 29 | 33 | 47 | 47 | 43 |
| 22. | రంగారెడ్డి | - | - | - | - | - | 10 | 50 | 42 | 48 | 67 | 68 | 83 | 50 |
| 23. | హైదరాబాద్ | - | 23 | 74 | 82 | 118 | 150 | 165 | 257 | 260 | 205 | 280 | 244 | 216 |
| 24. | ఇతరములు | - | 7 | 108 | 27 | 172 | 33 | 103 | 12 | - | 718 | 310 | 700 | 50 |
| | మొత్తం | | 2,275 | 4734 | 5010 | 5640 | 7000 | 7176 | 10750 | 11,190 | 11,000 | 13,500 | 13007 | 13144 |

## 1974 నుండి రజతోత్సవం వరకు సభ్యత్వం

| 1987 | 1988 | 1989 | 1990 | 1991 | 1992 | 1993 | 1994 | 1995 | 1996 | 1997 | 1998 | 1999 | 2000 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| సం॥ | సం॥ | సం॥ | సం॥ | సం॥ | సం॥ | సం॥ | సం॥ | సం॥ | సం॥ | సం॥ | సం॥ | సం॥ | సం॥ |
| 545 | 300 | 415 | 570 | 670 | 520 | 700 | 1000 | 762 | 1140 | 1500 | 1600 | 1850 | 2000 |
| 550 | 557 | 510 | 600 | 675 | 610 | 600 | 600 | 600 | 1000 | 1000 | 1200 | 1747 | 2000 |
| 750 | 750 | 1000 | 1000 | 1000 | 1000 | 700 | 1000 | 600 | 1000 | 1000 | 800 | 600 | 800 |
| 7050 | 7000 | 7200 | 7500 | 7005 | 8000 | 7500 | 7000 | 7300 | 9065 | 10016 | 10300 | 11,528 | 12110 |
| 5000 | 5300 | 6000 | 6000 | 6000 | 6000 | 6500 | 6050 | 6000 | 6500 | 7500 | 8300 | 9015 | 9716 |
| 3000 | 3200 | 3400 | 3600 | 4100 | 4000 | 3500 | 3500 | 3600 | 4600 | 5500 | 5700 | 6200 | 6500 |
| 5043 | 5085 | 5600 | 5500 | 5600 | 5600 | 5600 | 5000 | 4500 | 5000 | 5300 | 6300 | 7000 | 7500 |
| 5000 | 5305 | 6234 | 6000 | 6000 | 6000 | 6226 | 6000 | 6000 | 6200 | 6500 | 7300 | 8378 | 8500 |
| 5000 | 5000 | 5600 | 6000 | 6000 | 6000 | 6000 | 6000 | 6000 | 6135 | 6500 | 7000 | 8100 | 7500 |
| 3500 | 2500 | 3013 | 3973 | 3500 | 3000 | 3500 | 3500 | 4215 | 4500 | 5000 | 5500 | 6500 | 7000 |
| 500 | 500 | 800 | 1500 | 1500 | 1200 | 1500 | 1500 | 1000 | 1000 | 750 | 1200 | 1456 | 1073 |
| 750 | 1100 | 1300 | 1200 | 1500 | 1200 | 1500 | 1200 | 1000 | 1200 | 1500 | 1352 | 1610 | 2000 |
| 607 | 800 | 1000 | 1100 | 1000 | 800 | 1500 | 1200 | 800 | 1000 | 1000 | 1100 | 2500 | 2930 |
| 2500 | 2515 | 2742 | 3158 | 3103 | 3300 | 3300 | 3000 | 3000 | 3300 | 3634 | 4300 | 5338 | 5045 |
| 1000 | 1450 | 1600 | 1500 | 1500 | 1200 | 1200 | 1000 | 1000 | 1200 | 1500 | 1500 | 1700 | 1670 |
| 800 | 1150 | 1350 | 1350 | 1350 | 1200 | 1300 | 1000 | 1100 | 1500 | 500 | 922 | 1500 | 800 |
| 1000 | 700 | 690 | 700 | 1000 | 700 | 500 | 1200 | 600 | 900 | 1000 | 800 | 700 | 1000 |
| 1000 | 1502 | 1635 | 1800 | 1725 | 1700 | 1811 | 1800 | 1500 | 1700 | 2400 | 2300 | 2824 | 3000 |
| 1000 | 1704 | 1800 | 2000 | 1800 | 1700 | 1600 | 1800 | 1500 | 1700 | 1800 | 2000 | 1634 | 2000 |
| 162 | 432 | 600 | 384 | 383 | 300 | 381 | 500 | 400 | 300 | 300 | 200 | 300 | 500 |
| 100 | 100 | 100 | 100 | 100 | 100 | 100 | 50 | 100 | 407 | 405 | 500 | 500 | 500 |
| 100 | 80 | 100 | 100 | 100 | 100 | 100 | 100 | 120 | 200 | 200 | 350 | 618 | 711 |
| 400 | 500 | 507 | 700 | 600 | 800 | 1000 | 1000 | 972 | 1300 | 1500 | 1500 | 1791 | 2000 |
| 3 | 3 | 3 | 2 | 3 | 3 | 3 | 3 | 3 | 3 | 3 | 3 | 3 | 3 |
| 45,000 | 47,183 | 53,005 | 56,425 | 56,214 | 56,583 | 56,518 | 53,503 | 52,580 | 60,408 | 67,308 | 71,607 | 82,814 | 87,528 |

## జిల్లాలవారిపత్రికలు

| 1987 | 1988 | 1989 | 1990 | 1991 | 1992 | 1993 | 1994 | 1995 | 1996 | 1997 | 1998 | 1999 | 2000 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| సం॥ | సం॥ | సం॥ | సం॥ | సం॥ | సం॥ | సం॥ | సం॥ | సం॥ | సం॥ | సం॥ | సం॥ | సం॥ | సం॥ |
| 23 | 89 | 128 | 148 | 202 | 222 | 325 | 292 | 300 | 235 | 243 | 271 | 251 | 251 |
| 97 | 178 | 110 | 153 | 151 | 154 | 147 | 133 | 199 | 183 | 189 | 159 | 180 | 227 |
| 171 | 101 | 208 | 171 | 177 | 231 | 224 | 244 | 215 | 271 | 289 | 225 | 182 | 186 |
| 2024 | 2155 | 2502 | 2153 | 2411 | 2686 | 3002 | 2870 | 3264 | 3138 | 3169 | 3527 | 3884 | 3931 |
| 1519 | 1580 | 1678 | 1592 | 1716 | 1754 | 1898 | 1905 | 1924 | 2004 | 2016 | 2259 | 2435 | 2893 |
| 1116 | 1231 | 1420 | 1201 | 1218 | 1145 | 1135 | 1162 | 1212 | 1111 | 1125 | 1301 | 1484 | 1431 |
| 1047 | 1080 | 1024 | 984 | 1001 | 1050 | 1148 | 1161 | 1126 | 1045 | 1070 | 1413 | 1498 | 1920 |
| 1000 | 1545 | 1646 | 1476 | 1392 | 1800 | 1935 | 1763 | 1565 | 1702 | 1726 | 100 | 2100 | 2019 |
| 1402 | 1408 | 1418 | 1556 | 1770 | 1805 | 2487 | 2759 | 2611 | 2297 | 2315 | 2530 | 2120 | 3003 |
| 353 | 291 | 501 | 431 | 460 | 480 | 529 | 605 | 735 | 580 | 602 | 676 | 749 | 948 |
| 118 | 150 | 64 | 114 | 105 | 66 | 128 | 72 | 94 | 108 | 109 | 69 | 127 | 159 |
| 263 | 258 | 303 | 290 | 340 | 356 | 388 | 439 | 384 | 457 | 459 | 396 | 396 | 495 |
| 261 | 285 | 332 | 293 | 285 | 295 | 307 | 345 | 206 | 259 | 260 | 272 | 352 | 402 |
| 1151 | 1261 | 1301 | 1316 | 1409 | 1330 | 1480 | 1654 | 1501 | 1650 | 1730 | 1714 | 1503 | 1706 |
| 471 | 408 | 501 | 477 | 488 | 465 | 525 | 484 | 496 | 489 | 550 | 517 | 578 | 598 |
| 468 | 662 | 625 | 553 | 547 | 470 | 554 | 486 | 430 | 293 | 248 | 273 | 279 | 313 |
| 210 | 246 | 312 | 221 | 227 | 195 | 242 | 280 | 297 | 354 | 314 | 248 | 298 | 287 |
| 658 | 858 | 813 | 727 | 842 | 738 | 942 | 1099 | 1071 | 1032 | 1061 | 1051 | 1049 | 1286 |
| 837 | 870 | 1020 | 1014 | 935 | 941 | 1042 | 1225 | 975 | 925 | 913 | 852 | 841 | 1036 |
| 337 | 384 | 389 | 358 | 368 | 345 | 325 | 311 | 286 | 251 | 217 | 167 | 160 | 171 |
| 45 | 38 | 27 | 26 | 24 | 22 | 21 | 32 | 52 | 51 | 52 | 30 | 54 | 71 |
| 79 | 55 | 71 | 64 | 51 | 32 | 124 | 138 | 134 | 136 | 135 | 68 | 168 | 18 |
| 232 | 251 | 261 | 249 | 321 | 288 | 340 | 284 | 358 | 372 | 410 | 416 | 356 | 608 |
| 250 | 4 | 405 | 750 | 20 | 283 | 772 | 304 | 465 | 180 | 200 | 217 | 1223 | 207 |
| 14181 | 15431 | 17056 | 16035 | 16462 | 17075 | 20000 | 20047 | 20000 | 19123 | 20952 | 20751 | 22553 | 24166 |

# కథలు - గేయాలు

## పులకించిన పురిటి గడ్డ

బి. శీనయ్య నెల్లూరు

ఆంధ్రప్రదేశ్,
ఐక్యఉపాధ్యాయసంఘం
జరుపుకొంటి ఘనంగా,
రజతోత్సవ సంబరం

ఉవ్వెత్తున తరలివచ్చిన,
ఉపాధ్యాయ ప్రవాహం
పులకించి పోయింది
పురిటిగడ్డ దర్శించి

వర్ణించనలవి కాదు
కవికైన రవికైన
వీక్షించిన వారికే
అవగతం ఆ గొప్పతనం.

## ఎందుకు

ఎం. పర్వతాలు అమ్రాబాదు

తలుపే లేని తాటాకుల గుడిసెకు
తాటికాయంత తాళమెందుకు
గోచిబట్ట లేని గాసగాళ్లకు
గ్యాస్ పొయిలెందుకు

నిండుబట్టలు వానికి
నిహార్ కొబ్బరి నూనెందుకు
కరువుతో పోరాడే మనకు
కంప్యూటర్లెందుకు

అన్నపూర్ణ మన ఆంధ్రప్రదేశ్‌ని
అప్పులకై తాకట్టు పెట్టుటెందుకు
అమెరికా అధ్యక్షుని రాకకై
అదుపు లేని ఖర్చెందుకు

## చిరంజీవి

-స్వామి

ధన్యుడవయ్యా కడలి
అమరుడవయ్యా గంగిశెట్టి

ఉద్యమం పిలిచినపుడు
ఉద్యోగం తృణ ప్రాయమన్నావు

అక్షరాలలోన లక్ష్యమ్మును
అద్భుతంగా మలిచేవు

అజ్ఞాన పుటంతరాలు
అవలీలగ తొలగించి

విజ్ఞాన పుజ్యోతులను
విశ్వమంత నింపావు

యు.టి.యఫ్. గేయంలో
ఆశయాలు వివరించి

భవిష్యత్ కర్తవ్యాలు
బహుబాగా చెప్పావు

చిరకాలం నిలిచే రచనలో
చిరంజీవివైనావు.

## వేగుచుక్క

రవి అస్తమించలేదు
రాజమరణించలేదు
రజతోత్సవసభలో
రోజాలా వెలిగావు

ఆకాశ మంటపందిరి
భూదేవంతవేదిక
భూనభోంతరాలు ఏకమై
భువన విజయమైనాయి.

వేలాదికి భోజనాలు
రేపగలు పెట్టినారు
నీసహచరుల సేవలు
నిలుస్తాయి చిరస్థాయి

కాకినాడ వీధులలో
కదంతొక్కినప్రదర్శన
ధరిత్రిలో సాటిలేనిది
చరిత్రలో చిరస్థాయిది

మరవలేము నిన్ను
మహనీయానమ్మ
వెలుగులు విరజిమ్మే
వేగుచుక్క వనీవు



# రాజ్యాంగ సమీక్ష - పరిశీలన

డాక్టర్ వై. రాధాకృష్ణమూర్తి
యం.పి.

మన రాజ్యాంగం ఒక బృహత్తర గ్రంథం. ఇది బూర్జువా రాజ్యాంగం. దీనిని రచించినవారు భారత దేశంలోని అతిగొప్పమేధావులు. ఆస్తిహక్కుని ప్రాథమిక హక్కుగా గుర్తించిన ఈ రాజ్యాంగం పనిచేసే హక్కును నివాసం పొందే హక్కు - యిలాంటి కనీస హక్కులను రెండవతరగతి హక్కులుగా గుర్తించింది. అలాగే సోషలిజం అనే పదం ఉపక్రమణలో వుంది. కానిఇది కొంచెం ఆలస్యంగా 42 వ సవరణ సందర్భంగా ఒక అత్యవసరపరిస్థితి సందర్భంగా సిద్ధాంతపరమైన నిశ్చితాభిప్రాయం (Conviction) లేనటువంటి పరిస్థితులలో అవకాశవాదంతో చేర్చబడిన మాట. రాజ్యాంగం రచించబడిన తరువాత గత 50 సంవత్సరాలలో మన ధర్మాసనాలు ముఖ్యంగా సుప్రీంకోర్టు రాజ్యాంగంపై చాలా తీర్పులు చెప్పింది. వ్యాఖ్యానాలు చేసింది . కొత్త భాష్యాలు కూడా చెప్పింది. సుప్రీంకోర్టు యిచ్చిన తీర్పులన్నీ మన రాజ్యాంగంలో భాగంగానే పరిగణింపబడతాయి. ఈ విషయాన్ని మనం గమనంలో వుంచుకోవాలి.

ప్రపంచంలో వున్న రాజ్యాంగాలన్నింటిలో మన రాజ్యాంగం బరువైనది, నిండువైనది ప్రపంచంలోని రాజ్యాంగాలన్నింటిలోని మంచి చెడ్డలను పరిశీలించి మన పరిస్థితులకు అనుకూలంగా తీర్చి దిద్దబడిన రాజ్యాంగం మనది. అదే సందర్భంగా ప్రధానంగా బ్రిటిష్ వెస్ట్‌మినిస్టర్ తరహాలో పార్లమెంటరీ ప్రజాస్వామ్యాన్ని ఎన్నుకొన్న రాజ్యాంగం మనది. ఇందులో కొన్ని మౌలిక అంశాలు వున్నాయి. మరి కొన్ని ఆచరణకు సంబంధించిన అంశాలు వున్నాయి. ఈ అన్నింటిని కలగాపులగం చేయటంవలన మన రాజ్యాంగంలో కొంత సంక్లిష్టత, సంక్షోభం కూడా ఏర్పడ్డాయి. ఏమైనా పార్లమెంటరీ ప్రజాస్వామ్యాన్ని మనం ఎంపిక చేసుకొన్నామనే విషయాన్ని దృష్టిలో పెట్టుకొంటే తరువాత మనం చేయబోయే పరిశీలన అర్థం చేసుకొనడం సులభతరమవుతుంది.

మన రాజ్యాంగం గత 50 సంవత్సరాలుగా మన దేశ అవసరాలకు పనికి వచ్చింది. మన ఇరుగుపొరుగు దేశాలలో పార్లమెంటరీ ప్రజాస్వామ్యం లేక పోయినప్పటికి మన దేశంలో ప్రజాస్వామ్యం ఏదో ఒక రూపంలో కొనసాగుతుంది. "నియంతృత్వ ఎడారిలో ఒయాసిస్ మనదేశం" ఏమైనా రాజ్యాంగంలో కొన్ని లోటు పాట్లు వున్నప్పటికి ఈ ప్రజాస్వామ్యాన్ని ఆగ్నేయాసియా దేశాలలో నిలబెట్టడానికి ప్రాథమికంగానైనా ఉపయోగపడింది. మరొక అంశం, మన దేశంలో కేంద్రంలోను రాష్ట్రాలలోను, వేర్వేరు పార్టీలు అధికారంలోకి వచ్చి ప్రభుత్వం నడపగల పరిస్థితి కల్పించింది ఈ రాజ్యాంగమే. మార్క్సిస్టుపార్టీ వారి మిత్రపక్షాలు కొన్ని రాష్ట్రాలలో అధికారంలో వుంటే, వారికి పూర్తిగా భిన్నమైన రాజకీయ దృక్పథం గల బి.జె.పి. దాని మిత్రపక్షాలు కేంద్రంలో అధికారంలో వున్నాయి. ఇలాంటి పరస్పర విరుద్ధమైన శక్తులను యిముడ్చుకొనగలిగిన శక్తి మన రాజ్యాంగంలో వుంది.

రాజకీయాలలో అవాంఛనీయ శక్తులకు అవకాశాలు కల్పించింది ఈ రాజ్యాంగమే. రాజ్యాంగంలోని ఉపక్రమణికలో సోషలిజం వున్నది. మరోవైపు స్వేచ్ఛా మార్కెట్‌కి అవకాశం కల్పించింది ఈ రాజ్యాంగమే. అన్ని ప్రధాన రంగాల నుండి వైదొలగడానికి అవకాశం కల్పించింది ఈ రాజ్యాంగమే. ఆర్టికల్ 39c లో సంపద అంతా కొద్దిమంది చేతుల్లో పోగుపడకూడదని చెప్పబడింది. కాని ఈ రోజు జరుగుతున్న దేమిటి ? సంపద అంతా కొద్దిమంది చేతుల్లోనే పోగుపడుతుంది. అందుకు అవకాశం కల్పించింది కూడా ఈ రాజ్యాంగమే. అలాగే ఆర్టికల్ 52లో శాస్త్రీయ అవగాహన అందరూ అలవరచుకోవాలని చెప్పబడింది. ఎంత మంచి ఉపదేశం ! రాజ్యాంగాన్ని అడ్డం పెట్టుకొని కొన్ని వక్రీకరణలు కూడా జరిగాయి. ఒకటి యమర్జన్సీ విధింపు. రెండు షాబానో కేసు.

రాజ్యాంగాన్ని పునస్సమీక్ష చేయాలని అజెండాని ముందుకు తెస్తున్నారు. ఎవరు ? ఎందుకు ? 1989 నుండి తరచుగా ప్రభుత్వాలు మారడాన్ని చూస్తున్నాం. 1989, 1991, 1996, 1998 లలో ప్రభుత్వాలు మారాయి. ప్రజల ఆశలు నెరవేరకపోగా అసంతృప్తి జ్వాలలు రగులుతున్న కాలం యిది. అరాచకాలు దేశ వ్యాప్తంగా పెచ్చుమీరినకాలం. అందువలననే ఈ ఆరాటానికి సత్వర ప్రేరకాలుగా యివి వున్నా, , ఈ ప్రేరకాలకు వెనుకవున్న అసలు ఉద్దేశ్యాలు తెలుసుకోవడంలో ప్రజాబాహుళ్యం యొక్క వైఫల్యాలు ఈ కారణం వలననే సంభవిస్తున్నాయని నా అభిప్రాయం. ఈ రాజ్యాంగ సమీక్షా నినాదం కూడా మెదటసారిగా యిప్పుడే రాలేదు. అధికారపార్టీకి తలనొప్పి వచ్చిన ప్రతిసారీ ఈ నినాదం ముందుకు వస్తుంది. "ఇందిరే ఇండియా, ఇండియాయే ఇందిర" అన్న కాలం మీలో చాలామందికి గుర్తుండి వుంటుంది. ఆనాడు "మనకు పార్లమెంటరీ ప్రజాస్వామ్యం పనికి రాదు. అధ్యక్ష తరహా పాలన కావాలి" అన్నారు వసంతసాఠే. ఇదే నినాదాన్ని మరి కొందరు కూడా అందుకున్నారు. ఇందిరాగాంధీపాలన కలకాలం కొనసాగడం - ఆ నినాదాలు యిచ్చిన వారి అవసరం ఇప్పటి కేంద్రప్రభుత్వం కలకాలం యిలాగే కొనసాగాలని కోరుకొనేవారు యిప్పుడు రాజ్యాంగాన్ని పునస్సమీక్షించాలి అంటున్నారు. అధికారంలో వున్న రాజకీయ కూటమి యొక్క తాత్కాలిక అవసరాలు తీరేందుకే ఈ సమీక్ష. గత రెండు మూడు సంవత్సరాలలో బి.జె.పి. పాలన అర్థాయుష్షు - అల్పాయుష్షు అనడం కూడా పొరపాటే. 13 రోజులు

ఒకసారి, 13 నెలలు రెండవసారి. ఈ అల్పాయుష్షు సందర్భంగానే రాజ్యాంగాన్ని పునస్సమీక్ష చేయాలనే ఆలోచన ఊపు అందుకొన్నది. ఈపునస్సమీక్ష కాంగ్రెస్ ప్రణాళికలో లేదు. కమ్యూనిష్టుల ప్రణాళిలో లేదు. యస్.డి.ఎ. ప్రణాళికలో వుంది. దానిని ఆచరణలో పెట్టేందుకు జనవరి 10 న ఒక నోట్ తయారు చేశారు దానిలో ఏయే అంశాలపై జరపాలో నిర్ణయించి, దానిని కేబినేట్ పరిశీలనకు పంపించారు. సి.వి.సి. ఏర్పాటు చేయడానికి అవసరమైన తతంగంజరుగుతున్నది. సి.వి.సి.కి ఎవరు బాధ్యత వహించాలో నిర్ణయాలు చేసి ప్రకటించేపేర్లను రేసోమాపో మనం పత్రికల్లో చదువుతాం. రాజ్యాంగంలో కొన్ని హక్కులు అవసరమే కావచ్చు. కాని తిరగతోడటం కాదు. కాని పునస్సమీక్ష జరగాలి అంటున్నవారు ఏయే అంశాలపై సమీక్ష జరపాలంటున్నారు ! మనం ఏమి కోరుకొంటున్నాం ?

మొదటి అంశానికి వస్తే సుస్థిరమైన ప్రభుత్వాల కాలం చెల్లిపోయింది గనుక సుస్థిరంగా వుండే ప్రభుత్వ ఏర్పాటుకి అవసరమైన ప్రాతిపదిక వున్న రాజ్యాంగం కావాలి అంటున్నారు. వారి ఎన్నికల మేనిఫెస్టోలో, ఎన్నికల ప్రచారాల్లో, వారి విన్యాసాలలో ఉపన్యాసాలో వారి మనసులో మాట వ్యక్తం చేశారు.

మొదటిది సుస్థిరత. సుస్థిరమైన ప్రభుత్వమా ? సుస్థిరమైన జీవితమా ? వీటిలో ఏది కావాలో మనం తేల్చుకోవాలి. పరిపాలన సాగించే వారి సింహాసనాలకు సుస్థిరత అవసరమా ? ఇక్కడ నివసించే 100 కోట్లు ప్రజల ఉన్నత జీవన ప్రమాణాలకు సుస్థిరతా ? వారు కోరుకొనేది మొదటిదే. రెండవది కాదు. మన ముందు సుస్థిర ప్రభుత్వాల అనుభవాలూ వున్నాయి. సంవత్సరం రెండు సంవత్సరాలకు మారుతున్న ప్రభుత్వాల అనుభవాలు వున్నాయి. ఉదాహరణకు బ్రిటన్ తీసుకొందాం. గడిచిన 198 సంత్సరాలలో 50 ప్రభుత్వాలు మారాయి. సగటున ఒక్కొక్క ప్రభుత్వం 4 సం॥ లు కూడా పాలన సాగించలేదు. రెండవ ప్రపంచయుద్ధం తరువాత ఫ్రాన్స్‌లో 50 ప్రభుత్వాలు వచ్చాయి. అంటే 50 సంవత్సరాలలో 50 ప్రభుత్వాలు. జపాన్‌లో ఇటలీలో యిలానే జరిగింది. ఇటలీలో యిప్పుడున్నది 54వ ప్రభుత్వం. ఆ దేశాలు నాశనమై పోలేదు. ఆర్థికంగా మనకంటే పుష్టిగానేవున్నాయి. ఇండోనేషియాలో, చిలీలో, సుస్థిర ప్రభుత్వాలు చాలా కాలం వున్నాయి. 30 సం॥లు ఒక్కరే పాలించారు. కాని ఆ దేశాలు ఎంతటి తీవ్రసంక్షోభంలో వున్నాయో మనకి తెలుసు. ప్రభుత్వాలు ఏం చేస్తున్నాయి. ? ప్రజలకు ఎంతమేలు చేస్తున్నాయి. ? అనేది ముఖ్యంగాని ఎంతకాలం పాటు పాలించాయి అనేది ముఖ్యంకాదు.

"పార్లమెంటరీ ప్రజాస్వామ్యానికి బదులుగా అధ్యక్షతరహాపాలన కావాలి" అనేది వారు సూచించే రెండవ ముఖ్యమైన అంశం. అద్వానీ వాజ్‌పాయ్‌లు 27-4-98 న పాట్నాలో చేసిన ప్రసంగంలో వారి మనసులో మాట చాలా స్పష్టంగా బయటపెట్టారు. ఏమన్నారు ? రాజ్యాంగంలో మార్పులు అవసరం కొన్ని మౌలికమైన మార్పులు అవసరం. రాజ్యాంగాన్ని సమీక్షించేందుకు ఒక కమీషన్ నియమించడం అవసరం. ఇందులో ముఖ్యంగా అధ్యక్షతరహా పాలన వుంటుంది.

పార్లమెంటరీ ప్రజాస్వామ్యంలో జవాబుదారీతనం వుంటుంది. ప్రభుత్వం ఏమిచేసిందీ పార్లమెంటులో చెప్పవలసివుంటుంది. విమర్శలు స్వీకరించాలి. జవాబులు చెప్పుకోవాలి. అధ్యక్షతరహా పాలనలో అలాంటి అవకాశాలు వుండవు. అధ్యక్షుడ్ని ఒకసారి ఎన్నుకొంటే 5 ఏళ్లపాటు అధికారంలో వుంటారు. కాని అతడు పార్లమెంటుకి వచ్చి "అదిచేశాను ఇదిచేశాను" అని చెప్పుకోవలసిన అవసరం లేదు. పార్లమెంటు ఆమోదం పొందవలసిన అవసరమూలేదు. దీనినే అంబేద్కర్ యిలా చెప్పాడు. " The daily assessment of responsibility which is not available under the American System is dispelled far more necessary in a country like India. The draft Constitution in recommending the parliamentary System of execution has deferred to more responsibility and more stability " భారతదేశం లాంటి అతిపెద్ద దేశంలో స్థిరత్వం కంటే బాధ్యత ముఖ్యం అని భావించినందువల్లనే అమెరికా అధ్యక్షతరహానిగాక పార్లమెంటరీ ప్రజాస్వామ్యాన్ని స్వీకరించామని అంబేద్కర్ స్పష్టంచేశారు. అంటే మన రాజ్యాంగ నిర్మాతలు స్థిరత్వం కంటే జవాబుదారీ తనానికి,బాధ్యతకు ప్రాధాన్యతనిచ్చారు.

మన దేశంలో కొన్ని ప్రత్యేకతలు వున్నాయి. వైవిధ్యం దృష్టితో చూసినా వైశాల్యం దృష్టితో చూసినా కొన్ని పెద్ద రాష్ట్రాలు వున్నాయి. యు.పి., బీహార్ లాంటివి. వీటిని బీమారీ (జబ్బునపడ్డ) రాష్ట్రాలని కూడా అంటారు. వీటితో పోల్చితే మనరాష్ట్రం మరికొన్ని చాలా చిన్న రాష్ట్రాలు. ఇక ఈశాన్య రాష్ట్రాల సంగతి చెప్పనవసరం లేదు. అవి మినహా చిన్నరాష్ట్రాలు అధ్యక్షుడిని ఎన్నుకొనడంలో ఈ బీమారీ రాష్ట్రాలు వాటి సైజు కారణంగా ప్రధానపాత్ర వహిస్తాయి.

అధ్యక్షునిగా పోటీచేసే వ్యక్తి యెక్క మంచి చెడులను ప్రతి ఓటరు తెలుసుకోవడంలో కూడా చాలా యిబ్బందులు వున్నాయి. ఒక వ్యక్తిని గురించి ఈ దేశంలో వున్న 60 కోట్ల మంది ఓటర్లు తెలుసు కొనడం చాలా కష్టం అందువలన అధ్యక్షుణ్ని ఎన్నకోవడంలో తప్పులు చేయడానికి ఎక్కువ అవకాశాలు వుంటాయి. జర్మనీలో గతంలో హిట్లర్‌ని ఎన్నుకొన్నారు. ఇటీవల ఎన్నుకొనబడిన హెల్మెట్‌కోల్ అవినీతి ఆరోపణలతో జైలుకి వెళ్లడానికి సిద్ధంగా వున్నారు. మెక్సికో అధ్యక్షుడు శాలినాస్ అధ్యక్షపదవి నుండి దిగగానే విదేశాలకు పారిపోయాడు. అలాంటి ఉదాహరణలే మనం జపాన్‌లో చూడవచ్చు. దక్షిణ కొరియాలో చూడవచ్చు. దేశవ్యాప్తంగా గల ఓటర్లు ఒక వ్యక్తిని ఎన్నుకొనడంలో చాలా పొరపాట్లు వుంటాయి.

ఇప్పుడున్న అధ్యక్షునికి అంటే పార్లమెంటరీ ప్రజాస్వామ్యంలో ఎన్నికైన అధ్యక్షునికి మరికొన్ని అధికారాలు కల్పించవచ్చునే గాని మొత్తం రాజ్యాంగాన్ని మార్చనవసరం లేదని మాజీ సోలిసిటర్ జనరల్ ఫారియస్ నారిమన్ గతంలో సూచించారు. ఆవిధంగా యిప్పుడున్న రాజ్యాంగాన్ని పరిపుష్టంచేయవచ్చునని రాజ్యాంగ నిపుణుల అభిప్రాయం.

మరొక అంశం ద్విపక్షవిధానం. ఇప్పుడు మనదేశంలో వున్న మొత్తం రాజకీయపార్టీల మాట అలావుంచి కేవలం అధికార కూటమిలోనే 25 పార్టీలు వున్నాయి. ఇన్ని పార్టీలు వుండడం తికమకగా గందరగోళంగా వుందని యిటీవల మాజీ రాష్ట్రపతి వెంకట్రామన్ చెప్పారు. ఆయనకి యిప్పుడెందుకు యిలాంటి ఆలోచన వచ్చిందో మనకి తెలియదు. రెండు పార్టీలే వుండాలంటే మిగిలిన పార్టీలను

# సాంస్కృతిక ప్రదర్శన దృశ్యాలు

**భోజనశాలలో అతిథులు , ప్రతినిధులు**




1.శ్రీ డి.ఆర్.కె.రెడ్డి వ్యవస్థాపక గౌరవాధ్యక్షుడు డి.ఎల్.ఆర్. కాలేజి జి.మామిడాడ తరపున రు.లక్ష విరాళం అందచేసిన దృశ్యం. 2. సభకు హాజరైన సోదర సంఘాల నాయకులు. 3. మెమోంటోలకై విరాళాలు ఇచ్చిన శ్రీ ఎ.సత్యప్రసాద్, అడ్వకేట్, శ్రీమతి వి.రాధామణి, రిటైర్డ్ టీచర్

ఎలా తొలగించాలి అనేది ఒక సమస్య. రెండు పార్టీల విధానమే వుండాలంటే అస్సాంలో వున్న ఎ.జి.పి. ఏంకావాలి ? తమిళనాడులో వున్న డి.యం.కె., ఎ.ఐ.ఎ.డి.యం.కె., పి.యం.కె లు ఏంకావాలి ? మన రాష్ట్రంలోని టి.డి.పి. ఏం కావాలి ? ఇంత విశాలమైన దేశంలో, ప్రాంతీయ అసమానతలు వున్న దేశంలో, భాషా సంస్కృతుల వైవిధ్యం వున్న దేశంలో రెండే రెండు పార్టీలు వుండాలనడం అసంబద్ధమైన విషయం. పోనీ రెండు పార్టీలు వున్న దేశాలలో పాలన చాలా సజావుగా సాగుతుందా ? ప్రజలు చాలా సుభిక్షంగా వున్నారా ? అనేది పరిశీలించవలసిన అంశం. మనకి రెండుపార్టీల విధానం వున్న దేశాలుగా అమెరికా, బ్రిటన్ కన్పిస్తున్నాయి.. కాని పెద్దలు చెప్పేది, మనకు కూడా అర్ధమయ్యేది ఏమిటంటే అక్కడ రెండు పార్టీలకు మౌలికంగా ఏమీ తేడా లేదు, గుర్తులో తప్ప ఒకరిది ఏనుగు, మరొకరిది గాడిద, - కాని స్వభావంలో రెండూ ఒక్కటే అలాగే బ్రిటన్ లోని లేబర్ కన్సర్వేటివ్ పార్టీలు ప్రజాస్వామ్యం పరిఢవిల్లుతున్న యూరపు దేశాలైన స్పెయిన్, ఫ్రాన్స్ జర్మనీలను తీసుకోండి. ఈ అన్ని దేశాలలో బహుళ పక్షవిధానమే కొనసాగుతున్నది. అక్కడ కూడా నాలుగు, ఐదు లేక పదిపార్టీల సంకీర్ణప్రభుత్వాలే వున్నాయి. ఆ దేశాలలో యిబ్బందే కలగడం లేదు. అన్ని పార్టీలు కూడ ప్రజలవద్దకు వెళ్ళి మా విధానాలు యివీ అని చెప్పగలుగుతున్నాయి. కాబట్టి రెండు పార్టీల విధానం వుంటేనే దేశానికి ఒరుగుతుంది., దేశం అభివృద్ధిచెందుతుంది అనే వాదన నిశితమైన, హేతుబద్ధమైన పరిశీలనకు నిలబడదు.

మరొక అంశం నిర్దిష్టకాలపరిమితి. ఒకసారి పార్లమెంటుని గాని అసెంబ్లీని గాని ఎన్నుకొంటే అది ఐదు సంవత్సరాలు కొనసాగాలి, రద్దుచేయడానికి వీలు లేదు అని ఇప్పుడు కూడా కాలపరిమితి ఐదు సంవత్సరాలే. కాని రద్దు చేయడానికి అవకాశం వుంది. అధ్యక్షుడు రద్దు చేయవచ్చు. ఇప్పుడు వారు కోరేదేమంటే ప్రభుత్వాన్ని అధ్యక్షుడు కూడా రద్దుచేసే అవకాశం లేకుండా ఐదు సంవత్సరాలు కొనసాగ లని అలా కొనసాగడంలోని దుష్ఫలితాలను పరిశీలిద్దాం. పార్లమెంటుగాని అసెంబ్లీగాని విశ్వాసాన్ని కోల్పోయింది. విశ్వాసం కోల్పోయిన ప్రభుత్వం పాలన సాగించటాన్ని కోరుకుంటారా ? అధికారంలో వున్న రాష్ట్రప్రభుత్వం మీదనో, కేంద్రప్రభుత్వం మీదనో విశ్వాసం లేనప్పుడు దానిని మార్చే అవకాశం ప్రజలకు లేకుండా చేయడం సమంజసమా ? రద్దు చేయడానికి వీలులేని విధంగా రాజ్యాంగాన్ని మార్చుకొన్నామనుకోండి. అప్పుడు జరిగేది ఏమిటి? ఏరకంగా ప్రభుత్వం కొనసాగాలి. అలా కొనసాగేందుకు కొనుగోళ్లవ్యాపారం యధేచ్ఛగా సాగుతుంది. ఇప్పుడైతే విమర్శలు చేస్తున్నాం. అప్పుడు అలాంటి విమర్శలుకూడా చేయపనిలేదు. ఎందుకంటే ఏదోరకంగా ప్రభుత్వం నడవాలి గదా ! లేదంటే మరొక అవకాశం ఉంది. అది కల్యాణ్‌సింగ్ ఉత్తరప్రదేశ్‌లో చేసి చూపించింది కేంద్రంలో 273 మందికి మంత్రి పదవులివ్వవచ్చు. అప్పుడు ప్రభుత్వం సుస్థిరంగా వుంటుంది. దానికి ఒప్పుకొందామా ? పార్లమెంటులోగాని అసెంబ్లీలో గాని ఎన్నికైన సభ్యులతో పదిశాతం కంటె మంత్రులు వుండకూడదని గతంలో మన పెద్దలు చెప్పారు. కాని ఆపరిస్థితి ఎప్పుడో పోయింది.

పార్లమెంటులోగాని అసెంబ్లీలో గాని ప్రభుత్వానికి మెజారిటీలేదు. ప్రభుత్వం స్థిరంగా వుండాలి. ప్రతి పక్షాలవారు ఎవరూ అమ్ముడు పోవడానికి సిద్ధంగాలేరు. అప్పుడు బడ్జెటు ఎలా పాసవుతుంది ? బడ్జెటు పాస్ కాకపోవడం కంటె పెద్ద సంక్షోభం ప్రభుత్వానికి మరొకటి వుండబోదు.

మరొక అంశం నిర్మాణాత్మక విశ్వాస రాహిత్యతీర్మానం ప్రతిపాదన. అంటే విశ్వాసరాహిత్య తీర్మానం ప్రవేశపెట్టేటప్పుడే మేమే వీరిని గద్దె దింపుతున్నాం. వీరిని ఎక్కిస్తునాం అని ప్రతిపాదించాలి. అలా చేస్తే ఇటీవల వచ్చిన సంక్షోభం లాంటి దానిని నివారించవచ్చునని ఒక ఆలోచన. ఈ సందర్భంగా సుప్రీంకోర్టు న్యాయమూర్తి హెచ్.ఆర్. ఖన్నా యిలా అన్నారు. " This is quite difficult because the majority which might be forged against a Government is frequently a negative one ; and is united more by dislike for the incumbent as not by any agreement in substitute" అలాంటి సందర్భం వస్తుంది గనుక అది దాదాపు అసాధ్యం అని ఆయన చెప్పారు. జర్మనీలో దామాషా ప్రాతినిధ్య పద్ధతి వుంది.

బి.జె.పి. చిన్న రాష్ట్రాలను కోరుకొంటుంది. ఇప్పుడు దేశంలో 23 రాష్ట్రాలు వున్నాయి. మరి మూడు రాష్ట్రాలను ఏర్పాటు చేస్తానంటుంది. అవి చేయగానే మన రాష్ట్రంలో ప్రత్యేకతెలంగాణా, ప్రత్యేక రాయలసీయ లాంటి ఉద్యమాలు మొదలవుతాయి. ఇలాగే ఇతర రాష్ట్రాలలో కూడా. స్వార్ధపరశక్తులు రాజకీయాల్లో తిష్టవేసుక్కూర్చున్నారు. రాష్ట్రాలకు ఎక్కువ అధికారాలు యివ్వడం బి.జె.పి. కి యిష్టంలేదు. "Federal System of Govt కంటే unitary System వుండాలని కోరుకొంటుంది. ఏందుకంటే చిన్న రాష్ట్రాలపైన పెత్తనం చేయడం తేలిక గనుక " కేంద్రంలో అధికారాన్ని కేంద్రీకృతం చేయడానికే చిన్న రాష్ట్రాలు కోరుకొంటుంది. ఇది నిరంతర వివాదాలకు అవకాశం కల్పించే ప్రతిపాదన.

ఇదివరకు బి.జె.పి. మేనిఫెస్టోలో వుండి యిప్పుడు యన్.డి.ఎ మేనిఫెస్టోలో లేని విషయాలను యిప్పుడు సి.వి.సి. ప్రతిపాదిస్తుందా అంటే ఐదేళ్ళవరకు ప్రతిపాదించదు. ఆ తరువాత ప్రతిపాదించే అవకాశం వుందని యిటీవలి అనేక ఉపన్యాసాలలో స్పష్టంగాను మొన్న చెన్నైలో జరిగిన బి.జె.పి. జాతీయసదస్సులో చూచాయగాను చెప్పబడింది.

370 రద్దు, కామన్ సివిల్‌కోడ్, మైనారిటీల రక్షణ రద్దుకు సంబంధించిన ఆర్టికల్స్ 29,30 వగైరాలు బి.జె.పి. అజెండాలో వున్నాయి. తాత్కాలికంగా ప్రక్కన పెట్టారు. వారు స్వయంగా అధికారంలోకి వస్తే వీటిని బయటకి తీస్తామంటున్నారు. అవి బయటకి తీయకుండాచేయడం దేశప్రజానీకం కర్తవ్యం.

ఇక మనం ఏం కోరుకుంటున్నామో సంక్షిప్తంగా చెప్పవలసివుంది. భారతదేశ ప్రజలందరికీ సామాజిక ఆర్థిక రాజకీయ న్యాయం కావాలని కోరుకుంటున్నాం. సోషలిజం అనే పదం ప్రత్యేక పరిస్థితులలో చేర్చాలని ఇంతకుముందు చెప్పారు. Socialism కాక పోయినా కాస్త సమానంగా బతకడానికి అవకాశం వుండే సమాజాన్ని మనం కోరుకుంటాం. రాజ్యాంగంలో మార్పులు సవరణలు అందు కనుగుణంగా చేయాలని కోరుకుందాం.

రాజ్యాంగాన్ని సవరించడానికి చేసే ప్రయత్నాలకు గతంలో సుప్రీంకోర్టు ఒక అభ్యంతరం చెప్పింది. మౌలికమైన అంశాలు కొన్ని రాజ్యాంగంలో వున్నాయి. వాటిని మీరెవరూ మార్చకూడదని సుప్రీంకోర్టు

చెప్పింది. అంటే సవరణల పేరుతో కూడ మౌలిక అంశాలు మార్చకూడదు అని. గోలక్‌నాథ్ కేసులో గాని కేశవానంద భారతి కేసులోను చెప్పిందదే. అందుకే యిప్పుడు గొంతులో పచ్చి వెలక్కాయ పడ్డ పరిస్థితి ఏర్పడింది. ఏవి మౌలిక అంశాల క్రిందికి వస్తాయి ? అనేది యిప్పటి ప్రశ్న. పార్లమెంటరీ ప్రజాస్వామ్యమా ? లేక అధ్యక్షతరహా ప్రజాస్వామ్యమా ? అనే వివాదంలో ప్రజాస్వామ్యం అనేది మౌలికమైన అంశం గాని పార్లమెంటరీ ప్రజాస్వామ్యం కాదని అద్వానీగారు ఒక ఉపన్యాసంలో చెప్పారు. దీనిపై చర్చ జరిగింది. దీనిపై రాజ్యాంగనిపుణులు సుప్రీంకోర్టు జడ్జీలు యితర పెద్దలు కేశవానందభారతి కేసులో తీర్పు యిచ్చిన సందర్భంలో ప్రస్తావించిన రెండు మూడు అంశాలను ప్రస్తావించారు. రాజ్యాంగ ఉపక్రమణిక, ప్రాథమిక హక్కులు, ఆదేశిక సూత్రాలు, పార్లమెంటరీ ప్రజాస్వామ్యం. ఈ నాలుగు అంశాలు రాజ్యాగానికి మూలచట్రంగా వుంటాయనీ, వీటిని మార్చేందుకు పార్లమెంటుకి అధికారాలు లేవని అత్యధికులు అంగీకరిస్తున్నారు. న్యాయమూర్తులు జగన్మోహన రెడ్డి , కె. సుబ్బారావు అగర్వాల్ చెప్పిన తీర్పులలో పార్లమెంటరీ ప్రజాస్వామ్యం రాజ్యాంగం యొక్క మూల చట్రంలో భాగమని నొక్కి చెప్పారు.

సెక్యులరిజం బేసిక్ స్ట్రక్చర్‌లో వుందా ? లేదా ? దానిని గురించి కూడా సుప్రీంకోర్టు స్పష్టంగానే చెప్పింది. మన బి.జె.పి నేతలు యితరులది సూడో సెక్యులరిజం తమది పాజిటివ్ సెక్యులరిజం అని అంటుంటారు. దీనిపై సుప్రీంకోర్టు న్యాయమూర్తులు జీవన్‌రెడ్డి, రామస్వామి, సావంత్ కులదీప్ సింగ్ అహమ్మద్ స్పష్టమైన వ్యాఖ్యానాలు చేశారు. రాజ్యాంగ నిర్మాతలు రాజ్యాంగాన్ని నవ సమాజ నిర్మాణం కర్తవ్యంగా సెక్యులర్ దృక్పథంతో రాశారని జీవన్‌రెడ్డి స్పష్టంచేశారు. మతం, రాజకీయం కలగాపులగం కాకూడదు మతం వేరు. రాజకీయం వేరు. మతం రాజకీయం మధ్య స్పష్టమైన అడ్డుగోడ వుండాలి. సుప్రీంకోర్టు తీర్పులో ఒక అంశం " Religious organisation can not be a political party at the same time".

ఆర్టికల్ 356 నూటపది సార్లకు పైగా దుర్వినియోగం చేయబడింది. ఇది దుర్వినియోగం చేయబడే అవకాశం వుందని రాజ్యాంగ నిర్మాతలకు ఆందోళన వుంది. అందుకే అంబేద్కర్ " I do not altogether deny that there is a passibility of its misuse or being employed to political purposes, We ought to expect that such articles will never be called into operation; and it would remain a dead letter" అన్నాడు, 356 ఆర్టికల్ దుర్వినియోగంపై సుప్రీంకోర్టు ప్రభుత్వాలను చాలా సార్లు మందలించింది. బీహార్‌లో ప్రయోగించి భంగపడిన విషయం ఇటీవలి సంఘటనే.

అందరికీ చదువు అందరికీ ఆరోగ్యం, అందరికీ నివాసం ఆదేశిక సూత్రాలలో కాకుండ ప్రాథమిక హక్కులలో చేర్చాలని మనం కోరుకొందాం.

రాష్ట్రాలలో అధికారంలో వున్న అన్ని పార్టీలు కూడా కేంద్రప్రభుత్వం అధికారాన్ని తన గుప్పిట్లో కేంద్రీకరించుకొంటుందని ఆందోళన వ్యక్తం చేస్తున్నాయి. దీనిని పరిశీలించేందుకు గతంలో సర్కారియా కమీషన్ నియమింపబడింది. ఆ కమీషన్ కొన్ని ముఖ్యమైన సిఫార్సులు చేసింది. గవర్నర్‌ల నియామకంలోను, అధికార వికేంద్రీకరణ, నిధుల వికేంద్రీకరణలు పాటించవలసిన పద్ధతులను చెప్పింది.

ఆపద్ధర్మప్రభుత్వం యొక్కపరిమితులేమిటి ? బాధ్యత లేమిటి ? గత ఎన్నికల ముందు గల ప్రభుత్వం ఆపద్ధర్మ ప్రభుత్వానికి ఓడిపోయిన ప్రభుత్వానికి తేడా లేదని చెప్పి చేయగూడని పనులు చేసిందని ఆరోపణలు వున్నాయి. ఆపద్ధర్మ ప్రభుత్వానికి గల పరిమితులను బాధ్యతలను స్పష్టపరచడం అవసరమని మన సూచన.

న్యాయమూర్తుల నియామకం రాజకీయంగా జరిగితే తీర్పులు కూడా రాజకీయంగానే వుంటాయి. అందుకని నేషనల్ జుడీషియల్ కమిటీని ఒక స్వతంత్ర సంస్థగా ఏర్పాటు చేయాలి.

మహిళల రిజర్వేషన్ విషయంలో కూడా సవరణ అవసరం. అలాగే ఎన్నికలలో ధనబలం కండబలం నివారణ, పార్టీమార్పిడుల చట్టం, ఓటింగు దామాషాపై పార్టీలకు ప్రాతినిధ్యం – రాజ్యాంగంలో కోరదగిన మార్పులు అలాగే రాజకీయ పార్టీలు అంతర్గత ప్రజాస్వామ్యాన్ని పాటించాలి. అంతర్గత ప్రజాస్వామ్యాన్ని పాటించని పార్టీలు దేశాన్ని గాని, రాష్ట్రాన్నిగాని ప్రజాస్వామ్యయుతంగా పాలించలేవు.

రాష్ట్రపతి కె. ఆర్. నారాయణన్ యిలా అన్నారు. " B.J.P.'s attempt at legitamising by delegitamising the constitution is brought immense dangers to India. It is not the Constitution that failed us, but we the people of india who gave constitution and ourselves that failed the Constitution in its implimentation". రాష్ట్రపతి ఉభయసభలనుద్దేశించి "రాజకీయ అస్థిరతలను నివారించేందుకు రాజ్యాంగాన్ని పునస్సమీక్షించేందుకు కమీషన్ నియమించాలన్నది ప్రభుత్వం దృఢనిశ్చయంతో వున్నది " అని ప్రభుత్వ దృక్పథాన్ని అక్టోబరు 25న చదివి వినిపించారు.

డిసెంబరు 2 న డాక్టర్ రాజేంద్రప్రసాద్ 115 వ జన్మదినం సందర్భంగా రాష్ట్రపతి " రాజ్యాంగమార్పులు కోరేవారు దానిలో వున్న మహోన్నతమైన ఆశయాలను పరిరక్షించే జాగ్రత్తలు తీసుకోవాలి" అని సున్నితంగా హెచ్చరించారు. ఎవరికీ హెచ్చరిక ?

అమలులో రాజ్యాంగనిర్మాతల కలలు ప్రజల కన్నీటిలో కరిగిపోయాయి. వారి ఆశలు ఆకాంక్షలు అన్నార్తుల ఆక్రందనలో అదృశ్యమయ్యాయి.

1952 లో డాక్టర్ రాజేంద్రప్రసాద్ " If the people who are elected are capable and men of character and integrity, they should be able to make the best evenof a defective constitution, and to all we give our assurance it will be our endeavour to remove poverty squalor and its Companions hunger and the desease, and abolish destitution and exploitation and to ensure decent conditions of living to power ".

50 సంవత్సరాల తరువాత యిప్పుడు మనం ఆలోచించాలి. ఈ ప్రయత్నం జరిగిందా !

రాజ్యాంగాన్ని యిప్పుడు పునస్సమీక్షించాలి – అనేది అందుకేనా ? ఇది ఈనాడు మన ముందున్న ప్రశ్న.



# ఆర్థిక సంస్కరణలు - సామాజిక న్యాయం

డా॥ కె. నాగేశ్వర్

1980 దశాబ్దంలో వచ్చిన రాజకీయ పరిణామాలు - ముఖ్యంగా సోవియట్‌లో సోషలిజం పతనంతో మానవజాతి ముందున్న సైద్ధాంతిక విభజన అంతరించింది: "మానవజాతి మహాప్రస్థానం పెట్టుబడిదారీవిధానంతోనే ఆగిపోతుంది" - అనే బలమైన వాదన ముందుకి వచ్చింది. 1994 గాట్ ఒప్పందం 1995 ప్రపంచవాణిజ్య సంస్థ ఏర్పాటు, ప్రపంచ స్వేచ్ఛా మార్కెటు అవతరణతో ఆర్థిక ఏకీకరణ జరిగింది. అంటున్నారు.' నూతన శతాబ్దంలో, నూతన సహస్రాబ్దిలో మానవాళి సుఖశాంతులతో వర్థిల్లుతుందని చెపుతున్నారు.

కాని అనుభవం భిన్నంగా వుంది. ఎంతవేగంగా ఒకటైందో అంతవేగంగా అసమానతలు పెరిగాయి. సంపదలో అసమానతలు, వినిమయంలో అసమానతలు సాంకేతిక పరిజ్ఞానం అందుబాటులో అసమానతలు పెరిగాయి. ప్రపంచంలోని 10 శాతం మంది 21 వ శతాబ్దంలోకి పోతుంటే పేద దేశాలలోని 450 కోట్లమంది 19వ లేక 18వ శతాబ్దంలోకి నెట్టివేయబడుతున్నారు. అల్లూరి సీతారామరాజు మన్నెం ప్రజలను కూడగట్టి బ్రిటిషు పాలనకు వ్యతిరేకంగా రంప పితూరీ వ్యతిరేకంగా పోరాడారు. స్వాతంత్ర్యానంతరం అర్ధ శతాబ్దం గడిచినప్పటికి రంప గ్రామ ప్రజలలో 80% మలేరియతో తీసుకొంటున్నారు. ఆనాడు అంటే 100 సం॥ల క్రితం పోరాడింది. మలేరియాతో బాధ పడాలనే కోరికతో కాదు.

ప్రపంచ సంపద పెరిగింది అంటున్నారు. పెరిగిన మాట వాస్తవమే. ప్రపంచ జి.డి.పి.లో 86 శాతం, ఎగుమతులలో 82 శాతం విదేశీ పెట్టుడులలో 68 శాతం, టెలిఫోన్లలో 74 శాతం కేవలం 20 శాతం ప్రజలకు అందుబాటులో వుంది. సక్రమంగా సంపద పంపిణీ మనదేశంలో జరగలేదు, ప్రపంచంలో నూ జరగలేదు. ప్రపంచంలో అతిపేదలైన 60 కోట్ల జనాభాలో 45 కోట్లమంది తృతీయ ప్రపంచదేశాలలో నివసిస్తున్నారు. అతిపేదలుగా వున్న 60 కోట్ల జనాభా ఆదాయం ప్రపంచంలో సంపన్నులైన ముగ్గురి సంపాదనకు కూడా సమానం కాదు. ప్రపంచ సంపద పెరగడానికి ఆలోచనాపరులెవ్వరూ వ్యతిరేకులు కాదు. సంపద పంపిణీలో అసమానతలకు మాత్రమే వ్యతిరేకులు. 1700 కోట్ల డాలర్లు ఐరోపాలో అమెరికాలో చిరుతిండిపై ఖర్చు పెడుతున్నారు. కాని 1300 కోట్ల డాలర్లతో ప్రపంచప్రజలందరికీ కనీస వైద్యసదుపాయాలు కల్పించవచ్చు. 1100 కోట్ల డాలర్ల ఐస్ క్రీములపై ఖర్చు పెడుతున్నారు. కాని 900 కోట్లు డాలర్లతో తృతీయ ప్రపంచదేశాలకు మంచినీరు, మంచి వాతావరణం కల్పించవచ్చు. వారెవరో ఐస్‌క్రీములు తింటున్నారని బాధకాదు. కాని మన ముందున్న మంచి నీరు లాక్కొని వారు ఐస్‌క్రీములు తింటున్నారు. అదీ బాధ. సంపద కేంద్రీకరణ వలన కోట్లాదిమందికి కనీస అవసరాలు తీరని పరిస్థితి ఏర్పడుతున్నది. 130 కోట్లమంది మంచినీరు లేక బాధపడుతున్నారు. ప్రపంచం సమైక్యమయిందా ? ప్రపంచంలో రాజకీయ సైద్ధాంతిక విభేదాలు అంతరించాయని చెప్పడం సరియైనదేనా ? ప్రపంచీకరణ పేరుతో బహుళజాతి సంస్థల ఆధిపత్యం బలపడింది. సంపద వారి వద్ద పోగుపడుతున్నది. చివరికి రియల్ ఎస్టేట్ రంగంలో కూడా బహుళజాతి సంస్థలు చొచ్చుకొని వచ్చాయి. హైందవధర్మం మీద విశ్వాసం వున్న వాళ్లు పంచభూతములు సాక్షిగా ప్రమాణం చేస్తారు. కాని ఈ నాటి పరిస్థితులలో పంచభూతాల మారుగా బహుళజాతి సంస్థల సాక్షిగా ప్రమాణం చేయవలసిన పరిస్థితిలో పడ్డాం.

సహజవనరులపైననే గాక సామాజిక రాజకీయ ఆర్థిక వనరులన్నింటిపైనా బహుళజాతి సంస్థల ఆధిపత్యం నానాటికీ పెరుగుతున్నది. వ్యూహాత్మకరంగాలలో మాత్రమే విదేశీపెట్టుబడులను ఆహ్వానించామని చెప్పుకొన్న ప్రభుత్వం ఈనాడు ఎక్జిమ్ పాలసీతో బఠానీలు, చింతపండు, బొప్పాయి రసం, టైల్స్, వాకిళ్లకు కిటికీలకు వేసుకొనే కర్టెన్స్ దిగుమతికి అవకాశం కల్పిస్తున్నారు. ఎందుకని ఎవరైనా అడిగితే యిక్కడున్న సంపన్నులు కాలక్షేపానికి విదేశీ బఠానీలు తినవచ్చు. బ్రిటన్‌నుండి వచ్చిన బొప్పాయిరసం తాగవచ్చు. టర్కీ నుండి వచ్చిన టవల్స్‌తో తుడుచుకోవచ్చు. వారికి ఈమాత్రం సౌకర్యాలు సమకూర్చవద్దా ? అంటుంది ప్రభుత్వం. అదీ ఈ పాలకులు సృష్టించే నూతన సమాజం.

కోజెంట్రిక్స్ కంపెనీ మీదేశంలో పెట్టుబడులు పెడితే మాకు గ్యారంటీ ఏమిటి ? అని అడిగింది. కేంద్రప్రభుత్వం, అలాగే కర్నాటక ప్రభుత్వం 16 శాతం లాభాలకు పూచీపడతామని హామీ ఇచ్చాయి. పెట్టుబడులు ఎప్పుడూ లాభాలనే కోరతాయి. కనుక ఆ కంపెనీ ఏంచేస్తుంది ? పెట్టిన పెట్టుబడులను పెంచి చూపిస్తుంది. ఎందుకు ? లాభాలను ఎక్కువగా రాబట్టుకొనేందుకు. కోజెంట్రిక్స్ కంపెనీ అదే పనిచేసింది. కంపెనీ పెట్టుబడులనుంచి చూపిస్తున్నదని ప్రభుత్వం సుప్రీంకోర్టులో దావా వేసింది. తీర్పు వ్యతిరేకముగా వస్తే పెట్టుబడులు ఉపసంహరించుకొంటానని కంపెనీ బెదిరించింది. సుప్రీంకోర్టు కంపెనీకి అనుకూలంగా తీర్పుచెప్పింది. ఈ ఉదాహరణతో మన సామాజిక రాజకీయ పౌరహక్కులన్నింటిని బహుళజాతి కంపెనీల ముందు మోకరిల్లజేయవల్సిన పరిస్థితులలో మనం బ్రతుకుతున్నాం.

ఈనాడుఆర్థిక స్వాతంత్ర్యాన్ని సాధించకొనడం కాదు. మన నాయకులు పోరాడి సాధించిన రాజకీయ స్వాతంత్ర్యాన్ని కూడా నిలబెట్టుకోలేని దయనీయమైన స్థితిలో మనం జీవనం సాగిస్తున్నాం. మన రాజకీయ వ్యవస్థలను కూడా అవి నియంత్రణ చేసే ప్రయత్నాలు చేస్తున్నాయి.బి.జె.పి. ప్రభుత్వం పడిపోయినప్పుడు వామ పక్షాల భాగస్వామ్యంలో ప్రభుత్వం ఏర్పడుతుందని ఆందోళన చెందిన బహుళజాతి సంస్థలు అలాంటి ప్రభుత్వం రాకుండా అడ్డుకొన్నాయి. మన ఆర్థిక స్వాతంత్ర్యాన్ని హరించిన తరువాత రాజకీయహక్కులు కూడా నిలబెట్టుకోలేని పరిస్థితి వస్తుంది.

సమాచార సాంకేతిక విప్లవంతో అంతా బాగుపడుతుందని కొందరు ఆశించవచ్చు. అమెరికాలోని ఒక పౌరుడు ఒక నెల జీతంతో కంప్యూటర్ కొనవచ్చు.కాని మన పొరుగునవున్న బంగ్లాదేశ్ పౌరుడు 8 సం॥లు జీతంతో గాని ఒక కంప్యూటర్ కొనలేడు. ఇంటర్ నెట్ యుగంలో మనం జీవిస్తున్నాం. ఇదొక అద్భుతమైన ప్రపంచం అనవచ్చు. కాదనడం లేదు. ఇంటర్‌నెట్ వినియోగదారులలో కూడ 50 శాతం మంది ఉత్తర అమెరికా ఖండంలోనే వున్నారు. 20 శాతంగా వున్న దక్షిణ ఆసియాలో 1% మంది మాత్రమే కంప్యూటర్ వాడకం దారులు వున్నారు. రాబోయే కాలంలో కూడా తృతీయ ప్రపంచదేశాలు వెనుకబడివుంటాయనడానికి ఇదొక ఉదాహరణ మాత్రమే.

స్వేచ్ఛగా పెట్టుబడులు ప్రవహించడంవలన ప్రపంచం అభివృద్ధి చెందుతుంది అంటున్నారు. ఇదివాస్తవమా ? ఇప్పటికీ ప్రపంచమార్కెటులో 10 గుత్త సంస్థలదే ఆధిపత్యం. అంటే గుత్త పెట్టుబడిదారీ బహుళజాతి సంస్థలు ప్రపంచమార్కెటుపై సంపూర్ణ ఆధిపత్యాన్ని కలిగి ఉన్నాయని ఐక్యరాజ్యసమితి అభివృద్ధిమండలి తన మానవాభివృద్ధి నివేదికలో పేర్కొన్నది.

ఈనాడు ప్రపంచంలో రెండు కీలకమైన రంగాలు వున్నాయి. బయోటెక్నాలజీ, సమాచార ప్రసారటెక్నాలజీ. ఈ రెండు రంగాలు భవిష్యత్ ప్రపంచాన్ని నడిపించే రంగాలు. ప్రపంచ విత్తనాల మార్కెటులో 33 శాతం, ఔషధాల మార్కెటులో 35 శాతం మార్కెటులో 70 శాతం టెలికమ్యూనికేషన్స్ మార్కెటులో 86 శాతం, పురుగుమందుల మార్కెటు 85 శాతం, అడ్వర్టైజ్‌మెంట్సు మార్కెటులో 89 శాతం కేవలం 10 గుత్త సంస్థల చేతుల్లోనే వున్నాయి.

కాని మన కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు ఏంచెపుతున్నాయి.? విదేశీపెట్టుబడులు స్వేచ్ఛగా ప్రవహించడం వలన నూతన ప్రపంచంలో పోటీ పెరుగుతుంది. సామర్థ్యం పెరుగుతుంది. సామర్థ్యంతో సంపద పెరుగుతుంది. ప్రజలు సుఖసంతోషాలతో బతుకుతారని చెపుతున్నాయి. మనం విదేశీపెట్టుబడులకు వ్యతిరేకం కాదు. అప్పులు తెచ్చుకొనడానికీ వ్యతిరేకం కాదు. కాని అప్పు తెచ్చుకొన్న డబ్బుతో ఏంచేస్తాం అనే దానిపై అప్పు మంచిదా కాదా అనేది ఆధార పడివుంటుంది.

అప్పు తెచ్చుకొన్న డబ్బుని పెట్టుబడిగా పెట్టి వ్యవసాయం చేసి పంటలు పండిస్తే మంచిదే. కాని అప్పుతెచ్చుకొన్న డబ్బుతో బ్యాంకాక్, సింగపూర్‌లు తిరిగివచ్చామనుకొండి .అప్పు నిన్ను దివాలా తీయిస్తుంది. నీ దగ్గర 8 లక్షలు వుంటే మరి రెండు లక్షలు అప్పుచేసి ఇల్లు కట్టుకోవచ్చు నీకు ఇల్లు అమరుతుంది. కాని నీదగ్గర రెండు లక్షలే వుంటే 8 లక్షలు అప్పుతీసుకొని ఇల్లుకడితే అప్పులు తీరక ఇంటిని అమ్ముకోవలసివస్తుంది. విదేశీపెట్టుబడులను చైనా, బెంగాల్ ఆహ్వానిస్తున్నాయి. మన రాష్ట్రంలో అభ్యంతరమేమిటి ? అని అడుగుతుంటారు. 8 లక్షలు వుండి 2 లక్షలు అప్పుచేసే పరిస్థితి చైనాది. ఆంధ్రప్రదేశ్‌లో ఖర్చుపెడుతున్న డబ్బులో 90 శాతం విదేశాలనుండి తీసుకొన్న అప్పుల నుండేనని ప్రణాళికా సంఘం ఛైర్మన్ చెప్పారు. విదేశీ పెట్టుబడులు తప్పుకాదు. కాని విదేశీపెట్టుబడుల ద్వారానే అభివృద్ధిని నిర్ణయిస్తామనే విషసంస్కృతిని ప్రవేశపెడుతున్నాయి. పాలక వర్గాలు. అభివృద్ధిని గురించి కూడా పాలకవర్గాలు తప్పుడు నిర్వచనాలు యిస్తున్నారు. విదేశీపెట్టుబడులు ఎన్నివచ్చాయి ?మన జి.డి.పి. ఎంత వుంది ? ఎగుమతులు ఎంతపెరిగాయి ? అనేవి అభివృద్ధికి గీటురాళ్ళుగా చూపెడుతున్నారు. ఒక సాధారణమైన సగటుమనిషి దగ్గరికి వెళ్లి 8800 కోట్లు విదేశీ డబ్బుని తెచ్చుకొన్నామని చెప్పు. దీనితో నాకు ఒరిగేది ఏంటి ? అంటాడు సామాన్యమానవుడి జీవనవిధానంలో మార్పు తెచ్చేది అభివృద్ధి అవుతుంది.

ప్రపంచంలో చాలా దేశాలకంటె చాలా అంశాలలో మనం వెనుకబడివున్నాం. మనం 52 శాతం అక్షరాస్యత సాధించాం. చైనాలో అక్షరాస్యతా శాతం 82, మయన్మార్‌లో 82 శాతం ఉగాండాలో 62 శాతం, మన రాష్ట్రం అద్భుతాలు సాధిస్తుందని ప్రచారాలు జోరుగా సాగుతున్నాయి. ప్రచారాలనలా వుంచి వాస్తవం యేమిటి ? దక్షిణ భారతదేశంలో అట్టడుగున పడివున్న రాష్ట్రంమనది.

ఈనాడు కేంద్ర రాష్ట్రప్రభుత్వాలు అభివృద్ధిని గణాంకాలలో చూపిస్తున్నాయి. ఇన్సూరెన్సు రంగంతో సహా అన్ని రంగాలలోకి విదేశీ పెట్టుబడులను ఆహ్వానిస్తున్నాం. ఇప్పటివరకు సాధారణ పౌరుల నుండి సేకరించినడబ్బును దేశ అభివృద్ధి కార్యక్రమాలకు వినియోగిస్తుందని మనందరికి తెలుసు. ఇప్పటివరకు జీవిత భీమా పాలసీ తీసుకొన్న కుటుంబానికి రక్షణ వున్నది. పాలసీ దారుడు మరణిస్తే అతడి కుటుంబానికి డబ్బు వస్తుందా ? రాదా ? అనే సందేహాలు ఎవరికీలేవు. బహుళజాతి సంస్థలు ఈ రంగంలో ప్రవేశిస్తే జరిగేదేమిటి ? ఏం జరుగుతుందో భోపాల్ గ్యాస్ బాధితుల ఉదంతం మనకు చెపుతున్నది.

ఈనాడు గ్లోబలైజేషన్, లిబరలైజేషన్, ప్రైవేటైజేషన్ అనే అందమైన పదజాలం ముసుగులో సామ్రాజ్యవాదం దోపిడి సాగిస్తున్నది. సామ్రాజ్యవాదం పెట్టుబడులపైన, సహజ వనరులపైన, శాస్త్రసాంకేతిక రంగాలపైన, మారణాయుధాలపైన, సంస్కృతిపైన ఆధిపత్యం సాధించి దోపిడిని సరికొత్త రూపంలో సాగిస్తున్నారు. వీటన్నింటిలో చివరిది అంటే సంస్కృతిపై ఆధిపత్యం మరీ ప్రమాదకరమైనది.

సంస్కృతిపై సాధించబడే ఆధిపత్యం ప్రజలు ప్రతిఘటించకుండా సామ్రాజ్యవాదానికది లొంగిపోయేలా చేస్తుంది.

ఉపాధ్యాయులు విజ్ఞాన సమాజ దిక్సూచీలు. దేశ భవితకు వెలుగుబాటలు దిద్దవలసిన బుద్ధిజీవులు. తమ మేధాసంపత్తిని సమాజాభివృద్ధికి వినియోగించాలి. ప్రజల సమస్యలకు స్పందించాలి. దేశంలోని అత్యధిక ప్రజల పక్షాన నిలిచి దేశస్వాతంత్ర్య, సార్వభౌమాధికార పరిరక్షణకొరకు అంకితం కావాలి.



# సమాజం - శ్రామికమహిళలు

శ్రీమతి ఎస్. సోనియాగుప్త

ఈనాడు మహిళలు శారీరక, మానసిక శ్రమచేస్తూ పలురంగాలలో పనిచేస్తున్నారు. ఆయా రంగాలలో పనిచేసే మహిళలు సమస్యల పట్ల ప్రత్యేకమైన దృష్టిసారించవలసిన అవసరం వున్నది. దీనిలో రెండు అంశాలు వున్నాయి. ఒకటి స్త్రీలు ఉత్పత్తిరంగంలో ప్రధానపాత్ర నిర్వహిస్తున్నారు. నాట్లు, కలుపులు, కోతలు, లాంటి వ్యవసాయపు పనులలోను, భవననిర్మాణపు పనులలో యింకా శారీరక శ్రమ అవసరమయ్యే పలురంగాలలో మహిళల భాగస్వామ్యాన్ని మనం అనుదినం చూస్తున్నాం. అలాగే ఉపాధ్యాయినులుగా గుమస్తాలుగా ఆఫీసర్లుగా వివిధ సేవారంగాలలో ఉద్యోగాలు చేస్తున్నారు.

ఉద్యోగాలు చేసేవారిని ఎందుకు ఉద్యోగం చేస్తున్నావు ? అని అడిగితే వచ్చే జవాబులు పలురకాలుగా వుంటున్నాయి. 20 సం॥ల క్రితం పెళ్లి చూపుల సందర్భంగా అమ్మాయిని చదువుకొందా ? ఉద్యోగం చేస్తుందా ? అని అడిగేవారు 'అవును' అని జవాబువస్తే పెళ్లి తరువాత ఉద్యోగం చేయకూడదనే షరతుపెట్టేవారు. కాని ఈనాడు చదువుకొని ఉద్యోగాలు చేసే అమ్మాయిలు కావాలంటున్నారు. ఎందుకు ? అలాంటి వారు కుటుంబానికి అదనపు ఆదాయాన్ని తెచ్చిపెట్టగలరు గనుక. పనిచేసే మహిళని అదనంగా ఆదాయం తెచ్చిపెట్టే వనరుగా చూస్తున్నారు.

మహిళల సంపాదనని కొందరు వేన్నీళ్లకు చన్నీళ్లతోడులాగా చూస్తారు. ఈనాటి మధ్యతరగతి కుటుంబాలలోని టి.విలు, వాషింగ్‌మెషీన్లు - వీటిలో అత్యధికం కట్నాల రూపంలో వస్తుంటాయి. కాని వినిమయ సంస్కృతి పెరుగుతున్న రోజులలో అనుదినం పెరుగుతున్న అవసరాలు ఎక్కడ నుండి సమకూడతాయి ? మహిళలు ఉద్యోగాలు చేసి తెచ్చేడబ్బును వినిమయ వస్తువులు సమకూర్చుకొనడానికి అవసరమైన వనరుగా భావిస్తున్నారు. ఎందుకు పనిచేస్తున్నారు. ? అని అడిగితే స్త్రీలు తాము చదువుకొన్న చదువుని సార్ధకం చేసుకొనేందుకు అని జవాబు చెపుతుంటారు.

1970 నుండి ఉన్నత విద్యలో దళితులు, మహిళలు పెద్ద సంఖ్యలో ముందుకి వస్తున్నారు. గతలో చదువుకొన్న అమ్మాయిని చేసుకోవాలనే ఆకాంక్ష పురుషులకు వుండడంతో అమ్మాయిలు చదువుకొన్నారు. కాని ఈ నాటి పరిస్థితి అదికాదు. పైచదువులు చదవడం కేవలం డిగ్రీల కొరకే గాక పనిచేయడానికి కూడా వేన్నీళ్లకి చన్నీళ్ల తోడుని కాదనలేం గాని అదే సమయంలో స్త్రీలు వారి చదువు ఉపయోగపడాలని కోరుకుంటున్నారు. అంతేగాక ఇంటికే పరిమితం చేయబడిన స్త్రీకి కొన్ని గంటల పాటైన బయటి ప్రపంచంలోకి వెళ్లాలని పిస్తుంది. ఏమైనా స్త్రీలు కుటుంబపరిమితుల్నిదాటి బాహ్య ప్రపంచంలోకి రావడం ఆహ్వానించదగిన పరిణామం.

ఉద్యోగాలు చేస్తున్న మహిళలకు రెండు షిఫ్టులు వుంటాయి. ఒకటి ఇంటివద్ద. రెండవది ఆఫీసులో కాని శారీరక శ్రమ చేస్తున్న మహిళలకు మూడు షిఫ్టులు వుంటాయి. ఒకటి పనిమనిషి గా మరొకటి ఇళ్లలో పనిచేయడం పగలు భవన నిర్మాణపనులలో బొచ్చెలు రాళ్లుమోయడం, ఆ తరవాత తన ఇంటిపని. మహిళలు చేస్తున్న ఈ రెండు, మూడు షిఫ్టుల పనిని మనతో కలిసి పనిచేస్తున్న పురుషులు గుర్తించాలి. మహిళలు ఇంటిని వదలి బయటికి వచ్చి పనిచేస్తున్నారంటే పురుషులు బయటిపనితో పాటు ఇంటిపనిలో పాలుపంచుకోవలసివుంటుంది. ఇలా చేయడం స్త్రీలపై సానుభూతి ప్రకటించడం కాదు, బాధ్యతగా గుర్తించి చేయాలి. స్త్రీలు ఆఫీసు పనితోపాటు ఇంటిపనిని కూడ పరిగణనలోకి తీసుకొంటే రోజుకి 17 గంటలు పనిచేస్తున్నారు. ఇలా చేయడం వలన స్త్రీలు శారీరక మానసిక ఒత్తిడికి గురవుతున్నారు.

స్త్రీ చెల్లిగా తల్లిగా భార్యగా కుటుంబంలో నిర్దిష్టమైన బాధ్యతలు నిర్వర్తిస్తున్నది. ఈ భాధ్యతలు నిర్వర్తించేదిగానే స్త్రీని సమాజం గుర్తిస్తున్నది. కాని స్త్రీబాధ్యతలు వీటికే పరిమితమైలేవు. ఇటీవల ప్రబలిపోతున్న మత ఛాందసవాదంతో స్త్రీలపట్ల ఆలక్ష్యం, తిరస్కారం ఎక్కువయింది. 1996 దీపావళి సంచిక నుండి వరుసగా ఆరు వ్యాసాలు ఆర్గనైజర్ పత్రికలో వచ్చాయి. వాటిలో స్త్రీ ఇల్లువదిలి ఆరు బయట పనిచేయడం అస్వాభావికమైన చర్యగా పేర్కొనబడింది. భార్యగా, తల్లిగా కుటుంబ సంరక్షణ స్త్రీయొక్క ప్రధమ కర్తవ్యంగా నొక్కిచెప్పబడింది . ఆర్ధికపరిస్థితుల దృష్ట్యా అంటే కుటుంబ నిర్వహణకి అవసరమైన అదనపు అవసరాల రీత్యాబయట పనిచేయవలసి వచ్చినప్పటికీ కుటుంబబాధ్యతలు విస్మరించరాదు అన్నది. ఈనాడు ఎక్కడో కాదు, హైదరాబాద్‌ని అధునాతనం చేయడానికి జరుగుతున్న ఫ్లైఓవర్స్ నిర్మాణంలో కూలి పనిచేస్తున్న మహిళా కార్మికులు వారి పసికందులను మండుటెండలో క్రింద పడుకోబెట్టి పనులు చేస్తుంటారు. వారికి కనీసం ఏర్పాట్లు చేయబడుతున్నాయా ? స్త్రీల సహజస్థానం ఇల్లేనని వాదించేవారు స్త్రీలు మండుటెండలో చెమటోడ్చి పనిచేయనవసరంలేని పరిస్థితులు కల్పించగలరా ? వ్యవసాయరంగం, భవన నిర్మాణరంగం లాంటి అసంఘటితరంగాలలో పనిచేస్తున్న వారికి మెటర్నిటీ లీవ్ ఎక్కడిది ? 30-40 శాతం కుటుంబాలను స్త్రీలే

పోషిస్తున్నారనే సంగతి స్త్రీలు ఇంటికే పరిమితం కావాలని ఉద్బోధించేవారికి తెలియదా ? ఇళ్లలో పనిమనుషులుగా వచ్చేవారిని అడగండి. . వారిలో 80 శాతం కుటుంబ పోషణ బాధ్యతలు కూడా చేస్తున్నారు. వారి భర్తలు పనిచేస్తున్నప్పటికి వారి సంపాదన త్రాగాటానికో మరి ఏఇతర దుర్వ్యసనాలకో ఖర్చుపెడుతుంటారు. గ్రామీణ ప్రాంతాలలో 30 శాతం కుటుంబాల పోషణ స్త్రీల సంపాదన పైనే ఆధానపడివుంది. ఇక మధ్యతరగతికి చెందిన మహిళలు కుటుంబంపట్ల శ్రద్ధ చూపితే వారికి ఎంతసేపటికి ఇళ్లను గురించిన ఆలోచనలే గాని ఆఫీసు బాధ్యతలు పట్టవు అంటారు. ఆఫీసు పనులు సక్రమంగా నిర్వహిస్తుంటే ఉద్యోగపరంగా పైకి పోవాలని చూస్తున్నారే గాని కుటుంబ బాధ్యతలు పట్టించకోవడం లేదు అంటారు.

మహిళని మాతృదేవత మాతృశక్తి అనే ప్రతీకను ముందుకు తెస్తున్నారు. మాతృదేవత విస్తృతరూపమే భారతమాత. మత తత్వవాద దృష్టిలో భారతమాత అంటే హిందూమాత. భారతమాతకి యితరులు అంటే ముఖ్యంగా ముస్లిములు అపచారం చేస్తున్నారనే విషప్రచారాలతో మెజారిటినీ తమ వెనుక సమీకరించుకొనేందుకు తద్వారా అధికారాన్ని కైవసం చేసుకొనేందుకు మహిళయొక్క మాతృత్వ ప్రతీకను ఉపయోగించుకొంటున్నారు. కాబట్టి భారతదేశంలోని స్త్రీ హిందూమాత కావాలి. హిందూమాత నిర్వర్తించాల్సిన పాత్ర ఏమిటి ? హిందూమతోద్ధరణకు అవసరమైన కొడుకులను, కూతుళ్లని కనిపెంచాలి. ఇలాంటి ఉద్బోధల కారణంగానే బాబరీమసీదు విధ్వంసం తరువాత జరిగిన మత ఘర్షణలలో ఉత్తరప్రదేశ్ మధ్యప్రదేశ్‌లకి చెందిన మధ్యతరగతి మహిళలు కూడా గణనీయమైన సంఖ్యలో పాల్గొన్నారు. ఇలాంటి ధోరణులు శ్రామిక మహిళలలో విభేదాలను సృష్టిస్తాయి. శ్రామిక మహిళా ఉద్యమానికి నష్టం కలిగిస్తాయి.

మన ప్రాచీన గ్రంధాలు పురాణాలు శాస్త్రాలు, కూడా స్త్రీల ప్రజాస్వామ్య హక్కులను పరిమితం, చేయడానికే ఉపయోగింపబడుతున్నాయి. ఉదాహరణకు పురుషార్ధములైన. ధర్మార్ధకామమోక్షాలు పురుషులకే వర్తిస్తాయి. మహిళకు వర్తించే ధర్మం ఒక్కటున్నది. ఇది పతివ్రత ధర్మం. పురుషునికి అణిగిమణిగి వుండి అతడికి సేవలు చేయడం పతివ్రతా ధర్మం. స్త్రీ సామాజిక బాధ్యతలు చేపట్టకుండా అడ్డుకొనేందుకు వినయం, సౌశీల్యం, మితభాషణ వగైరాలు స్త్రీలకు ఆభరణాలని చెప్పబడింది. పురాణాలలో ఆదర్శ భారతనారి ఎలా వుండాలో కూడ చెప్పబడింది . తల్లిగా ప్రేమించి లాలించాలి. కూతురుగా విధేయతతో వుండాలి. చెల్లిగా మంచిని కోరాలి. నౌకరుగా భక్తి శ్రద్ధలతో సేవలు చేయాలి. రంభగా (వేశ్యగా) రతిక్రీడలతో సంతృప్తి పరచాలి. స్త్రీకి సంబంధించిన ఈ ప్రతీకల్ని పురాణాలకు పరిమితం చేయకుండా ఈనాటి సమాజానికి వర్తింపజేయాలని ప్రయత్నిస్తున్నారు.

స్త్రీకి అత్యాచారం మానభంగం జరిగితే పురుషప్రపంచం ఎలా స్పందిస్తుందో గమనించండి. పోలీసుల నిర్బంధంలో వుండగా మధురపై జరిగిన మానభంగం కేసువిచారణన్కు రాగా ఆమే శీలవతి కాదుగనుక ఆమెపై అత్యాచారం జరిపిన వారు నిర్దోషులని జడ్జీ తీర్పుచెప్పారు. " సతిపై దుష్ప్రచారం " అని దేవేంద్ర స్వరూప్ 'రూప్‌కన్వర్' సతి పై డిసెంబరు 15 న "పాంచజన్య"లో ఒక వ్యాసం వచ్చింది. భర్త చనిపోవడంతో 18 సం॥ల యువతి ఆత్మహత్యచేసుకొన్నది. భారతదేశంలో భార్యాభర్తల ఆదర్శానికి ఉదాహరణగా పేర్కొనబడింది.

1996 లో బెంగుళూరులో ' మిస్‌వరల్డ్ ' అందాలపోటీల నిర్వహణ సందర్భంగా మహిళా సంఘాలు స్త్రీ శరీరాన్ని మార్కెటు వస్తువుగా ప్రదర్శించడం పట్ల నిరసనను వ్యక్తం చేస్తూ ప్రదర్శనలు నిర్వహించాయి. ఇప్పుడే రూప్‌కన్వర్ కేసులోని నిందితులు నిర్దోషులుగా విడుదల చేయబడ్డారు. ఆతరువాత వేలకొలది మహిళల సమీకరణతో రాజస్తాన్‌లోని ఝుంఝుని జిల్లాలో సతీమాత ఉత్సవాలు ఘనంగా నిర్వహించబడ్డాయి. దాదాపు అప్పుడే ప్రపంచ సుందరులైన సుస్మితాసేన్, ఐశ్వర్యరాయ్‌ల అభినందన సభలతో బెంగుళూరులో వేడుకలు జరిగాయి. సాంప్రదాయాలను నిలబెట్టే సతిపూజలు ఆధునిక అందాలరాణులకు చేసే సన్మానాలు – రెండు కూడా స్త్రీల వ్యక్తిత్వాన్ని, వారి సామాజిక స్థితిని కించపరిచేవే.

ఈనాడు ఏ బ్యూటీక్రీం వాడాలో, ఏ టూత్‌పేస్టువాడాలో, ఏ సబ్బుకావాలో మధ్యతరగతి మహిళలకు చెప్పిస్తూ అందాలరాణులను వ్యాపారప్రకటనలకు మోడల్స్‌గా వాడుకొనడాన్ని చూస్తున్నాం. వారి ప్రకటనల మేరకు సబ్బులు, పేస్టులు వాడేవారు తెలివైన వారని, కాని వారు మందమతులనే విధంగా ప్రకటనలు వెలువడుతున్నాయి. రౌడీలతో గూండాలతో అందరితో ఒంటరిపోరాటాలు చేసి శాంతి భద్రతలను పరిరక్షిస్తున్న పోలీసు డ్రెస్సుల హీరోయిన్ల సినిమాలు వస్తున్నాయి.. స్త్రీకి సమాజంలో సముచిత స్థానం కల్పించబడిందనే భ్రమలు ఇలాంటి సినిమాలు కల్పిస్తుంటాయి. వీటితో మరొక రకమైన ప్రమాదం వుంది. ఏమైనా సాధించేందుకు ఈనాడు మనం చాలా సంక్లిష్టమైన స్థితిలో వున్నాం. ఒకవైపు సాంప్రదాయ శృంఖాలలో బంధింపబడిన స్త్రీ, మరకవైపు ఒంటరి పోరాటాలు చేస్తూ దేనినైనా సాధించగల దుస్సాహసిక స్త్రీ. ఈ రెండు ప్రతీకలు ఒకదానికొకటి ప్రత్యామ్నాయంగా చూపబడుతున్నాయి. కాని ఈ రెండు ధోరణులు కూడా మహిళాభ్యదయాన్ని కించపరిచేవే. సమాజంలోనే గాక శ్రామికశక్తిలో కూడ సగభాగంగావున్న మహిళలు సమాజంలోని అన్నిరంగాలలో సమానహక్కుల కొరకు పోరాడాలి. అందుకు తోడ్పడే శక్తుల చేయూత అందుకోవాలి. అడ్డుకొనే శక్తులను తిరస్కరించాలి.



# నేటి విద్యారంగం - యు.టి.యఫ్. వైఖరి

శ్రీ వి. బాలసుబ్రహ్మణ్యం
యు.టి.ఎఫ్. నాయకులు

ప్రాచీనకాలంలో ఒక తరం నుండి మరొక తరానికి ఆహారం యితర నిత్యజీవితావసర వస్తువుల ఉత్పత్తికి సంబంధించిన నిపుణతలను అందజేయడం విద్యగా పరిగణింపబడేది. ప్రజలు కేవలం బిడ్డల్ని కంటే సరిపోదు. నిత్యజీవితావసర వస్తువుల ఉత్పత్తి కార్యక్రమంలో సమర్ధవంతంగా పాల్గొనేందుకు వారిని సన్నద్ధుల్ని చేయాలి. ఈ పని విద్యావ్యవస్థ చేస్తుంది. ఉత్పత్తి చేయబడిన వస్తువుల వినియోగింపబడతాయి. కాబట్టి పునరుత్పత్తి నిరంతరాయంగా సాగించేందుకు అవసరమైన యంత్రాంగాన్ని నిరంతరం కొనసాగించేది విద్యారంగం.

పరిణామ క్రమంలో సామాజిక అభివృద్ధి, జనాభా పెరుగుదల , వారి అవసరాలు ఉత్పత్తి పెరగడానికి, శ్రమవిభజనకి దారితీశాయి. సమాజం యెక్క అవసరాలకు మించి ఉత్పత్తి సాధ్యపడిన దశలో అత్యధికులు శారీరక శ్రమ చేయడం , అతికొద్ది మంది వారిచేత శ్రమ చేయించడం అనే స్థితి వచ్చింది.శారీరక, మానసిక శ్రమలుగా శ్రమ విభజన ఏర్పడింది. అంటే పాలిత, పాలకవర్గాలు ఏర్పడ్డాయి. పాలితులను పాలకుల అదుపు ఆజ్ఞలలో వుంచుకొనే విధానాలు వ్యూహాలు అభివృద్ధి చెందాయి. భాష, లిపి అభివృద్ధిచెందాయి. ఈ దశలో చదువు యెుక్క అర్థం మారిపోయింది. పాలకుల నిర్వహణా పద్ధతులే చదువుగా గర్తింపు పొందింది. ఇలాంటి చదువు పెట్టుబడిదారీ విధానానికి ముందుగల సమాజాలన్నింటిలో పాలకవర్గాలకే పరిమితమయింది. శ్రామిక వర్గాలకు తిరస్కరింపబడింది.

పారిశ్రామిక విప్లవంతో ఉత్పత్తి పెరిగింది. యంత్రాల వద్ద పనిచేస్తూ సాధారణ కార్మికుల అవసరమే గాక నిపుణతగల కార్మికుల అవసరమూ పెరిగింది. నిపుణత గల కార్మికులను తయారుచేసుకొనడానికి విద్యావ్యాప్తి అవసరమయింది. ఫలితంగా ప్రభుత్వాలే విద్యావ్యాప్తికి నడుం బిగించాయి.

ఫ్యూడలిజానికి వ్యతిరేకంగా పోరాటం సాగించిన నాయకులు సాధారణ ప్రజానీకాన్ని తమ వైపుకి తిప్పుకొనేందుకు స్వేచ్ఛ, సమానత్వం, సౌభ్రాతృత్వం- లాంటి నినాదాలతో పాటు అందరికీ అన్నీ సమకూరుస్తామని వాగ్దానాలు చేశారు. ఫ్యూడలిజాన్ని కూల్చిన తరువాత ప్రజల చైతన్యం పెరగడంతో తమకుచేసిన వాగ్దానాలను నెరవేర్చమని డిమాండ్ చేసారు. తమకూచదువు కావాలన్నారు.

సాంకేతిక అభివృద్ధి , యుద్ధ పరికరాల పోటీ ఒకవైపు, విద్యని డిమాండ్ చేస్తూ కార్మికులు రైతులు చేసే పోరాటం మరొక వైపు ఒత్తిడి చేయడంతో కార్మికులకు ప్రాథమిక పరిజ్ఞానం కలుగజేయడం అనివార్యంఅయ్యింది."పెట్టుబడిదారులు శ్రామికులకు రాజకీయ సాధారణ విద్యకి సంబందించిన ప్రాథమిక పాఠాలు నేర్పుతారు. మరొక విధంగా చెప్పాలంటే ఏ ఆయుధాలతో వారు తమతో పోరాడాలో ఆ ఆయుధాలు సమకూర్చుతారు. పెట్టుబడిదారులు మొదట రాచరికానికి వ్యతిరేకంగా పోరాడేందుకు, ఆ తరువాత తమ పాలన పటిష్టం చేసుకొనేందుకు శ్రామికజనానికి విజ్ఞానాన్ని నిపుణతలను అందజేస్తారు. ఆ విజ్ఞానం నిపుణతలు పెట్టుబడిదారీ వర్గ పాలనకు వ్యతిరేకంగా సంఘటితపడే కార్మికవర్గం చేతుల్లో ఆయుధాలుగా ఉపయోగపడతాయి. కాబట్టి పెట్టుబడిదారీ విధానంలో విద్య ప్రాథమిక వైరుధ్యాన్ని అంటే ఉత్పత్తిలో సామాజికం వినియోగంలో వ్యక్తిగత స్వభావాన్ని సంతరించుకొంటుంది.".

## వలస పాలకుల కాలంలో విద్య

ఇంగ్లీషు చదువు బ్రిటిషు వారిని విదేశీయులుగా పరిగణించకుండా చేస్తుందని, క్రిందిస్థాయి ఉద్యోగాలలో తక్కువ జీతాలతో నియమించుకోవచ్చునని ఆశించి వలసపాలకులు భారతదేశంలో ఇంగ్లీషు చదువుని ప్రవేశపెట్టారు. ఇంగ్లీషు చదువు ద్వారా ఆధునిక పాశ్చాత్య విజ్ఞానం అందుబాటులోకి వస్తుందని రాజా రాంమోహనరాయ్ లాంటి సంఘ సంస్కర్తలు ఇంగ్లీషు చదువుని ఆహ్వానించారు.

అప్పటివరకు అధికార భాషగా, కోర్టు భాషగా వున్న పర్షియన్ భాష స్థానంలో 1837 లో ఇంగ్లీషు ప్రవేశపెట్టబడింది. 1844 లో ఇంగ్లీషు చదువుకొన్న భారతీయులకు సివిల్ సర్వీసుల ఉద్యోగాలలో ప్రాధాన్యత యివ్వబడుతుందని హార్డింగ్ ప్రకటించాడు. 1857లో మద్రాను, బొంబాయి, కలకత్తా యూనివర్శిటీలు ప్రారంభించబడ్డాయి. 1902 నాటికి 5803 విద్యార్థులతో 53 కాలేజీలు, 1200 కిపైగా సెకండరీ పాఠశాలలు నెలకొల్పబడ్డాయి. భారతీయుల యాజమాన్యంలో అన్ఎయిడెడ్ సెకండరీ పాఠశాలలు, కళాశాలలు గణనీయంగా పెరిగాయి.

భారత జాతీయ కాంగ్రెస్ స్థాపన, వలసపాలన యెడల పెరుగుతున్న అసంతృప్తి, ఇంగ్లీషు చదువుతో కలిగిన ప్రాపంచిక జ్ఞానం, చైతన్యం బ్రిటిషు పాలన పట్ల వ్యతిరేకతను పెంచాయి. జాతీయ భావాలకు ఇంగ్లీషు చదువుకి మధ్యగల ప్రత్యక్ష సంబంధం బ్రిటీషు పాలకులు గుర్తించారు. విద్యావ్యాప్తి అరికట్టేందుకు నియమించబడిన రేలీ కమీషన్ "వాసి రాశి"నినాదాన్ని ముందుకు

తెచ్చింది. " ఎక్కువమందికి అరకొర చదువులకు అవకాశం కల్పించడానికి మారుగా కొద్దిమందికి స్థాయిగల చదువు చెప్పించడం అవసరం" అని సిఫార్సు చేసింది.

విద్యని అదుపుచేసే బ్రిటిషు పాలకుల ప్రయత్నాలను జాతీయోద్యమ నాయకులు వ్యతిరేకించారు. చట్టసభల లోపల: వెలుపల దుయ్యబట్టారు. కాంగ్రెస్ జాతీయ సదస్సులో ఖండన తీర్మానాలు చేశారు. నిర్బంధ ఉచిత ప్రాథమిక విద్యపై బిల్లును నాటి సెంట్రల్ అసెంబ్లీలో 1917 లో ప్రవేశపెట్టేందుకు గోఖలే విఫల ప్రయత్నం చేశారు.

స్వతంత్ర భారతదేశంలో పెట్టుబడిదారీ విధానం అభివృద్ధి చెందేందుకు శాస్త్ర సాంకేతిక పరిజ్ఞానం గల నిపుణుల ఆవశ్యకతను గుర్తించారు దేశీయ పెట్టుబడిదారులు. అలాంటి నిపుణులను తయారు చేసుకొనేందుకు1909లో బెంగుళూరులో, ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్‌సైన్సెస్‌ను స్థాపించారు. 1904లో విక్టోరియా జూబిలీ టెక్నికల్ స్కూల్‌ను స్థాపించారు. 1907 లో జబల్‌పూర్‌లో ఇంజనీరింగ్ కాలేజీ ప్రారంభించారు.

విద్యని పరిమితం చేయాలని, రాజకీయాలలో విద్యార్థులు పాల్గొనకుండా ఆంక్షలు విధించాలని బ్రిటిషు పాలకులు ప్రయత్నించారు. అదే సమయంలో ఉన్నతవిద్య జాతీయోద్యమాన్ని బలపరుస్తుందని, స్వతంత్ర భారతదేశంలో పెట్టుబడిదారీ విధానంఅభివృద్ధి చెందేందుకు కావలసిన మానవ వనరులను సమకూరుస్తుందని భారతీయ పెట్టుబడిదారులు విద్యావ్యాప్తికి కృషి చేశారు.

## స్వతంత్ర భారతదేశంలో విద్య

దేశానికి స్వతంత్రం వచ్చింది. స్వతంత్ర భారతదేశంలో విద్య, వైద్యం యితర ప్రాథమిక సౌకర్యాలు అన్నీ అందరికీ అందుబాటులోకి వస్తాయని ప్రజలు ఆశించారు. విద్యాలయాలు ఆధునిక దేవాలయాలు అన్నాడు స్వతంత్ర భారత తొలి ప్రధాని నెహ్రూ, ప్రజల ఆశలు ఆకాంక్షలూ నిజంచేసే విధంగా విద్యావిధాన రూపకల్పన చేసేందుకు రాధాకృష్ణన్ కమీషన్, మొదలియార్ కమీషన్ నియమించబడ్డాయి. " రాజ్యాంగంలో పేర్కొనబడిన ప్రజాస్వామ్యం , న్యాయం, స్వేచ్ఛ, సమానత్వం, సౌభ్రాతృత్వం - అనే ఐదు అంశాలు దృష్టిలో పెట్టుకొని ఉన్నత విద్యను పునర్విచించాలని రాధాకృష్ణన్ కమీషన్ రిపోర్టు పేర్కొన్నది. " ఈ సిఫార్సులను అమలుపరచాలంటే అదనంగా చాలా ఖర్చవుతుంది. అదనపు ఖర్చు స్వతంత్రం పొందిన ప్రజల యొక్కప్రజాస్వామ్య భవిష్యత్తు కొరకు పెట్టే ఖర్చు కనుక యూనివర్శిటీల అవసరాలను తీర్చేందుకు బడ్జెటులో 10% నిదులు విద్యకి కేటాయించాలి" అని సిఫార్సు చేసింది.

మొదలియార్ కమీషన్ తన రిపోర్టులో విద్యయొక్క అన్ని స్థాయిలలో సాంకేతిక నిపుణత సామర్థ్యాన్ని ప్రోత్సహించాలని అన్నది. అందుకనుగుణంగా సాంకేతిక పాఠశాలలను, పాలిటెక్నిక్ విద్యాసంస్థలను బహుళార్థ సాధక విద్యాసంస్థలను, కేంద్రీయ సాంకేతిక విద్యాసంస్థను ప్రారంభించాలని కమిటీ సిఫార్సు చేసింది. పెద్దసంఖ్యలో సాంకేతిక పనివాళ్లను తయారుచేసేందుకు విద్యాసంస్థలను ప్రారంభించాలని సిఫార్సు చేసింది. ఈ పథకాలను విజయవంతం చేసేందుకు తగిన నిధులను ప్రభుత్వం సమకూర్చాలని విజ్ఞప్తి చేసింది. జాతీయ పరిశ్రమలు, రైల్వే, తంతి తపాలా, ప్రసారశాఖల ఆదాయాల నుండి కొంతశాతం పన్ను వసూలు చేసి కొన్ని రంగాలలో సాంకేతిక విద్యాభివృద్ధికి వెచ్చించాలని సూచించింది.

అలాగే కొఠారి కమీషన్ తన రిపోర్టులో విద్యని సమాజం నుండి విడగొట్టి శూన్యంలో పథకాలను రూపొందించడం వలన అభివృద్ధి చెందదని, దేశాభ్యున్నతి సమాజం అందించగలిగే విద్యాస్థాయిపై అధారపడి వుంటుందనీ దేశాభివృద్ధి 1) ఆహార ఉత్పత్తిలో స్వయంసమృద్ధి, 2) ఆర్థికాభివృద్ధి - అందరికీ ఉపాధి, 3) జాతీయ ఐక్యత సాధించడం ద్వారా మాత్రమే సాధింపబడుతుందని పేర్కొన్నది. అంతేగాక ప్రస్తుత విద్యసంపన్నుల - పేదల మధ్య, పట్టణ - గ్రామీణ ప్రజల మధ్య, విద్యావంతుల - నిరక్షరాస్యుల మధ్య దూరాన్ని పెంచుతుందనీ, ఈ అంతరాలను తగ్గించే విధంగా విద్యా విధానం వుండాలని, రాజకీయంగా విద్య మన ప్రజాస్వామ్యాన్ని పటిష్ఠ పరిచేదిగా వుండాలని, దేశ స్వాతంత్ర్యాన్ని కాపాడుకొనగలిగేదిగా వుండాలని, శతాబ్దాలుగా అణగార్చబడిన ప్రజానీకం ఈనాడు చైతన్యవంతులై విద్య, సమానత్వం మెరుగైన జీవన పరిస్థితుల కొరకు చేస్తున్న డిమాండ్స్‌ను తీర్చగలిగే విధంగా మన విద్యావిధానం ఆర్థిక కార్యక్రమాలు రూపొందింవబడాలని పేర్కొన్నది. అందుకు జాతీయ స్థూలాదాయంలో కనీసం 6 శాతం కేటాయంచాలని సిఫార్సు చేసింది.

కాని పాలకవర్గాలు విద్యకి మొదటి పంచవర్ష ప్రణాళికలో 7.86 శాతం, రెండవ ప్రణాళికలో 5.83 శాతం నాల్గవ ప్రణాళికలో 4.9 శాతం, 5వ ప్రణాళికలో 3.3 శాతం, 6వ ప్రణాళికలో 2.2 శాతం, 7వ ప్రణాళికలో 2.5 శాతం కేటాయించాయి. విద్యకి నిధులు అరకొరగా కేటాయింపబడడంతో సిఫార్సులు సిఫార్సులుగానే మిగిలిపోయాయి. లక్ష్యాలు లక్ష్యాలుగానే వుంటూ వచ్చాయి.కలలు కలలుగానే మిగిలిపోయాయి. ఎండమావుల వెంట పరుగులు తీయడంలా వుంది మన పరిస్థితి .

## మన అక్షరాస్యతా ప్రగతి

| సంవత్సరం | అక్షరాస్యతా శాతం |
|---|---|
| 1881 | 6.3 |
| 1911 | 7.3 |
| 1931 | 9.3 |
| 1951 | 18.3 |
| 1961 | 28.3 |
| 1971 | 34.5 |
| 1981 | 43.7 |
| 1991 | 52.2 |

(1981-31 మధ్య 10 సం॥పై బడ్డ వారిది 1951-71 మధ్య 5సం॥లపై బడ్డ వారిది. 1981-91 7 సం॥ల పైబడ్డ వారిది)

## ఎందుకీ వైఫల్యం

భూస్వామ్య విధానంతో రాజీపడి అధికారాన్ని పంచుకొన్న భారతదేశ పెట్టుబడిదారులు వారి ప్రతినిధులు భూస్వామ్య అవశేషాలను తొలగించలేకపోయారు. భూస్వామ్యపెత్తందారీ విధానం కారణంగా కులవ్యవస్థ బలంగా వేళ్లూనుకొని వున్నది. పంచాయితీరాజ్ వ్యవస్థలోని గ్రామ సర్పంచ్‌లు, గ్రామ అధికారులు భూస్వాముల చేతుల్లోనే వున్నారు. భూస్వాములతో రాజీపడిన పాలకవర్గాలు భూసంస్కరణలను అమలుచేయలేకపోయారు. ఫలితంగా సంపన్నులు - పేదల మధ్య, విద్యావంతులు - నిరక్షరాస్యుల మధ్య సాంస్కృతికంగా దూరం పెరిగిపోతున్నది. ఒకవైపు పెట్టుబడిదారీ విధానం అభివృద్ధికి మూడవ పంచవర్ష ప్రణాళికలో భారీ పెట్టుబడులు పెట్టినప్పటికి ప్రజల కొనుగోలు శక్తి పెంచలేకపోవడం వలన అభివృద్ధి కుంటుబడింది. మరొకవైపు ప్రభుత్వాలు విద్యకొరకు గ్రామీణ పేదలకు అందజేసే అరకొర సౌకర్యాలను కూడా వారు అందుకోలేకపోతున్నారు. భారత రాజకీయాలు సమాజంపై విస్తృత అధ్యయనం చేసిన మైరన్ వైనర్ మన వైఫల్యాలకు కారణాలేమంటున్నాడో చూడండి.

"ఉద్ఘాటనలు ఎలా వున్నా భారతదేశ ఆధునీకరణకు ప్రజల అక్షరాస్యత పెరగడం అత్యవసరమని దేశ విధాన నిర్ణేతలు భావించడం లేదు. వారు దేశ వనరులను ప్రజలందరి విద్యాభివృద్ధి కోసం కాకుండా ఉన్నతవర్గాల పిల్లలు చదివే ప్రభుత్వ పాఠశాలలకు, ప్రభుత్వ సాయంతో నడిపే ప్రైవేటు పాఠశాలలకు, ఉన్నత విద్యా కోర్సులకు మొదలైన వాటికి మాత్రమే కేటాయించారు. ఇది పశ్చిమ దేశాలలోని విద్యావంతుల వర్గాలకు సమానంగా తమ దేశంలో ఒక విద్యావంతుల వర్గాన్ని తయారుచేసేప్రయత్నం. ఈ వర్గం ఆధునిక అస్వతంత్ర ఆర్థిక వ్యవస్థను సృష్టించి దానిని నిర్వహించగలదు.

బుద్ధి నుపయోగించి పనిచేస్తూ పాలించే వారికీ, చేతులతో పనిచేస్తూ పాలింపబడే వారికీ మధ్య ఒక విభజన రేఖ వుందనీ, ఈ విభజనను విద్యమరింత పటిష్టం చెయ్యాలిగానీ విచ్ఛినం చెయ్యరాదనే దృఢమైన నమ్మకాలపై భారతీయ దృక్పథం ఆధారపడి వుంది ఈ నమ్మకాలు మత పరమైన భావాలతోను, కులవ్యవస్థకు ఆధారమైన పూర్వ సిద్ధాంతాలతోను గుడ్డిగా ముడివడి వున్నాయి.".

## విద్య - పాలకవర్గాలు

విద్యస్వరూప స్వభావాలను ఎప్పుడూ పాలకవర్గ ప్రయోజనాలే నిర్ణయిస్తాయి. బ్రిటిషు పాలకులు వారి పాలనా ప్రయోజనాల సంరక్షణ కొరకే ఇంగ్లీషు చదువుని ప్రవేశపెట్టారు. ఇంగ్లీషు చదువు వలన భారతీయులు తమను విదేశీయులు పాలిస్తున్నారనే భావం వారిలో కొంతవరకు తగ్గించవచ్చు. పాలనా యంత్రాంగానికి అవసరమైన ఉద్యోగులను తయారుచేసుకోవచ్చు. బ్రిటిషు అభిరుచులు విలువలు ప్రవేశపెట్టడం ద్వారా బ్రిటన్ వస్తువులకు ఇండియాను మార్కెటుగా మార్చవచ్చు.

తరువాత 5 దశాబ్దాలలో త్వరత్వరగా విద్యాసంస్థలు విస్తరించాయి. విద్యతో జాతీయభావాలు విస్తరించాయి. కాబట్టి విద్యావ్యాప్తికి అడ్డుకట్టలు వేయడం ఆనాటి పాలకవర్గాలకు అవసరమయింది. అందుకు ప్రభుత్వం రేలీ కమీషన్‌ని నియమించింది. "విద్యలో కావలసింది రాసి కాదు వాసి" అన్నది రేలి కమీషన్. కమీషన్ సిఫార్సుల మేరకు విద్యావ్యాప్తి ఒకమేరకు అరికట్టబడింది.

దేశం స్వాతంత్ర్యం సాధించిన తరువాత రాజకీయ స్వాతంత్ర్యాన్ని ఆర్థిక స్వాతంత్ర్యంగా మార్చుకొనేందుకు వీలుగా విద్యావిధానానికి రూపకల్పన చేయవలసిందిగా రాధాకృష్ణన్ కమీషన్, మొదలియార్ కమీషన్‌లను ప్రభుత్వం నియమించింది. ఆర్థికంగా అభివృద్ధి చెందాలంటే పరిశ్రమలు పెట్టాలి. పరిశ్రమలు నడపడానికి సాంకేతిక నిపుణులు అవసరం. అంటే ఆనాటి పారిశ్రామిక వేత్తలకు అత్యవసరమైన ఇంజనీర్లను తయారుచేయాలి. అందుకే ఆ కాలంలో ఇంజనీరింగ్ కాలేజీలు, పాలిటెక్నిక్ కాలేజీలు, బహుళార్థక పాఠశాలలు విస్తారంగా తెరవబడ్డాయి. ఈ రెండు కమీషన్లు కూడా పెట్టుబడిదారీ విదానం శీఘ్రంగా అభివృద్ధి చెందడానికి అనువుగా విద్యాసంస్కరణలు జరగాలని సూచించాయి.

తరువాత 10, 12, సంవత్సరాలకు అంటే 1962 నాటికి నిరుద్యోగుల సంఖ్య పెరిగింది. పాలకవర్గాలు విద్యావంతులను యిముడ్చుకోలేని పరిస్థితి వచ్చింది. అంటే అప్పటివరకు అమలులో వున్న విద్యావిధానం యొక్క అవసరం తీరిపోయింది. ఇది కొఠారి కమీషన్‌ను నియమించే నాటి ముందు పరిస్థితి.

కొఠారి కమీషన్ రిపోర్టు సమర్పించే నాటికి 1964-68 మధ్యకాలంలో రాజకీయ ఆర్థిక పరిస్థితులలో మార్పులు వచ్చాయి. కొన్ని రాష్ట్రాలలో కాంగ్రెసేతర ప్రభుత్వాలు అధికారంలోకి వచ్చాయి. నిరుద్యోగులు కానున్న విద్యార్థుల ప్రజాస్వామ్య ఉద్యమాలు పెరిగాయి. ఈ మార్పుల కారణంగా కొఠారి కమీషన్ సిఫార్సులలో పాలకవర్గాల కనుకూలమైన వాటిని మాత్రం అమలుజరిపింది ప్రభుత్వం.

1986 నాటికి రూపాయి మారకం విలువతగ్గింది. ఎగుమతులు పెరిగాయి. దిగుమతులు తగ్గాయి. దేశంలోని మార్కెటుపై ఆధారపడి పాలన సాగించడం సాధ్యం కాని పరిస్థతి ఏర్పడింది. ఎగుమతులు పెంచాలంటే సాంకేతిక పరిజ్ఞానం, సాంకేతి పరికరాలు అవసరం, వాటిని దిగుమతి చేసుకోవచ్చు. కాని వాటితో పనిచేసే నిపుణులైన పనివారిని తయారుచేసుకోవడం ఆనాటి పాలకర్గాల అవసరం. అలాంటి అవసరం మేరకు రూపొందిచబడినదే రాజీవ్‌గాంధీ ప్రవేశపెట్టిన 1986 నూతన విద్యావిధానం. "పెట్టుబడులు పెంచడానికి అవసరమైన మేరకే విద్యారంగానికి

ఖర్చు పెట్టడం మంచిది" అంటుంది. అప్పులిస్తున్న ప్రపంచబ్యాంకు. మన ప్రభుత్వాలు ప్రపంచబ్యాంకుసూచనలకు వీరవిధేయత ప్రకటిస్తే నిన్నటివరకు వల్లించిన విద్యాబాధ్యతలను, సంక్షేమ కార్యక్రమాలను అటక ఎక్కించాయి. కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు, విద్య, ఉపాధి అవకాశాల కొరకు చేవడుతున్న ప్రజాస్వామ్యఉద్యమాలను లాఠీలతో అణచివేస్తున్నాయి. మరీ దారుణమైన అంశమేమంటే ఈ నాటి పాలకవర్గాలు సంకుచితమైన తమ వర్గ ప్రయోజనాలే మొత్తం సమాజం యొక్క ప్రయోజనాలుగా ప్రచార ప్రసారసాధనాల ద్వారా విస్తృత ప్రచారం సాగిస్తూ ప్రజలను నమ్మించ ప్రయత్నిస్తున్నాయి.

## నూతన ఆర్థిక విధానాలు - నూతన విద్యా విధానాలు

1986 నాటికి మన ఆర్థిక పరిస్థితి మరింత సంక్షోభంలో పడింది. ఉద్యోగావకాశాలు బాగా తగ్గిపోయాయి. పాలకుల ఆలోచనా విధానాల్లోనూ గణనీయమైన మార్పు వచ్చింది. సరళీకృత విధానాలకు తలుపులు తెరవడం మొదలైంది. మార్కెట్ వ్యవస్థ, ఎగుమతి ఆధారిత పరిశ్రమలు, ఆధునీకీకరణ, 21వ శతాబ్దంలోకి పయనం లాంటి మాటలు జోరుగా ముందుకొచ్చాయి. అప్పుల యుగం ఆరంభమైంది.

ఈ దశలో ఉద్యోగాలకు డిగ్రీలకు లింకులేదనే వాదం ఒకటి తెచ్చారు. అత్యాధునిక నైపుణ్యం కోసం నవోదయ పాఠశాలలు తెరిచారు. అన్నిటికన్నా ముఖ్యమైన అంశం సార్వత్రిక ప్రాథమిక విద్యకుగతంలోలాగా గడువు నిర్దేశించకపోవడం. నాన్ ఫార్మల్ విద్యకు పెద్దపీట వెయ్యడం.

దీని సారాంశం ఉన్నత విద్యను ప్రభుత్వం వదిలించుకొని డబ్బున్న వారికే అది లభ్యమయ్యేలా చెయ్యడం. ఉన్నత వర్గాలకు ప్రైవేటు, డూన్ స్కూళ్ళు చూపించి పేదలకు నాలుగు ముక్కలు నేర్పే నాన్ ఫార్మల్ స్కూళ్ళకు పరిమితం చెయ్యడం తప్ప మరేమీ కాదు. ఆధునిక యుగంలోకి, 21 వ శతాబ్దంలోకి, వెళ్లడమంటే విద్యారంగంలో ఇంత అసమానతలతో నన్నమాట. అంటే కోట్లాది దరిద్రులొకపక్క కొద్దిమందికోటీశ్వరులొక పక్క పోటీ పడ్డమన్న మాట.

-1991 నాటికి ఈ ఆలోచనలు, ఆర్థి విధానాలు "ఏకైక దిక్కుగా " సర్వామోదితాలు" గా ప్రచారంలోకి వచ్చాయి. ప్రపంచీకరణ, ప్రవేటీకరణ, సరళీకరణలు తారకమంత్రాలై విదేశీ నిధులకు, దిగుమతులకు జొక్యానికి తలుపులు బార్లా తెరిచారు. విద్యారంగం కూడా దీనికి తీవ్రంగా ప్రభావితమైంది. ప్రస్తుతం మనమీ యుగంలో వున్నాం.

## ముందుకొచ్చిన అందరికీ విద్య

ఈ రోజుల్లో "అందరికీ విద్య" అనేది ఒక మహా నినాదంగా ముందుకొచ్చింది. ఐక్యరాజ్యసమితినుంచి అమర్త్యసేన్ దాకా వివిధ కోణాల నుంచి, వివిధ అవసరాలనుంచి దీన్ని ముందుకు తెస్తున్నారు. బాలకార్మిక వ్యవస్థ రద్దు కావాలని ప్రపంచ బ్యాంకు కూడా నేడు ఘోషిస్తోంది. వర్ధమాన దేశాల ఉత్పత్తులు బాలకార్మికులవల్ల చవకగా ఉత్పత్తి కావడంతో అవి ప్రపంచ మార్కెట్‌లో తమతో పోటీకి దిగుతాయని అగ్రరాజ్యాల భయం. ఆంక్షల కొరడా చూపించి బాలకార్మికుల్ని బడికి పంపమని వారు ఆదేశిస్తున్నారు. వినియమ ప్రపంచం విదేశీ వ్యాపారుల కత్యవసరం. అందుకోసం కూడా " అందరికి విద్య " పేద దేశాల్లో వారి కవసరమవుతూ వుంది.

మరోవైపు ఆధునికయుగ చైతన్యం, పేదవర్గాల ఆందోళనలు శాస్త్ర సాంకేతికావసరాలు కూడా అందరికీ విద్యను ముందుకు తెస్తున్నాయి. అభివృద్ధి వాహకంగానో, సాధనంగానో గాక విద్యను "అభివృద్ధిగానే" పరిగణించే రోజులు వచ్చాయి. మానవ వనరుల అభివృద్ధి సూచికలో చదువుకు అన్నిటికంటే ముందు పీఠం లభిస్తోంది. మానవహక్కులకోసం, ప్రజాస్వామిక పునాదికోసం విద్యకనీసావసరంగా మారింది. ప్రపంచమంతా వెలుగువైపుకు దూసుకుపోతున్న దశలో మనదేశపు స్థితి అద్దంలోలాగా కనపడసాగింది. ఐక్యరాజ్యసమితి నివేదికలు మన పరువును ఏటేటా గంగలో ముంచుతున్నాయి.

ఫలితంగా కూడా అందరికీ విద్యసమాజపు అజండాలోకి ఎన్నడూ లేనంతగా ముందుకొచ్చింది. ప్రాథమిక విద్య ఒక ప్రాథమిక హక్కుగా, డిమాండుగా నేడందరూ అంగీకరించక తప్పని సరిస్థితి ఏర్పడింది. సామాజికావసరాలు, చైతన్యమూ దీన్నిలా మార్చాయి.

ఇప్పుడు ప్రభుత్వాలు పోటీ పడుతున్నాయి. ప్రపంచబ్యాంకు అప్పులు కుమ్మరిస్తోంది. పథకాలు కొత్త కొత్త పేర్లతో ప్రారంభమవుతున్నాయి. ఎక్కడెక్కడివారు కదిలి వస్తున్నారు. వ్యూహాలు మారుతున్నాయి. ఈ సందర్భంగా తలెత్తుతున్న దోరణుల్ని మనం పరిశీలిద్దాం.

1. ప్రాథమిక విద్యకోసం 1986 నుంచి విదేశీ రుణం తీసుకోవడం మొదలైంది. 1986లో APPEP పథకం కోసం మొదలైన సాయం నేడు దేశవ్యాప్తంగా విస్తరించింది. వివిధ దేశాల, ఏజన్సీల, సంస్థల సాయంతో వివిధ ప్రాజెక్టులు వచ్చాయి. ప్రభుత్వ లెక్కల ప్రకారం 8వ ప్లానులో ( 1997-2002) ఈ అప్పులు 4,300 కోట్లను చేరతాయి. ఇందులో ఒక్క ప్రపంచబ్యాంకు వాటానే 3,700 కోట్లు. 7వ ప్లాన్‌లో కేవలం 8.62 కోట్లుగా వున్న ఈ విదేశీ రుణం నేడీ స్థాయికి చేరడం అందరికీ చదువు నేర్పిన ఏ వర్ధమాన దేశమూ ఎరగనంత విచిత్రం. ప్రభుత్వ వ్యయం జీతాలకే సరిపోతున్నందున శిక్షణలు, సదుపాయాలు, బోధనా సామాగ్రి తదితరాలకు ఈ సాయం తీసుకోక తప్పడం లేదనేది ప్రభుత్వ వాదం.

2. ఈ విదేశీ సాయం మన ప్రభుత్వాలు వెచ్చిస్తున్న మొత్తంలో శాతానికి మించదు. అయినా ప్రణాళికల రూపకల్పనలో, అమలులో, వ్యూహంలో పెత్తనం మాత్రం ఈ సంస్థలదే అయికూర్చుంది. విద్యా విధానాన్ని, పాలసీల్ని నిర్ణయించే స్థాయికి ఈ ఆధిపత్యం చేరింది. నిధులు వీరి వద్ద వుండటంతో ఈ స్థితి ఏర్పడింది.

3. ఈ నిధుల వినియోగం కోసం ప్రత్యేక వ్యవస్థలు ఏర్పడుతున్నాయి. ప్రభుత్వ నిధులు ఖజనాలో జమ కావడం లేదు. సొసైటీలు పెడుతున్నారు. ఇవి ప్రభుత్వ విద్యావ్యవస్థ నియంత్రణలో ఏమాత్రం వుండవు. ప్రభుత్వ వ్యవస్థను పరిపుష్టం చేస్తున్నామంటూనే సమాంతర వ్యవస్థలుగా ఇవి చెలామణీ అవుతున్నాయి. ప్రభుత్వ అధికార్లే వీటికి చైర్మన్లు. అంటే ఒకరకమైన ప్రభుత్వ స్వచ్ఛంద సంస్థలన్నమాట. ఇలా చెయ్యడం బ్యూరోక్రసీని అదుపు చెయ్యడం కోసం, నిధులు మళ్ళించకుండా అడ్డుకోవడం కోసం, నిబంధనల సడలింపు కోసం, వికేంద్రీకరణ కోసం, సృజనాత్మత కోసమంటున్నారు. అంటేప్రభుత్వం తన వ్యవస్థల్ని తానే పనికిమాలిందని చెపుతోంది.

4. ఉద్యమరూపంలో కొన్ని ప్రాజెక్టులు ప్రత్యేకంగా చేపడుతున్నారు. ' లోక్ జుంబుష్' లాంటివి చాలా మంచి ఫలితాలు సాధించిన సందర్భాలు ఉన్నాయి. వీటిని చూపించి ప్రభుత్వ వ్యవస్థ 'ఇలా ఎప్పటికీ పనిచెయ్యలేదనే విశ్లేషణ చేస్తున్నారు. దీన్ని ఆధారంగా పెట్టుకొని కొన్ని సూత్రీకరణలు కూడా చేస్తున్నారు. భారతదేశంలాటి వైవిధ్యం, సంక్లిష్టత సమాజంలోని నిరుపేద వర్గాల్ని కదిలించడానికి సంప్రదాయక విద్య (ప్రభుత్వ) వ్యవస్థ ఏ మాత్రం పనికిరాదనేది, ప్రత్యామ్నాయాన్వేషణ తప్పనిసరైనదనేది ఈ సూత్రీకరణల్లోకెల్లా ముఖ్యమైంది.

5. పై సూత్రీకరణ కనుగుణంగా ప్రత్యామ్నాయ పాఠశాలలు, మనబడులు, ఎడ్యుకేషన్ గ్యారంటీ పథకాలు, రాజీవ్‌గాంధీ స్కూళ్ళు వెల్లువలా వస్తున్నాయి. ప్రతి జనావాసానికి పాఠశాల ఇస్తున్నామని చెపుతూ, 10 మంది పిల్లలకు కూడా బడి పెడుతున్నామని చెపుతూ నాన్ ఫార్మల్ కేంద్రాల్లాంటి ఈ వ్యవస్థల్ని నెలకొల్పుతున్నారు. వీటిలో పనిచేసే వారికి నిర్ణీత విద్యార్హతలుండవు. శిక్షణ వుండదు. ఉద్యోగ భద్రత వుండదు. కేవలం 500-600 జీతంతో స్థానిక వనరులు, అజయాయిషీ, భాగస్వామ్యం ఆధారంగా ఈ స్కూళ్ళు నడుస్తాయి. ప్రభుత్వ వ్యవస్థ వీటివల్ల ఏమవుతుందనే భయాందోళనలు పుడుతున్నాయి. ఇవి అందించే చదువు నాసిరకమైన, నాలుగు ముక్కలు నేర్పిసరిపెట్టే చదువు తప్ప మరొకటి గాదని తేటతెల్లమవుతూనే వుండటం గమనార్హం.

6. వికేంద్రీకరణ, ప్రజల భాగస్వామ్యం అనే నినాదాలు ఎప్పుడూ లేనంతగా ముగ్గులోకి వచ్చాయి. ప్రజల భాగస్వామ్యం, ప్రజలకు జవాబుదారీతనం కీలకమని దీనికి వ్యవస్థలే శరణ్యమని చెపుతున్నారు. ఆచరణలో నిరుపేదల పాఠశాలను ప్రభుత్వం వదిలించుకొని ప్రజలకే అప్పజెప్పడంగా మిగులుతుందనే భయం సర్వత్రా వుంది. పంచాయతీరాజ్ వ్యవస్థనిది నిర్వీర్యం చేస్తోంది.

7. అందరికీ విద్యఅనడం "అందరికీ నాలుగు ముక్కల చదువు'" అనే చందంగా వుంది. ఓ నాలుగైదేళ్ళలో హడావుడిగా చదవడం రాయడం నేర్పించేస్తే ఒక పెద్ద తలనొప్పి తీరిపోతుందన్నట్టుంది వ్యవహారం. ఎలాగూ "నేషనల్ శాంపిల్ సర్వే" 91-97 మధ్య 52 శాతం నుంచి 62 శాతానికి అక్షరాస్యత పెరిగిందని ఆశావహమైన లెక్కలు చెపుతోంది. మరో అయిదేళ్ళకు ఇంకా మంచి లెక్కలు వస్తాయి. దీంతో ప్రభుత్వ బాధ్యత తీరిపోతుంది. మార్కెట్‌కి వదలడమే మిగులుతుంది.

## నేషనల్ సాంపిల్ సర్వే ఫలితాలు

| రాష్ట్రం | 1991 | 1997 | అక్షరాస్యత పెరిగిన శాతం |
|---|---|---|---|
| ఉత్తరప్రదేశ్ | 41.6 | 56 | 14.4 |
| బీహార్ | 38.5 | 49 | 10.5 |
| మధ్యప్రదేశ | 44.2 | 56 | 11.8 |
| హిమాచల్‌ప్రదేశ్ | 63.9 | 77 | 13.1 |
| రాజస్థాన్ | 38.5 | 55 | 16.5 |

## రెండుప్రమాదాలు

ఈ ధోరణుల పట్ల రెండు ప్రమాదాలు కొట్టవచ్చినట్టు కన్పిస్తున్నాయి. ఒకటి ప్రాథమిక విద్యను ఉన్నతవిద్యతో, సంక్షేమ పథకాలతో పోటీపెట్టడం. అందరికీ అత్యవసరంగా చదువు నేర్పాలి గాబట్టి దీనికోసం ఎక్కువ నిధులవసరం కాబట్టి ఉన్నత విద్యమాకు సాధ్యమైంది కాదనే వాదన ముందుకొచ్చేసింది. దీన్ని ప్రైవేటు రంగానికి వదిలేస్తారు. అంటే ప్రాథమిక విద్యకోసం ఉన్నతవిద్యను బలిపెట్టడమన్న మాట. అలాగే ఈ నిధుల కోసం సబ్సిడీలకు కోత పెట్టాలనడం కూడా. రెండు ఒక దీర్ఘకాలిక ప్రణాళికగా లక్ష్యంగా, నిరంతర ఉద్యమంగా గాక ఒక నిర్ణీతకాలానికి 2005 లేదా 2010 అనే కొంద గుర్తుపెట్టి అప్పటిలోగా విదేశీ నిధులతో పనిముగించెయ్యాలనుకొనే ధోరణి. ఆ తర్వాత ఏమిటి ? అప్పటికి అప్పులు తీర్చాల్సివస్తుంది. మరింత కోతలు తప్పనిసరి అవుతాయి. ప్రాథమిక విద్యను కూడ 'సమాజానికి' అప్పగించేస్తారు. మరోవైపు ప్రైవేటు రంగం మరింత విస్తరిస్తుంది. ప్రస్తుత ఉన్నతవిద్య దుస్థితి ప్రాథమిక విద్యకు పడుతుంది. 2005 తర్వాత రాష్ట్ర ప్రభుత్వాలు ప్రాథమిక విద్య మీద పెట్టే ఖర్చు బాగా తగ్గిపోతుందని ప్రపంచబ్యాంకు స్పష్టంగా చెప్పడం ఈ నేపథ్యంలోనే.

## ఒక మంచి పరిణామం

ఎలానైనా, ఎందుకోసమైనా 'అందరికీ విద్య' సమాజపు అజండాలోకి రావడం ఆహ్వానించదగ్గ పరిణామం. ప్రస్తుతం దీనిపై తీవ్ర చర్చోపచర్చలు జరుగుతున్నాయి. అనేక అంశాలు ముందుకొస్తున్నాయి. సిలబసుమీద, బోధనా విధానాల మీద,

పిల్లలు హక్కుల మీద, స్వేచ్ఛా ప్రజాస్వామిక విద్య మీద జరుగుతున్న తర్జన భర్జనలు మరింత ఆహ్వానించదగ్గవి. అనేక ప్రయోగాల్ని, అనుభవాల్ని విశ్లేషించడం స్వీకరించడం కూడా జరుగుతోంది. అన్ని సామాజిక వర్గాలు 'అందరికీ విద్య'ను ఆధునికావసరంగా గుర్తించడం ఎంతో శుభపరిణామం.

అయితే ఇది ఏదో యథాలాపంగా వచ్చిపడిందో, ప్రపంచబ్యాంకు తలలోంచి పుట్టుకొచ్చిందోగాదు. ఇది ఆధునిక యుగ చైతన్యంనుండి వచ్చింది. ప్రజాస్వామిక హక్కుగా పీడిత ప్రజానీకం నుండి వచ్చింది. ఒక సామాజికావసరంగా వచ్చింది. కాకుంటే పాలకులు ఈ పరిస్థితుల్ని కాదనలేక, తమ ప్రయోజనాలు దీనితో ముడిపడీ దీన్ని తమ నినాదంగా ముందుకు తెస్తున్నారు.

## విజన్ 2020

పై పరిణామాలకు, పరిస్థితులకు కొనసాగింపుగానే మనం స్వర్ణాంధ్రప్రదేశ్ (విజన్ 2020) ను పేర్కొనాలి. ఇందులోని ఇతర అంశాలతోపాటు అందరికీ విద్య కూడా సరళీకృత విధానాలకు, మార్కెట్ ఆధారిత అభివృద్ధికి సానుకూలత కల్పించేందుకు ఉద్దేశించినదే. ప్రాథమిక విద్యకూడా పెట్టుబడి పెట్టేవారికి అనుకూల వాతావరణం కల్పించడంలో కీలకపాత్ర వహిస్తుందనే విజన్ 2020 చెపుతోంది. అందుకనే ఇది ప్రభుత్వ బాధ్యతగా స్వీకరించినట్లు చెపుతోంది.

దీన్ని మరింత లోతుగా పరిశీలిద్దాం. మొదటి అంశం విద్యను విజన్ 2020 ఎలా చూస్తున్నదనేది. విద్యకుండాల్సిన విముక్తదాయక, ప్రజాస్వామ్య చైతన్య గుణాల ఊసు ఇందులో లేదు. నేర్పరితనం పెంచడమే విద్యగా, ఆ నేర్పరితనం ఉత్పాదన కోసంగా నిర్వచించడం మనం గమనించాల్సిన విషయం. మనిషి కేవలం ఉత్పాదక యంత్రమని, దాని ఉత్పాదకతను పెంచడానికి విద్య ఒక సాధనంగా ఉపయోగపడుతుందని విద్యా లక్ష్యాన్ని నిర్వచించుకోవడమే అన్నిటికన్నా గమనించదగ్గ అంశమని భావించారు.

ఇలా ఆలోచించబట్టే పెట్టుబడులు పెట్టేవారికి తగిన వాతావరణ కల్పన కోసమే విద్యఅనే సిద్ధాంతం ముందుకొచ్చింది. అక్కడితో ఆగక విద్యను ఒక పరిశ్రమగా గుర్తించారు. 19 అభివృద్ధి చోదకాల్లో (Growth engines) ఒకటిగా పేర్కొన్నారు. సమానతకూ న్యాయానికీ పునాది వెయ్యాల్సినవిద్య ఒక సరుకుగా మారికూర్చుంది. ఉపాధి రూపంలో సొమ్ముచేసుకోగల, కొనుక్కోగల విషయాలకే విద్యను కుదించారని కూడా మనం మరిచిపోకూడదు. ఒక్క మాటలో చెప్పాలంటే ఇదొక బిజినెస్ కన్సల్టెంట్ దృక్పథం. అందుకోసమే కాబోలు విజన్ 2020 రచనకు మన సామాజిక శాస్త్రవేత్తలు, ఆర్థికవేత్తలు ఎవ్వరూ పనికి రాలేదు. ఎక్కడో వున్న ఒక కంపెనీ ఈ పని చేసి పెట్టింది.

రెండో అంశం ఉన్నత విద్యారంగం, ప్రాథమిక విద్యవరకే ప్రభుత్వం బాధ్యత అని విస్పష్టంగా విజన్ 2020 పేర్కొంటున్నది. దానివల్ల ఒరిగేదేమిటి ? ఉన్నత విద్యావయోగ్రూపులో మనదేశంలో 4.5 మించి కాలేజీల్లో అడుగు పెడుతున్న వారు లేరు. ఇది మరీ కుచించుకొని పోతుంది. ఒక వర్ధమాన దేశం సాటి ప్రపంచంతో నిత్యం పోటీ పడాల్సిన యుగంలో ఇదెక్కడికి దారి తీస్తుంది ? ప్రాథమిక సైన్సుకు కాలం చెల్లుతోంది. స్పెషలైజ్డ్ కోర్సులకే పట్టం కడుతున్నాను. సామాజిక శాస్త్రాలు అవసరమే లేదని ఉద్ఘాటనలు చేస్తున్నారు. కంప్యూటర్ లాంటి అత్యాధునిక కోర్సులే ఉన్నతవిద్య అని సూత్రీకరిస్తూ వున్నారు. ఈ పరిణామాల పర్యవసానం ఏమిటి ?

దీనికి ముందు 1997లో బ్రిటన్ ఉన్నతవిద్యపై విచారణ జరిపిన రాన్ డియారింగ్ కమిటీ విశ్లేషణని ఒకసారి పరిశీలిద్దాం. "సంస్కృతీపౌరసత్వానికి వాహకమైన ఉన్నత విద్య నేటి అవసరం. మార్పు వేగం పుంజుకొనే కొద్దీ దీని ప్రాధాన్యత మరీ పెరుగుతుంది. మార్పుల భావం గమనించడానికి నాగరిక సమాజావసరాల్ని గుర్తించడానికి, విలువల్ని కాపాడడానికి ఉన్నత విద్యఅత్యంతావసరం" (నేర్చుకొనే సమాజం"1997).

మరి మార్పులు విపరీతమైన వేగంతో వస్తున్నాయని దీనికి తగ్గట్టు పరుగెత్తడం నేర్చుకోకపోతే వెనకబడి పోతామని ఊదరగొడుతున్న విజన్ 2020 ఉన్నత విద్యకున్న ఈ సామాజికావసరాన్ని ఎందుకు గుర్తంచదు ? మార్పుల భావం' గమనిస్తే ప్రమాదమనా? అలాగే ఇదే బ్రిటన్ కమిటీ ఉన్నత విద్యను స్వయం పోషకంగానే చూడాలనడాన్ని కూడా తీవ్రంగా వ్యతిరేకించింది. ఇలాంటి రంగం తనకు తాను నిధులు సమకూర్చుకోవడం అసంభవమని తేల్చింది. ప్రభుత్వ బాధ్యతగా ఉన్నతరంగాన్ని పేర్కొన్నది. బ్రిటన్‌లాంటి అభివృద్ధి చెందిన దేశమే ఇలా ఆలోచించాల్సి వుందని అంటుండగా మనలాంటి వెనకబడిన దేశం మరింత తీవ్రంగా దీన్ని ఆలోచించాలి గదా ! అప్పులిచ్చిన వారినుంచి ఇది మాత్రం నేర్చుకోనక్కరలేదా ?

సెకండరీ ఉన్నత విద్యారంగాల్ని ప్రైవేటుపరం చేసినందువల్ల వచ్చే సమస్య తీవ్రమైన అసమానత. ముందే పేదల ప్రాథమిక విద్యను నాన్ ఫార్మల్ స్థాయికి దిగజార్చుకున్నారు. వారు ఉన్నత విద్యకు చేరే అవకాశమే వుండదు. చేరగల్గినా ప్రైవేటు సంస్థలు వారికి అందనంత దూరంలో వుంటాయి. దీనివల్ల మరీ నిమ్నవర్గాలకు తీవ్రమైన అన్యాయం జరుగుతుంది. మరొక "అగ్రవర్ణం" అత్యాధునిక కోర్సులు చదివిన వర్గంగా ఏర్పడుతుంది. ఇక ఈ విచక్షణ ఎన్నటికీ తగ్గదు.

ఈ అత్యాధినిక ఫైవ్‌స్టార్ కోర్సులన్నీ స్వయం పోషకాలు. వీటిని డబ్బు పెట్టికొన్న ఉన్నతవర్గం దాన్నించి అంతే సంపాదించాలనుకొంటుంది. పెద్ద పెద్ద వ్యాపార సంస్థలను, విదేశాలను వీరు వెతుక్కొంటారు. ఇంకో విధంగా చెప్పాలంటే ఆధునిక పెట్టుబడిదారీ యజమానులకోసం, బహుళజాతి కంపెనీల కోసం ఒక ప్రత్యేక వర్గాన్ని మనం ఈ నూతన ఉన్నత విద్యావిధానం ద్వారా సమకూర్చి పెడుతున్నామన్నమాట. మార్కెట్ ఆధారిత అభివృద్ధికిది ప్రాతిపదికగా వుంటుందన్నమాట.

దీనినుంచి వచ్చే విలువలు ఏపాటి ? ప్రతిదీ వ్యాపారం. ప్రతిదీ గొంతులు కోసుకొనే పోటీ. ప్రతిదీ వ్యక్తిగత ప్రయోజనాలకు, నైపుణ్యాలకు పట్టంగట్టేది. ఇందులో సామాజికాంశాలు వెతికినా కనపడవు. ఇక ఉన్నత విద్య ద్వారా వ్యక్తి "సమాజ గతిక్రమంలో క్రియాశీల భాగస్వామి" కావడమూ లేదు, సమాజం ఒక సమున్నత ప్రజాస్వామిక అభ్యుదయ విలువల్ని సంతరించుకొనేదీ లేదు.

మూడవ అంశం వృత్తి విద్యారంగం. స్వర్ణాంధ్ర దేశం కోసం మన వనరుల్ని పుష్కలంగా వాడుకొనాల్సి వుంది. 19 రకాల అభివృద్ధి చోదకాలను విప్లవీకరంచాల్సి వుంది. దీనికోసం వృత్తి, సాంకేతిక విద్యలకు పట్టం గడుతామంటున్నారు. ప్రాథమిక విద్యతోనే విద్యను ముగింపుజెయ్యడానికి తప్ప ఈ వృత్తివిద్యలు ప్రస్తుతావసరాలకు ఎంత పనికి వస్తాయేనది పరిశీలిచాల్సిన అంశం. దీన్ని విజన్ విశ్లేషించి వుండవలసింది.

సెకండరీ ఇంటర్ స్థాయిల్లో 1984-85 లో ప్రారంభించిన కోర్సులు చాలావరకు మూతపడుతున్నాయి. వాటికి తగిన బోధనా సిబ్బంది లేరు. ఉన్నవారికి అర్హతలుండవు. కోర్సులు కాలం చెల్లినవి. యంత్ర పరికరాలకు కరువు. నేటికీ వాటికి కనీసం పాఠ్యపుస్తకాలైనా రూపొందలేదు. పరీక్షలు సకాలంలో జరుపరు.

డిగ్రీ స్థాయిలో 130 కాలేజీల్లో ప్రవేశపెట్టిన కోర్సులు మరీ అధ్వాన్నంగా వున్నాయి. భారీ ఫీజుల్ని రుద్దడం తప్ప కనీస సౌకర్యాలు కూడా లేవు. దీనివల్ల ప్రభుత్వ సాంకేతిక విద్యా వ్యవస్థ ధ్వంసమైంది.

ఐ.టి.ఐ.ల పరిస్థితి కూడా అలానే వుంది. పై సమస్యలు చాలక మాస్ కాపీయింగు, అవినీతి ఏరులై పారుతోంది. పోటీలో చాలా గొప్పగా చెప్పుకొనే ప్రైవేటు కళాశాలలు బాగున్నాయా ? అదీ లేదు. కోర్సులు నడిపేందుకు "లైసెన్సులు" తప్ప, ఫీజు గుంజుకొనేందుకు చట్టబద్ధత తప్ప వీరి దగ్గర మరేదీ వుండదు. పచ్చి దోపిడీ, పరమనాసికరం చదువులు, సర్టిఫికేట్ తప్ప దీనివల్ల వచ్చేవేమీ వుండదు. మరీ కంప్యూటర్ కోర్సులు బోగస్‌గా మారడం, మోసాలు సర్వసామాన్యం కావడం, ఏది నిజమో ఏదికాదో తెలీని ఒక మాయాజాలంలో విద్యార్థుల్ని పడెయ్యడం మనం చూస్తున్నాం. ఇక వేలం వెర్రిగా వెలిసిన సాంకేతిక కళాశాల వల్ల లక్షలు వసూలు చేసిన కోర్సుల వల్ల విద్యార్థులు వీధిన పడ్డం తప్ప జరుగుతున్నదేమీ లేదు. వాటిలో చదువుండదు. వాటికి మార్కెట్‌లో విలువా వుండదు. దీన్ని మనం గమనిస్తున్నాం. ఈ ధోరణిని మరింత ముందుకు తీసుకెళ్ళడమేనా మనకుండాల్సిన విజన్ ! ఈ సంస్థలకు డబ్బు లేకపోతే బ్యాంకులు, ఆర్థిక సంస్థల ద్వారా ఇప్పిస్తామని మరీ ప్రభుత్వం వాగ్దానం చెయ్యడం విడ్డూరం.

నాల్గవ అంశం. రాష్ట్ర ప్రభుత్వమేమో అభివృద్ధి కోసం అప్పులు చేస్తానంటుంది. స్వంత వనరుల్ని వాడుకోడానిక్కూడా రుణాల అవసరముంటుంది. మరి ఉన్నత విద్యారంగం మాత్రం వనరుల్ని తనకు తాను చూచుకోవాలంటుంది, తనకే చెల్లని నీతి వీటికెలా వర్తిస్తుంది. ? అత్యంత అభివృద్ధి చెందిన పాశ్చాత్యదేశాల్లో సైతం సెల్ఫ్‌ఫైనాన్సింగు విధానం లేదని జస్టిస్ పున్నయ్య కమిటీ కేంద్రీయ విశ్వవిద్యాలయంపైచేసిన అధ్యయనంలో తెలిపింది. అమెరికా ఉన్నత విద్యాసంస్థల మొత్తం ఖర్చులో 20 శాతం, బ్రిటన్ 34 శాతం ఫీజులు వసూలు చేస్తున్నాయి. మరి మనలాంటి పేద దేశంలో 100 శాతం ఫీజుల ద్వారా ఈ సంస్థ లెలా నడుస్తాయి ?

## హంగామానేనా చిత్తశుద్ధి వుందా

భారతదేశపు చదువుల రాజధానిగా ఆంధ్రప్రదేశ్‌ను మార్చి "విద్యా విజ్ఞాన సమాజం" నిర్మించాలనుకొన్న విజన్ వయోజన విద్యకు అమెరికా, విద్యావలెంటీర్లకు అమెరికా హెడ్‌స్టార్ట్‌లను ఆదర్శంగా తీసుకొంది. ఒక పెద్ద వర్ధమానదేశం మరో పెద్ద వర్ధమాన దేశాన్ని (చైనాలాంటిదాన్ని) ఆదర్శంగా తీసుకొంటే అర్థం వుంటుంది. అమెరికాను తీసుకొంటే ఎలా ? కనీసం కేరళ కూడా కన్పించలేదు.

విజన్ 2020లో పెద్ద ఎత్తున ప్రజల భాగస్వామ్యం గురించి, సామాజిక బాధ్యతను గురించి ఎంతో చెప్పబడింది. అంటే విద్యను సాధించడం కోసం ఒక సాంస్కృతిక ఉద్యమం అవసరమని గుర్తించటమే. మంచిదే. దానికి మార్గమేమిటి? ప్రణాళిక ఏమిటి ? గతానుభవాలేమిటి ? ఈ చర్చ ఎక్కడా లేదు. కనీసం సంపూర్ణ అక్షరాస్యతా ఉద్యమాల అనుభావాలనుంచైనా నేర్చుకొన్నది లేదు. గ్రామ కమిటీల పరిస్థితీ, గ్రామసభల తంతూ మనం చూస్తున్నాం. ఇది హంగామా తప్ప చిత్తశుద్ధిని ప్రతిబింబిస్తుందని ఎలా చెప్పగలం ?

## అసలు విషయం నిధులు

ప్రస్తుతం విదేశీ నిధులు తప్ప రాష్ట్ర కేంద్ర బడ్జెట్ల నుంచి నిధులు అధికంగా ఏమీ ఇవ్వడంలేదు. ఇది కఠోర వాస్తవం. కొఠారీ 6% జిడి.పిలో విద్యకై కేటాయించాలన్నాడు. 1992 లో 9 దేశాల శిఖరాగ్ర సభలో 2000 సం॥నాటికి ఈ కేటాయింపు చేస్తామని భారత్ హామీ ఇచ్చింది. ఇది అమలు కాలేదు. 1990 లో జమైకాలో జరిగిన 150 దేశాల సమావేశంలోను ఇదే వాగ్దానం చేశారు. పైగా జి.డి.పి.లో 3% పైగా సంక్షేమ పథకాలకు కోత విధిస్తేనే తక్కువ వడ్డీకి (Softly social network) ఇండియాకు అప్పు ఇస్తామన్న విదేశీ ఏజన్సీల డిమాండును భారత ప్రభుత్వం అంగీకరించింది. ఈ కోత విద్యకూ వర్తిస్తుంది కాదా !

అప్పటి విద్యామంత్రి సైకియా 9వ ప్లాన్లులో 40 వేల కోట్లు విద్యకు అవసరమని ప్రతిపాదించాడు ( 8వ ప్లాన్ ఖర్చు 20 వేల కోట్లు) అదికూడా జి.డి.పి.లో 6% కాదు. తపన్ మజుందార్ కమిటీ 10 సం॥లకు 1,37,000 కోట్లు కావాలనింది. మొదటి 5 సం॥లకు 63,000 కోట్లు, తర్వాత 5 సం॥లకు 37,000 కోట్లు అది అవసరమనింది. ఇది జిడిపి.లో 6% కు దగ్గరగా వుంది. అయినా మన జి.డి.పి.లో ప్రభుత్వ లెక్కప్రకారం 3.7% శాతం, ప్రైవేట్ లెక్కల ప్రకారం 2% మించి కేటాయంచింది లేదు.

విద్య సమిష్టి జాబితాలో ఉంది. రాష్ట్రంలో భారం పడుతున్న దశలో రాష్ట్ర ప్రభుత్వం ఈ కేటాయింపు కోసం ఎందుకు వత్తిడి

చెయ్యదు ? అలాగే రాష్ట్రం ఇప్పటికెప్పుడూ 17% మించి తన బడ్జెట్‌లో నిదులు కేటాయించిన దాఖలా లేదు. ఇంతపెద్ద మహాగ్రంథంలో ఈ ఊసు లేకపోవడం పొరపాటని ఎలా అనుకొందాం. ఇదీ ఒక విధానంగానే అనుకోవాలి.

అలాగే 83వ రాజ్యాగ సవరణ చేసి ప్రాథమిక విద్యను ప్రాథమిక హక్కుగా గుర్తించేందుకు జనతా ప్రభుత్వం ముసాయిదా సిద్ధం చేసింది. అలాచేస్తే ప్రభుత్వ బాధ్యత స్పష్టమవుతుంది. నిధులు కేటాయించక తప్పని సరిస్థితి ఏర్పడుతుంది. దీన్నిదాట వేసేందుకు "ఈ సవరణవల్ల న్యాయపరమైన చిక్కులు తలెత్తుతాయ"ని కేంద్రం వాదం.

దీనిని చట్టం చెయ్యడానికి రాష్ట్రం కేంద్రంపై ఎందుకు ఒత్తిడి పెట్టదో తెలియదు. అలాగే ఆంధ్రప్రదేశ్ ముఖ్యంగా హైదరాబాద్ నగరం బాలకార్మికులకు కేంద్రంగా వుంది. దేశంలోనే రికార్డు స్థాయిలో బాలకార్మికులుగల రాష్ట్రాల్లో మనది మొదటిస్థానం. దీన్ని నిర్మూలిస్తాం అనడం తప్ప ఎలా నిర్మూలిస్తారో విజన్‌లో ప్రస్తావన లేదు. ఈ సమస్యకున్న భిన్న కారణాలపై విశ్లేషణ లేదు. సామాజిక ఆర్థికాంశాలపై వివరణ కనిపించదు.

అభివృద్ధి కోసం చేపల పెంపకం, గనులు లాంటి వాటిపై కేంద్రీకరించాలని విజన్ పేర్కొంది. కాని రొయ్యల పెంపకం పెరిగిన కోస్తా గ్రామాల్లో బడికి వెళ్ళే పిల్లల శాతం తగ్గింది. గనులు గల రాయలసీమ గ్రామాల్లో బాలకార్మికులు పెరుగుతున్నారు. పత్తిలాంటి వాణిజ్యపంటలు పెరిగినచోట ఆడపిల్లలు బడికి ఎక్కువగా మానేస్తున్నారు. దీన్ని విజన్ ఎలా విశ్లేషిస్తుందో ఎక్కడా లేదు.

ఇక మన విద్యారంగాన్ని కలవరపరుస్తున్న అంశాలు మరికొన్ని వున్నాయి. అందులో ఒకటి డ్రాపవుట్స్ సమస్య.

**డ్రాపవుట్స్ 1998-99 (శాతం)**

| | బాలురు | బాలికలు | మొత్తం |
|---|---|---|---|
| అందరు | 42.69 | 44.70 | 43.63 |
| ఎస్.సి.లు | 48.67 | 54.66 | 51.48 |
| ఎస్.టి.లు | 68.91 | 75.59 | 71.74 |

దీని కారణాలపై చాలా విశ్లేషణలు వచ్చాయి. సర్వేలు జరిగాయి. బడికి ఇంటికి గల భౌతిక దూరాన్ని మాత్రమే తగ్గిస్తే చాలదు. సామాజిక దూరాన్ని తగ్గించాల్సి వుంది. బడి వాతావరణం పేద పిల్లలకు అనుకూలంగా వుండాలి. చెప్పే పాఠాలు, చెప్పేవిధానం, వ్యవహరించే తీరు అన్నీ పిల్లలకి దగ్గరగా అనుకూలంగా వుండాలి. దీనికావల్సిన సౌకర్యాల గరించిగాని ఏర్పాట్ల గరించిగానీ విజన్ 2020 ఏమీ పేర్కొనలేదు.

ఉచిత నిర్బంధ విద్యఅనగానే సరిపోదు. మనం ఇచ్చే చదువు ఎంత ఉచితం ? దీనిపై PROBE. ఇలా చెపుతుంది.

**ప్రాథమిక స్థాయి పిల్లల్ని బడికి పంపేందుకయ్యే ఖర్చు**

| | | |
|---|---|---|
| NSS అంచనా | 1986-87 | రూ. 212.00 |
| PROBE అంచనా | 1996 | రూ. 318.00 |
| NCAER అంచనా<br>(ఇందులో దుస్తుల ఖర్చు లేదు) | 1994 | రూ. 478.00 |

అందువల్ల మధ్యాహ్న భోజన పథకం లాంటి ప్రోత్సాకాల విలువ ఎంతో మనం గమనించవచ్చు. ఇలాంటి అంశాల జోలికి విజన్ పోకపోవడం యాదృచ్ఛికమా ? అలాగే మన విద్యాప్రమాణాల సమస్య. ప్రాథమిక విద్యచెపితే మా పరమార్థం నెరవేరినట్టే అనిగదా మనం చెపుతున్నది. మరి 5వ తదగతి స్థాయి పిల్లల అభ్యసన ప్రమాణాలేమిటి ? ఒక జిల్లాలో 6వ తరగతిలో చేరిన పిల్లలకు 2వ తరగతి పరీక్ష పెడితే 50 శాతం పైగా తప్పి పోయ్యారు. మనకు నిధులిస్తున్న ప్రపంచ బ్యాంకు అంచనా ప్రకారమే ( శుక్లా 1994) ఆంధ్రప్రదేశ్‌లో 45% పిల్లలు కనీసాభ్యసన ప్రమాణాలు సాధించడం లేదు. ఇలాంటివారు ఎక్కువమంది 2వ తరగతి తర్వాత బడిమానేస్తారు. కాదని 5 తరగతుల పూర్తి చేసినా (పరీక్షలు లేవు గాబట్టి) ఓ 10 సం॥ల తర్వాత వీరేమీ చదవలేరు. ఆచరణలో వీరు నిరక్షరాస్యులే. ఎందుకిలా జరుగుతోంది ? దీనిపైవిజన్ ఏమీ మాట్లాడదు. ఒక శాస్త్రీయ చర్చ దీని మీద ఏమీ జరగలేదు కూడా.

ఆఖరి అంశం చాలా కీలకమైంది. విజన్ ప్రతిపాదిస్తున్న ఆర్థికాభివృద్ధి తీవ్ర అసమానతల్ని తెస్తుంది. ముఖ్యంగా వ్యవసాయంలో తెస్తున్న మార్పు 80 శాతంగా వున్న మన చిన్న సన్నకారురైతుల్ని తమ పొలాలలోనే కూలీలుగా మారుస్తుంది. కార్పోరేట్ సేద్యానికి శ్రీకారం చుట్టి వాణిజ్య, ఫల సేద్యాన్ని ముందుకు తెస్తుంది. ఈ వ్యవసాయ మార్పులతోపాటు, ప్రభుత్వరంగ సంస్థల మూతవల్ల, ఉద్యోగ భద్రతా రాహిత్యంవల్ల వచ్చే పరిణామాలు, సామాజిక సంక్షోభాలు అందరికీ విద్యను మరింత హాస్యాస్పదం చేస్తాయి. విద్యలాంటి సామాజిక ఉపరితల నిర్మాణం ఆర్థికపునాదిపై ఆధారపడి వుంటుందని పునాది కూలిపోతే పరిస్థితి ఎలా వుంటుందని గానీ విజన్ కొంచమైనా ఆలోచించకపోడం విచారకరం.

## విద్యారంగంలో మతవాదధోరణి

మనం ఏ సామాజిక విలువలు కోరుకొంటే ఆ రకమైన విద్యను మనం రూపొందించుకొంటాం. ప్రజాస్వామ్యం, సహనం ఆదునికయుగ లక్షణాలు. భిన్నమతాలు, జాతులు గల మనదేశంలో మరింతగా అవసరమైన లక్షణాలివి.

కానీ దీనికి భిన్నంగా మతాన్ని సంస్కృతిగా పరిగణించడం, అదీ మెజారిటీ మతమే మతంగా భావించే శక్తులు మతం చుట్టూ విద్యను తిప్పుజూస్తున్నాయి. చరిత్ర గతానిదే అయినా దానిలో భవిష్యదంశాలు వుంటాయి. దీన్ని మరిచి చరిత్రనంతా మతయుద్ధాల కింద లెక్కిస్తూ తిరగరాస్తున్నారు.

సంకుచిత,స్వోత్కర్షపూరిత, విద్వేషకర ప్రాపంచిక దృక్పథాన్ని ముందుకు తెస్తున్నారు. ఈ దృక్పథంలో మైనారిటీలకు, నిమ్నవర్గాలకు తావులేదు. వారి సంస్కృతికి చోటులేదు. ఏకశిలా సదృశ సామాజిక వ్యవస్థను వీరు ప్రతిపాదిస్తున్నారు. ప్రేమస్థానే ద్వేషం, సహజీవనం స్థానే ప్రతీకారం, సైన్సు స్థానే విశ్వాసం పాఠ్యగ్రంథాల్లోకి ఎక్కిస్తున్నారు. ఇది మొత్తం మన సామాజిక వ్యవస్థనే చిన్నాభిన్నం చేస్తుంది.

ఈ ధోరణిపట్ల విద్యాభిమానులే కాదు సామాజిక పండితులు, సగటు పౌరులూ కూడా ఆందోళన చెందుతున్నారు. ఒక పథకం ప్రకారం కాలానికి నిలబడ్డ విలువల్ని, పద్ధతుల్ని వదిలేసి సంస్థలకు సంస్థల్నే ఈ శక్తుల ఆధీనంలో పెడుతున్నారు. దీనిపట్ల రాష్ట్ర ప్రభుత్వం ఏమీ మాట్లాడ్డంలేదు.

## మరి ప్రత్యామ్నాయం ఏమిటి ? పరిష్కారం ఏమిటి ?

### ప్రాపంచిక దృక్పథం - లక్ష్యం :

ఆర్థిక సామాజికాభివృద్ధికి సంబంధించిన ఒక సమగ్ర దృక్పథం మాత్రమే విద్యపట్ల ఒక స్పష్టతను కల్గించగలుగుతుంది. సమానత, న్యాయం ప్రాతిపదికగా గల ఒక ప్రాపంచిక దృక్పథం మాత్రమే "అందరికీ విద్య", నాణ్యమైన విద్య, విలువలతో కూడిన విద్య అనే మాటల్ని అర్థవంతం చేస్తుంది.

ఇలా చూచినపుడు విద్యవ్యక్తి సమగ్రాభివృద్ధితో పాటు సామాజిక గతిక్రమాన్ని నిర్దేశించడంలో అతన్ని క్రియాశీల భాగస్వామిగా కూడా చేసేదిగా వుండాలి. ఉత్పాదక నైపుణ్యాన్ని అందించడంతోపాటు సమున్నత మానవ విలువల్ని ప్రోగు చేసేదిగా కూడా వుండాలి. ఆధునిక యుగ లక్షణాలైన ప్రజాస్వామ్యం, సాంఘిక న్యాయం, మానవహక్కులు, సెక్యులర్ స్వభావం విద్యకు నేడు విలువలని సర్వత్రా అంగీకరిస్తున్నారు.

ఇలా చూసినపుడు అందరికీ విద్యావకాశాలు సమానంగా వుండటం. అదర్నీ ఒకానొక స్థాయికి పరిమిత వ్యవధిలో తీసుకొని రావడం మన లక్ష్యాలుగా వుండాలి. పేదరికం, సామాజిక వెనకబాటుతనం, కుల వివక్షణ లాంటి రుగ్మతలతో కూడిన భారతీయ సమాజంలో చదువు ఈ వర్గాలపట్ల పక్షపాతిగా వుండి తీరాలి. ప్రత్యేకానక్తితో, శ్రద్ధతో, సదుపాయాలతో వారికి అందుబాటులోకి విద్యను తేవడం లక్ష్యంగా మనం నిర్దేశించుకోవాలి. విద్య సామాజిక వర్గాల అంతరాల్ని తగ్గించేదిగా వుండాలి కానీ పెంచేదిగా స్థిర పరిచేదిగా వుండరాదు. ఇలా చూచినపుడు "అందరికీ విద్య" అంటే అదొక మహత్తర సామాజిక విప్లవమే తప్ప ఆషామాషీ వ్యవహారం కాదు. నిజానికి సమాన అవకాశాలు కూడా చాలవు. పేదలకు ఎక్కువ అవకాశాలు కూడా వుండాలి. అలాగే విద్యను మిగిలిన అభివృద్ధి నుంచి విడదీసి కూడా చూడలేము. ఆర్థిక సామాజికాభివృద్ధితోపాటు అది పెనవేసుకొని వుంటుంది. నిష్ట దరిద్రాన్ని అలానే వుంచి, సాంస్కృతిక దారిద్ర్యాన్నీ అలానే పక్కనబెట్టి చదువు మాత్రం నేర్పిస్తామనడం పగటిపూట చుక్కల్ని లెక్కించడమే అవుతుంది.

ఇకపోతే ఆరోగ్యం, కుటుంబ సంక్షేమం, ఉత్పాదక సామర్థ్య-తదితరాలు ఒక సమాజం మొత్తం విద్యావంతం అయ్యేకొలదీ ఎంత అద్భుతమైన ప్రగతిని సాధిస్తాయో నేటి ఆర్థిక శాస్త్ర వేత్తలందరూ పలు కోణాల్నించి విశ్లేషించి "అక్షరాస్యతే అభివృద్ధి" అనికూడా సూత్రీకరిస్తున్నారు. అందువల్లనే సోషలిష్టు దేశాలు భూసంస్కరణల కిచ్చినంత ప్రాధాన్యత సార్వత్రిక విద్యకూ ఇచ్చారు. భావ వికాసం చైతన్యం భౌతికాభివృద్ధిని ఎలా ప్రభావితం చేస్తుందో గర్తించబట్టే అలా చేశారు.

స్వాతంత్ర్యానంతరం మన పాలకులకు, ఈ దృక్పథం లేనందువల్లనే మనం విద్యలో వెనకబడ్డాం తప్ప మనమేమీ అజ్ఞానులమో, మూర్ఖులమే అయినందువల్ల గాదు. పేదరికం, అధిక జనాభాలవల్ల అసలేగాదు. రాష్ట్రప్రభుత్వం మొదట ఈ దృక్పథాన్ని మనసా వాచా కర్మణా అంగీకరించాలి.

## ఇది సాధ్యం

అందరికీ విద్యఅంటే అందరికీ సమాన విద్య అనేదికూడా అర్థం. అది ప్రభుత్వ జోక్యంతోనే సాధ్యం. అది ప్రభుత్వ బాధ్యత కూడా. అందువల్ల ప్రభుత్వం ప్రాథమిక ఉన్నత వృత్తి సాంకేతిక విద్యల్లో దేనినీ నా బాధ్యత గాదని వదలించుకోరాదు. అలా చెయ్యడమంటే పైన చెప్పుకొన్న దృక్పథం నుంచి దూరం కావడమే. మన ఆర్థిక వనరులతో ఇది సాధ్యం కాదనే వాదనలో అర్థం లేదు. యుద్ధంలో చితికిపోయిన వియత్నాంకు, విసిరేసినట్టున్న క్యూబాకు, విశాలమైన చైనాకది సాధ్యంకాగా మనకు సాధ్యంగాక పోవడమేమిటి ?

## సామాజికోద్యమంగా విద్య

ఆర్థికాభివృద్ధితోపాటు విద్యాభివృద్ధి సమాంతరంగా సాగాలంటే ఏ శక్తులు మరింత మెరుగైన జీవితం కోసం పోరాటతున్నారో వారిని విద్యకోసం కూడా సమీకరించాల్సి వుంటుంది. వారి ఆశల ఆకాంక్షల జాబితాలో విద్యనుకూడా చేర్చాల్సి వుంటుంది. వారి ఉద్యమాలకు వ్యతిరేకంగా గానీ, దూరంగా గానీ విద్య వుండదన్ని మనం గుర్తించాలి.

ఒకవైపు వారిని మరింత దివాళా తీయిస్తూ, నడ్డి విరగకొడుతూ విద్యమాత్రం అందించాలని తహతహ పడుతున్నామనడంలో అర్థం లేదు. దీన్నెవ్వరూ నమ్మరు. ప్రజల భాగస్వామ్యం లేకుండా, వారు తమ అవసరంగా విద్యను గుర్తించకుండా ఎక్కడా అందరికీ విద్యసాధ్యం కాలేదు. అలా భాగస్వాములు కావాలని మనం కోరుకొంటే వారి ఆర్థిక జీవితాన్ని మొగుపరిచే క్రమంలో మాత్రమే అది జరుగుందని అంగీకరించాలి.

అధికార్ల హంగామాలు జనాన్ని కదిలించడం జరగదు. ప్రజల మధ్య వుండేవారు మాత్రమే ఆ పనిచెయ్యగలరు. ఇతర సామాజికోద్యమాల్లో వున్నవారు మాత్రమే ఈ కర్తవ్యం నేరవేర్చగలరని గుర్తించాలి. అలాంటి వారికి కొదవలేదుగానీ ప్రస్తుతం వారిని

వీలున్నంత దూరంగా వుంచి, కాగితాల కమిటీలతో, పాలక రాజకీయాల సంఘాలతో ప్రజాభాగస్వామ్యం సాధిస్తున్నట్లు బడాయి కొడుతున్నారు. ఈ విషయంలో ప్రస్తుతం కేరళలో చేపడుతున్న ప్రాథమిక విద్యలో ప్రజాస్వామిక కార్యక్రమాన్ని ఆదర్శంగా తీసుకోవచ్చు. ప్రజా ప్లానింగును పరిశీలించవచ్చు. సగటు పౌరులు టీచర్లు ఎంతటి అద్భుతాలు సాధిస్తున్నారో ఎంత ప్రజాభాగస్వామ్యం పొందగలిగారో చూడవచ్చు.

ఇరుగు పొరుగు కమిటీలు, టీచర్ల కమిటీలు, సెంటర్ క్లాసులు, పంచాయతీలు తల్లులు ఎక్కడికక్కడే ఏ పాఠం ఎలా వుండాలి ? ఏ పరీక్ష ఎలా జరపాలి ? అనేవి సైతం చర్చించుకొనే స్థితి కేవలం రెండేళ్ళలో వారు సాధించారు.

## నిధుల కేటాయింపులు

విదేశీ సొమ్ముతో అప్పులు తప్ప అందరికీ విద్య మాత్రం రాదని గుర్తించాలి. అమర్త్యసేన్, మన్మోహన్‌సింగ్ లాంటివారు కూడా జి.డి.పి.లో 6% విద్యకు కేటాయించడం సాధ్యమేనని అంగీకరించారు. రాష్ట్ర బడ్జెటులో కేరళ కేటాయించినంత కూడా మన ప్రభుత్వం కేటాయించడం లేదు. 16.7 శాతం మించింది ఎప్పుడూ లేదు. 30 శాతం కేటాయించాలి. అందులో 60 శాతం ప్రాథమిక విధ్య కివ్వాలి.

ఈ కేటాయింపు రెగ్యులర్‌గా జరిగితే పాఠశాలలకు వసతులు ఏర్పడుతాయి. తగినంత మంది టీచర్లుంటారు. వారికి శిక్షణ ఇతర వసతులు సమకూరుతాయి. మంచిబడి లేకుండా మంచి విద్య అందించడం అసాధ్యం. ఈ కేటాయింపు కూడా దీర్ఘకాలం జరగాలి.

## ప్రజలు చదువు కోరుకుంటున్నారు

ప్రజలు తమ పిల్లల్ని చదివించాలని కోరుకొంటున్నారు. వారికి చైతన్యం లేకుండా మనం సొమ్ము పెట్టడం దండగ అనే ఆర్థిక శాస్త్రవేత్తలు వాస్తవాన్ని చూడ్డంలేదు. అంతమాత్రాన వారిమీదనే భారం వేస్తే వారు మొయ్యలేరు. తిండినైనా మానుకొని చదివించుకొనాలనే చైతన్యం ఎక్కడావుండదు.

### పిల్ల చదువు కోసం తపన. తల్లిదండ్రుల శాతం

| విద్యాస్థాయి | బాలికలకు | బాలురకు |
|---|---|---|
| ఏమీ చదువు వద్దు | 7 | 1 |
| 5వ తరగతి దాకా | 3 | 0 |
| 8వ తరగతి దాకా | 18 | 3 |
| 10వ తరగతి దాకా | 15 | 28 |
| 10 కిపైన | 28 | 57 |
| (ఆధారం PROBE) | | |

## ఉన్నతవిద్య

ప్రాథమిక విద్య ఉన్నత విద్యకు పోటీగాదు. ఉన్నత విద్యకు పూర్వరంగమో, పునాదో మాత్రమే. కేవలం ప్రాథమిక విద్య మాత్రమే ఈ పోటీయుగంలో ఎందుకూ పనికిరాదు. సామాజిక దీర్ఘకాలికావసరాలను, శాస్త్రసాంకేతికావశ్యకతలను, సమున్నత విలువలను ఉన్నతవిద్యమాత్రమే సాధిస్తుంది. ఇది అందరికీ అందుబాటులో వుండాలి. అభివృద్ధి చెందిన దేశాలు సైతం యూనివర్శిటీలను అమ్మివెయ్యడం లేదు. మీ బ్రతుకు తెరువు మీరుసంపాదించుకొమ్మని చెప్పడం లేదు. ప్రైవేటు సంస్థలకు కూడా ప్రభుత్వం 70-80% సబ్సిడీ ఇస్తున్నాయి. జి.డి.పి.లో 6% , రాష్ట్రబడ్జెటులో 30% విద్యకు కేటాయిస్తే ఉన్నత విద్యారంగాన్ని కూడా ప్రభుత్వం నడపగలదు. అది దాని బాధ్యత కూడా.

సామాజిక శాస్త్రాలు చాలా కీలకమైనవి. ఉత్పత్తి మాత్రమే అభివృద్ధి గాదు. సామాజిక సంబంధాలెంతో విలువైనవి. సమాజాధ్యయనం భవిష్యత్తుకు తప్పనిసరి. పోటీలో నిలవడానికైనా ఇది అవసరం. అలాగే ప్రాథమిక సైన్సు కూడా. ఐన్‌స్టీన్ సాధారణ ఫిజిక్సు మాత్రమే చదివాడు. ఈ కోర్సులకు నిత్య జీవితంతో, ఉత్పాదకతతో లింకు ఏర్పరచవచ్చు. ఆవిధంగా వాటిని సరిచెయ్యాలి. అప్పుడు విద్యార్థులు వీటిని ఆదరిస్తారు. సమాజావసరాలతో నిమిత్తం లేని వృత్తివిద్యలు దండగ. ఏడాదికి 30 వేలమంది ఇంజనీర్లు తయారైతే ఏంచేస్తారు వీరంతా ? ఒక దూరదృష్టి, అంచనా లేకుండా సొమ్ము చేసుకొనడం కోసం క్రేజ్ సృష్టించి ఉన్నత విద్యను వ్యాపారం చెయ్యడం దుర్మార్గం. దీనిపై నిపుణుల అభిప్రాయాలు తీసుకోవాలి.

సెకండరీ, ఇంటర్మీడియేట్ రంగాల్లో వృత్తివిద్యలుండాలి. కానీ అవి ఉపయోకరంగా, అన్ని ఏర్పాట్లతో వుండాలి. దీనిలోని లోపాల్ని గతంలో పరామర్శించాం. పంజాబ్, తమిళనాడు రాష్ట్రాల కుటీర పరిశ్రమల్ని అధ్యయనం చెయ్యడం దీనకెంతైనా ఉపకరిస్తుంది.

## సమాంతర వ్యవస్థలు

ప్రభుత్వ పాఠశాల కళాశాల వ్యవస్థలను పటిష్టం చేసేదిగానే ఏ పథకమైనా వుండాలి. కొన్ని పథకాల్ని సామాజికోద్యమ కారులు నిర్వహించవచ్చు. ఆదర్శం చూపవచ్చు కానీ అది ప్రభుత్వ వ్యవస్థకు ఉపకరించాలి. ఈ వ్యవస్థ మాత్రమే శాశ్వతమని గుర్తించాలి.

మన బడులు, ప్రత్యామ్నాయ పాఠశాలలు తాత్కాలిక ప్రయోజనం పాధించితే సాధించవచ్చు, (అదీ అనుమానమే) అంతకు మించి ఫలితం వుండదు. సువ్యవస్థితమైన బడి,సుశిక్షితులైన ఉపాధ్యాయులు, మంచి బోధన మాత్రమే మన విద్యా లక్ష్యాన్ని నెరవేర్చగలవు. ప్రజల భాగస్వామ్యం, వికేంద్రీకరణ అనేవి ప్రభుత్వ వ్యవస్థకు దోహదపడేవి తప్ప ప్రత్యామ్నాయాలుగా భావించరాదు.

కోరుకొండ, గుడిలోవ, నవోదయ స్కూలులకు అత్యుతమ శిక్షణా సంస్థ

# త్రిశూల రమణా ట్యుటోరియల్

[illegible]

బాలాజీనగర్, విజయనగరం - 535003, ఫోన్: (08922) 2542[illegible]




- కోరుకొండ 6వ తరగతి మరియు 9వ తరగతుల ప్రవేశ పరీక్షలకు ప్రత్యేక శిక్షణ.
- ప్రతీ విద్యార్థిపై ప్రత్యేక శ్రద్ధ. పరిమితమైన విద్యార్థుల సంఖ్య. (బ్యాచ్‌కు 30 సీట్లు).
- ఆహ్లాదకరమైన స్వంత భవనములలో బాలబాలికలకు వసతి సౌకర్యం.

**1999-2000 సంవత్సరమునందు మా విద్యార్థుల ప్రతిభ**

- కోరుకొండ 9 మరియు 6వ తరగతుల ప్రవేశపరీక్షలలో స్టేట్‌లో మొదటి ర్యాంకు, మూడవ ర్యాంకు మరియు ఆరవ ర్యాంకులతోపాటు స్టేట్‌లో 28 ర్యాంకులు
- గుడిలోవ ప్రవేశ పరీక్షలో 30కి 26 సీట్లు
- నవోదయ ప్రవేశ పరీక్షలో 31 కి 26 అత్యుత్తమ ఫలితాలు సాధించిన ఏకైక కోచింగ్ సెంటర్.

**అడ్మిషన్లు ప్రారంభమైనవి** | **వివరములకు సంప్రదించండి**

**V.S.N. KUMAR,** Trisul Ramana Tutorials, Balaji Nagar, Vizianagaram. Ph: 25423

---

**TOP IN TOWN -**
**TALK OF THE TOWN**
**GAYATRI'S MILLENNIUM**
**" HATTRICK"**

Ph: 20497,23497



# GAYATRI JUNIOR COLLEGE

(Recognised by Govt. of A.P.)

Near B.T. Complex, Totapalem, Vizianagaram

**Hattrick**

**1998- 950/1000 District Topper 19**

**1999 - 927/1000 Top in the town**

**1999 - 444/ 470**

Courses offered: Intermediate: I & II year - Groups: MPC, Bi.P.C., Medium: Telugu & English

Intermediate with parallel EMACET - EAMCET long & Short term

Gayatri Degree College proposed to start with 3 science & one arts groups.

- MPC (Maths, Physics, Computers) • CBZ • B.A. (History, Economics, Politics)

## తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి



# బాలాజి వికలాంగుల సంస్థ (బర్డ్)

## నిరంతర సేవా కార్యక్రమం

తిరుమల తిరుపతి దేవస్థానం వారు, శారీరక వికలాంగులతో బాధపడువారికి సేవచేస్తూ, ఉపశమనం కలుగచేయుటకొరకై బాలాజీ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ సర్జరీ రీసెర్చి అండ్ రిహాబిలిటేషన్ ఫర్ ది డిసేబుల్డ్ (బాలాజీ వికలాంగుల సంస్థ) సంస్థను స్థాపించింది. ఈ సంస్థ తి.తి. దేవస్థానం చేస్తున్న మానవసేవకు ప్రధాన ప్రతీక.

1985లో స్థాపింపబడిన బర్డ్ సంస్థ ఆర్థోపెడిక్స్. (శల్యవైద్యం) రంగంలో అనేక విధాలుగా కృషి చేస్తున్నది. కాన్‌జెనిటల్ అనోమలిస్, సెరిబ్రాల్ పల్సీ రోగులు మరియు పోలియో వ్యాధిగ్రస్తులకు ఈ ఆసుపత్రిలో విలువైన చికిత్సను చేస్తూ, నిరుపేదల సేవలో అంకితమై పూర్తి బాధ్యతలతో సేవలందిస్తున్నది.

**బర్డ్ ప్రధాన అంశములు**

- ఆధునిక సాంకేతిక పరిజ్ఞానం ఉపయోగించి పోలియో వ్యాధి గ్రస్తులకు శస్త్రచికిత్స చేయడం.
- 300ల పడకల సామర్థ్యంతో, నాలుగు ఆపరేషన్ థియేటర్లలో ఎయిర్‌కండిషన్‌తో కూడిన ఆసుపత్రి.
- ఉచితంగా కృత్రిమ అవయవాల వితరణ, సహాయము, ఊతమందించుట.
- బర్డ్‌కు అందించే అన్ని విరాళాలపై ఆదాయపు పన్ను చట్టం సెక్షన్ 80 (జి) క్రింద పన్ను మినహాయింపు.
- 5 లక్షల రూపాయలిచ్చిన దాతల పేర్లు ఫోటోలతో కూడ బర్డ్ ఆసుపత్రిలో ఏర్పాటు చేయబడతవి.
- ఒక సంవత్సరంలో (క్యాలెండర్ ఇయర్) 5 మందికి 3 రోజులపాటు ఉచిత దర్శనం. హారతి కల్పించబడుతుంది.
- రు.10 లక్షలు లేదా పైగా విరాళమిచ్చినత దాత పేరు మీద ఒక గది నిర్మించబడుతుంది.
- రు.5 లక్షలు, రు.10 లక్షలు విరాళమిచ్చిన దాతలకు శ్రీ వేంకటేశ్వరస్వామి, శ్రీ పద్మావతి అమ్మవారల వెండి బొమ్మలు గల మెమెంటోలు ఇవ్వబడును.

సహృదయులైన దాతలు మరియు సామాన్య ప్రజలు బర్డ్ కు అందచేసే విరాళాలు వివిధ ప్రాజెక్టుల అమలు, ఉచితంగా కృత్రిమ అవయవాల సరఫరా, ఉచితంగా ఆహారం, తగ్గింపు రేట్లతో రోగులకు ప్రయాణ సౌకర్యాలు కల్పించుటకు వినియోగించడం జరుగుతుంది.

**విరాళాలను:** కార్యనిర్వహణాధికారి, బర్డ్ ట్రస్ట్, తి.తి. దేవస్థానములు, తిరుపతి- 517501 వారి పేరుతో డిమాండ్ డ్రాఫ్టుల ద్వారా పంపవచ్చును.

కార్యనిర్వహణాధికారి, తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి-517501



**BRUNDA HOUSING (P) LIMITED is a Professionally Managed Company with an out-standing performance in Real Estate Trade, with dedicated marketing team backed by personnelised service. You as a coustomer will be assured the best customer services you can expect off.**

**BRUNDA HOUSING (P) LIMITED has completed successfully different Ventures around Tirupati.**

**Now we are proud enough to release the present prestigious Layout " SAI PREMA"**




# Own your plot for just Rs. 900/- per month



MAKING DREAMS EASIER

For further details please contact: **MARKETING DIVISION**

*Brunda Housing (P) Ltd.,*

NO.15, R.C. Road, TIRUPATI. PH: 42920, 42758

501

ప్రస్తుత గ్రామ కమిటీలు బాధ్యతల్లేనివి.. నిధులు అసలే లేనివి ఇవి బడికి తల్లిదండ్రులకు జవాబుదారీగా వుంటే, తోడు నిలబడితే అందరం ఆహ్వానిస్తాం. పెత్తనం మాత్రమే చేస్తామంటే కుదిరే పనిగాదు. కేరళ పంచాయతీ వ్యవస్థను, కమిటీలను దీనికాదర్శంగా తీసుకోవచ్చు.

## బాలకార్మిక వ్యవస్థ

మన దేశ రుగ్మతల్లో బాలకార్మిక వ్యవస్థ చాలా తీవ్రమైంది. దీన్ని విస్తృతంగా అధ్యయనం చేసిన మైరన్ వైనర్ ఇలా విశ్లేషించాడు. " కార్మిక వ్యవస్థ నుంచి బాలకార్మికులను తొలగించివేసి, సార్వత్రిక నిర్బంధ ప్రాథమిక విద్యను అమలుచేసే దిశలో ప్రపంచ వ్యాప్తంగా పెరుగుతున్న ధోరణికి భారతదేశం ఒక మినహాయింపు. దీనికి కారణం సామాజిక వ్యవస్థపట్ల భారతీయుల దృక్పథం. సమాజంలోని ఉన్నత, అల్పవర్గాల పాత్రపై ఉన్న అభిప్రాయాలూ, వివిధ సామాజిక వర్గాలపట్ల అంతరాలను కొనసాగించేదిగా విద్య ను భారతీయులు పరిగణిస్తున్నారు."అధిక", "అనుచిత" విద్యలభించడం వల్ల ప్రస్తుత సామాజిక స్థితిగతులు దెబ్బతింటాయనే ఆందోళన భారతీయ దృక్పథంలో భాగం" అందువల్ల ఉపదేశాలతో నిషేధాలతో బాలకార్మిక వ్యవస్థపోదు. అదొక సామాజికార్థిక సమస్య. ఒక మేరకు సాంస్కృతిక సమస్య కూడా కావచ్చు. వీరి కందరికీ పునరావాసం కల్గించాలి. వీరు చదువుకొంటే మరింత మెరుగ్గా బతుకుతారని నమ్మకం కల్గించాలి. అన్ని వసతులతో వీరికి భద్రత ఏర్పరచాలి. తల్లిదండ్రుల్ని గాదు శిక్షించాల్సింది బాలబాలికల చేత పనిచేయిస్తున్న వారిని శిక్షించాలి ఈ విషయంలోఎం.వి.ఎఫ్ ఆదర్శం అందరికీ కళ్ళు తెరిపిస్తుంది., ఒక చిన్న సంస్థ సాధించింది ప్రభుత్వం ఎందుకు సాధించలేదు ? సామాజిక సేవా సంస్థల్ని, కార్యకర్తల్ని దీనికి విస్తృతంగా వినియోగించుకోవాలి.

## సిలబసు, బోధనా పద్ధతులు

నేడు పాఠ్యగ్రంథ రచనలో, బోధనా పద్ధతుల్లో ఎన్నో మార్పులు వచ్చాయి. ఎన్నో పరిశోధనలు ప్రయోగాలు జరుగుతున్నాయి., వీటితో మన పాఠశాలలకు సంబంధం లేదు. మన టీచర్లకివి అందుబాటులో లేవు., ఏకశిలా సదృశ శిక్షణా పరిశోధనా వ్యవస్థ వల్ల సృజనాత్మకత వికసించదు. పాత, మొరటు పద్ధతులవల్ల పిల్లలకు ఎనలేని హాని కల్గుతుంది. ఈ శ్రమ పిల్లల్ని బడినుంచి బయటకి నెడుతుంది.

దీనికోసం ఈ రంగంలో విస్తృత కృషి చేసినవారి ఫలితాల్ని వాడుకోవాలి. ఈ విషయంలో మధ్యప్రదేశ్ ప్రభుత్వం ఏకలవ్య. దిగంతర్‌లను వాడుకొన్న తీరు గమనించదగింది.

మంచి టీచర్లను ప్రోత్సహించడం ద్వారా, వారి అనుభవాల్ని క్రోడీకరించడం ద్వారా, వారికి ఒక మార్గ దర్శకత్వమిచ్చి తగినంత స్వేచ్ఛ నివ్వడం ద్వారా ఈ అంశాల్లో అద్భుతమైన మార్పులు తేవచ్చు. వికేంద్రీకరణనూ సాధించవచ్చు. కేరళ అనుభవం ఈ విషయంలో వుండనే వుంది.

మన పాతబోధనా ధోరణి ఒకవైపు మన ప్రమాణాలకే గాక మరోవైపు డ్రాపవుట్స్‌కు సైతం కారణమవుతోంది. అంతేగాదు పాఠశాలలో పిల్లలకు భద్రత, పిల్లల ప్రపంచం, బోధనలో ఆహ్లాదం అనేవి ప్రజాస్వామిక సంస్కృతికి లక్షణాలు. అదొక మహత్తరమైన విలువగల అంశం. దీనికి తగ్గ ప్రాధాన్యత లేకపోవడం మన వ్యవస్థలోని పెద్ద బలహీనత. దేనిపై జరగాల్సినంత పరిశోధనగానీ, ఇతరుల నుంచి స్వీకరించే సంప్రదాయంగానీ లేకపోవడం విచారకరం. ఏకలవ్య, దిగంతర్, రుషీవాలీ వంటి సంస్థల్నించి ఎంతేనా మనం స్వీకరించవచ్చు గానీ వీటిని మన టీచర్లు స్వాయత్తం చేసుకొని స్థానికావసరాల కనుగుణంగా మార్చుకొనే ఏర్పాటు స్వతంత్రత వుండాలి. సిలబసు భారం తగ్గించాలి. ప్రామాణికతను పెంచాలి.

## కొన్ని ధోరణులు

కొట్టవచ్చినట్టుగా ఇటీవల కొన్ని ధోరణులు కన్పిస్తున్నాయి. ప్రభుత్వ పాఠశాలలపట్ల నమ్మకం ప్రజలకు సడలిపోతోంది. ప్రైవేటు స్కూళ్ళపై, ఇంగ్లీషు భాషపై వ్యామోహం పెరుగుతోంది. వినిమయ సంస్కృతి విద్యపై కూడా ప్రసరించింది. ఇటీవలి గణాంకాలు ప్రభుత్వ స్కూళ్ళలో పిల్లల సంఖ్య బాగా తగ్గుతున్నట్టు తెలుపుతున్నాయి. ఒక్క నెల్లూరు జిల్లాలోనే గత ఏడాది కంటే ఈ సంవత్సరం 25,000 మంది పిల్లలు తగ్గిపోయారు. ఇలా ఎందుకు జరుగుతున్నట్టు ?

ఇప్పటికే ఉపాధ్యాయ విద్యార్థి నిష్పత్తి 1:35 కు వచ్చేసిందని చెపుతున్నారు. ఇక టీచర్ల నియామకపు అవసరం వుండదని లెక్కలు వేస్తున్నారు. కేరళలో 'Protected Teachers' అనే జాతి వుంది. వీళ్ళకు పనిలేదు. అందువల్ల దయతలచి ప్రభుత్వం ఊడబెరకకుండా కాపాడుకొస్తోంది. ఇదే 'Protected Teachers' అంటే. ఈ పరిస్థితి 4-5 సంవత్సరాలలో మనకూ వచ్చేసేలా వుంది. మున్సిపాలిటీలు ఇప్పుడే ఈ దారిలోకి వచ్చేశాయి.

గుర్తుంచుకోడమే నేర్చుకోడంగా, పరీక్షలే పరమావధిగా మన చదువులు మారాయి. గొంతులు కోసుకొనే పోటీ దీనికి తోడైంది. ఇది అత్యంత అశాస్త్రీయం అని తెలిసికూడా అందరూ అటే కొట్టుకొని పోతున్నారు., పిల్లల సృజనాత్మకత, వికాసం దీనివల్ల తీవ్రంగా దెబ్బతింటున్నాయి. దీనివల్ల విద్యాలక్ష్యమే అడుగంటుతోంది.

దీన్ని అధిగమించాలంటే ముందు ప్రభుత్వ పాఠశాలలు బాగుపడాలి. వీటిపై పర్యవేక్షణ పెరగాలి. వసతులు ఏర్పడాలి. వాటిని గురించిసమాజం అంతా పట్టించుకోవాలి. అప్పుడు వీటిమీద నమ్మకం ఏర్పడుతుంది. తెలుగు మీడియం ఫలితాలు మెరుగ్గా వుంటే ఇతరత్రా మోజుతగ్గుతుంది., అలాగే ప్రైవేటు పాఠశాలలను విపరీతంగా ఆమోదించడం, ప్రోత్సహించడం వల్లకూడా

వ్యాపారావసరాలకు అనుగుణమైన వాతావరణాన్ని వాళ్లు సృష్టిస్తున్నారు. దాన్ని ప్రభుత్వం గుర్తించాలి. ఉపాధ్యాయులంగా మనం ప్రజలతో కలిపి దీనిపై పోరాడాల్సి వుంది.,

## పర్యవేక్షణ

ప్రభుత్వ విద్యావ్యవస్థ టీచర్ల జీతాలు చెల్లించే పని తప్ప మరేమీ చెయ్యలేనిస్థితిలో వుందని ఒక నింద వుంది. దీనికి కారణం అకడమిక్ వ్యవహారాలు చూడడానికి, పర్యవేక్షణకు తగిన యంత్రాంగం లేకపోవడం. ఒక మంచి వ్యవస్థ పటిష్టమైన పర్యవేక్షణా నియంత్రణతోనే సాధ్యం. దీనికి నిధులకు కొరత అనడం విచిత్రం. మండల విద్యాశాఖాధికార్లు అకడమిక్ ఆఫీసర్లుగానే వుండాలి.

దీనితో పాటు వ్యవస్థలో వీలైనంత వికేంద్రీకరణ జరగాలి. అన్ని పనులు ఒకే చోట జరిగేలా ప్రస్తుత వ్యవస్థ వుంది. దీనివల్ల ఆలస్యం , రెడ్‌టేపిజం, అస్తవ్యస్తత తప్ప మరేదీ వుండదు. దీనిపై ఉపాధ్యాయ సంఘాల సలహాల్ని పాటించాలి.

విద్యావ్యవస్థ ఎంత ప్రజాస్వామిక లక్షణాలతో వుంటే అంతగా ప్రజల్ని కదిలించగల్గుతుంది. అనుకొన్న సామాజిక లక్ష్యాల్ని సాధించగల్గుతుంది. స్వాతంత్ర్యానంతర భారతదేశంలో కూడా బ్రిటిష్ విధానమే కొనసాగడం దురదృష్టకరం. విప్లవాత్మకమైన మార్పులు వ్యవస్థాగతంగా, అధికార యంత్రాంగంలో రాకుండా వికేంద్రీకరణ, ప్రజాభాగస్వామ్యం, సృజనాత్మకత అనేవి రావు.

## ముగింపు

ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్ సామాజిక బాధ్యతగల సంస్థ. అందరికి విద్యను తన పాలసీగా నిర్వచించుకొన్నసంఘం . తన కర్తవ్యంగానే అది దీనికి అంకితమై వుంది. దీనికోసం ఉపాధ్యాయుల్ని చైతన్యపరచడంలో, వారికి మార్గదర్శకత్వం నెరపడంలో యు.టి.యఫ్.ఎప్పుడూ వెనకాడదు. వెనుకాడలేదు. ప్రభుత్వం ఈ వైపు తీసుకొన్న చర్యలన్నింటికీ మన మద్దతు వుంటుంది.

కానీ అసలు లక్ష్యానికి వ్యతిరేకంగా తీసుకొనే నిర్ణయాల్ని, విధానాల్ని వ్యతిరేకించడం కూడా ఈ కర్తవ్యంలో భాగంగానే మనం చూస్తాం. ఆ వైపు ప్రజల్ని సమీకరించడంలోనూ మనం ముందుంటాం. ప్రభుత్వ విద్యారంగాన్ని కాపాడుకోవడం కోసం ప్రజాఉద్యమాలతోనూ మనం మమేకం అవుతాం.

అదే సందర్భంలో వస్తున్న పరిణామాలపట్ల ఒక స్పష్టమైన అవగాహన, దానికి తగినట్టు ఉపాధ్యాయ లోకాన్ని చైతన్యపరచడం మన నిరంతర కర్తవ్యంగా వుండాలి. మంచి ధోరణుల్ని మనం ప్రోత్సహించాలి. నిర్మాణాత్మకంగా వ్యవహరించాలి. అందరికీ విద్య అందరికన్నా ముందు మన బాధ్యతగా మనం స్వీకరించాలి.

## నిబంధనావళి సవరణలు

2000 జనవరి 20 మహాసభలలో ఆమోదించినవి.

2). విధులు (2) ప్రధాన కార్యదర్శి (3) లో

" ఫెడరేషన్ ధనమును ప్రతి విభాగమునకు వేర్వేరు అకౌంట్ల క్రింద కౌన్సిల్ అమోదించిన బ్యాంకులలో నిల్వచేయవలెను. "అనునది ఈ క్రింది విధముగా మార్పు చేయబడినది.

ఐక్యఉపాధ్యాయ ఫెడరేషన్ డబ్బు సంఘ ప్రధాన కార్యదర్శి, ట్రెజరరు పేర్లతోను, ఐక్యఉపాధ్యాయ పత్రిక డబ్బు ప్రదాన సంపాదకుడు, ప్రదాన కార్యదర్శి పేర్లతోను కౌన్సిలు అమోదించిన బ్యాకులలో అకౌంటు తెరచి భద్ర పరచవలెను, ఇద్దరి సంతకములతోనే డబ్బు తీయవలెను.

4 ఐక్య ఉపాధ్యాయ ప్రచురణలకు సంబంధించిన డబ్బు సంఘ ప్రధాన కార్యదర్శి సంఘ అధ్యక్షుడు ఇద్దరి పేర్లతో జాయింటు అకౌంటు తెరిచి భద్రపరచవలెను. ఇద్దరి సంతకములతోనే డబ్బు తీయవలెను.

### 3). (ఇ) "కార్యదర్శి వర్గము" అనుదానికి ఈ క్రింది సవరణ

" ఫెడరేషన్‌కు గౌరవాధ్యక్షుడు, అధ్యక్షుడు, సహాధ్యక్షుడు, ప్రధాన కార్యదర్శి, కోశాధికారి, కార్యదర్శులు మొత్తం 16 మంది కార్యదర్శి వర్గముగా నుందురు.

### 4). విధులు (ఈ) కోశాధికారి

" ఫెడరేషన్ జమా ఖర్చుల భాధ్యత వహించును"

అనుదానికి బదులు ఈ క్రింది వాక్యమును చేర్చవలెను.

"సంఘ ప్రధాన కార్యదర్శి సంఘ కోశాధికారి ఇద్దరి పేర్లతో జాయింటు అకౌంటు తెరిచి, సంఘమునకు సంబంధించిన డబ్బు భద్రపరచవలెను. ఇద్దరి సంతకములతోనే డబ్బు తీయుచుండవలెను. ఇది జిల్లామండల శాఖలకు కూడా వర్తించును."

### 5). లో 7 జిల్లా శాఖల నిర్మాణం

" కార్యదర్శి వర్గ సభ్యుల సంఖ్య 15 కు మించకుండా కనీసం ఒక మహిళ అయినా ఉండేలా ఎన్నుకోవలెను.

అనుదానికి ఈ క్రింది వాక్యం కలుపవలెను.

"జిల్లా సభ్యత్వం 7,000 దాటితే ఈ సంఖ్యకు మరొక రెండు అనంగా కార్యదర్శి వర్గం 15 కు బదులు 17 గా ఉండును.

# ఆంధ్రప్రదేశ్ ఐక్యఉపాధ్యాయ ఫెడరేషన్ రజతోత్సవ, విద్యావైజ్ఞానిక మహాసభలు ఆమోదించిన తీర్మానములు

## సంతాప తీర్మానాలు

1. బహుభాషాకోవిదుడు, ప్రజాస్వామ్యవాది మాజీ భారతరాష్ట్రపతి శ్రీ శంకరదయాళ్‌శర్మగారు అసువులు బాసారు.
2. మాజీ ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు, మన పాఠశాల విద్యాశాఖామాత్యుడు శ్రీ దేవినేని వెంకటరమణ, రాష్ట్రమాజీ స్పీకరు శ్రీ డి. శ్రీపాదరావు గార్లు కన్నుమూసారు.
3. మహిళా ఉద్యమనేత కామ్రేడ్ విమలా రణదివే, ఉపాధ్యాయ ఉద్యమ నాయకుడు, మాజీశాసనమండలి సభ్యుడు మధురాంతకం మాదవరావు అమరులయ్యారు.
4. ప్రముఖ రచయిత మధురాంతకం రాజారాం, జర్నలిస్టు వాకాటి - పాండురంగారావు నాదస్వరబ్రహ్మ షేక్ చినమౌలానా, కళాతపస్వి - సంజీవదేవ్, సంగీత సామ్రాట్ సాలూరరాజేశ్వరరావు, ఆంధ్రజాలరి సంపత్‌కుమార్, రాజకీయ హరికథా విద్వాంసుడు సలాది భాస్కరరావు గార్లు కీర్తిశేషులయ్యారు.
5. కార్గిల్ పోరాటంలో దేశమాతకోసం వందలాది మంది సైనికులు బలిదానం చేశారు.
6. గైసాలు రైలు ప్రమాదంలో, ఒరిస్సా భీకర తుఫానులో వేలాది మంది ప్రాణాలు కోల్పోయారు.
7. మన ఉద్యమ కార్యకర్తలు యస్. వి. రమణప్రసాద్- ఖమ్మం, చంద్రశేఖర్ -చిత్తూరు, బడేసాహెబ్ - ఖమ్మం, బి.వి. సుబ్బారెడ్డి -ప్రకాశం, బి. హనుమంతరెడ్డి - నెల్లూరు, టి. రామయ్య - కరీంనగర్ డి. సత్యనారాయణ రాజు, ఆంజనేయరాజు - తూర్పుగోదావరి, నాగేశ్వరరావు - పశ్చిమగోదావరి.

**ఈ మహాసభ వీరందరికీ శ్రద్ధాంజలి ఘటిస్తోంది.**

## విద్యావిషయక తీర్మానములు

**1. విద్యను ప్రాథమిక హక్కుగా గుర్తించాలి :** మన రాజ్యాంగం ఆర్టికల్ 45 ప్రకారము 14 సం॥లోపు వయసుగల పిల్లలందరికి విద్యనందించడం ప్రభుత్వబాధ్యత. ఆర్టికల్ 24 ప్రకారం 14 సం॥ల లోపు వయసుగల పిల్లలెవ్వరిని ఏపనులలోను నియమించరాదు. 1992 డిశంబరులో జరిగిన ప్రపంచదేశాల "కన్వెన్షన్ ఆన్ ది రైట్స్ ఆఫ్ దిచైల్డ్" చేసిన తీర్మానమును మన ప్రభుత్వం కూడా అంగీకరించినది. అయితే వీటి అమలుకు కేంద్ర, రాష్ట్రప్రభుత్వాలు చిత్తశుద్ధితో చర్యలు గైకొనలేదు. కావున "విద్యను ప్రాథమిక హక్కు"గా చూస్తూ రాజ్యంగ సవరణ చేయాలని యీ మహాసభ డిమాండు చేస్తున్నది.

**2. 2005 సం॥నాటికి అందరకి విద్యను అందించాలి :** రాష్ట్రప్రభుత్వం 1990 మార్చి 5 నుండి 9వరకు థాయిలాండులోని జాంటిన్ పట్టణంలో "అందరికి విద్య" అనే అంశముపై ఐక్యరాజ్యసమితి నిర్వహించిన ప్రపంచ దేశాల సదస్సు 2000 సం॥నాటికి యీ లక్ష్యాన్ని సాధిస్తామని ప్రకటించినదానికి అనుగుణంగా డి.పి.ఇ.పి. నిధులతో పాటు కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు తగినన్ని నిధులను కేటాయించాలి. అందరి సహకారం తీసుకొని చిత్తశుద్ధితో కృషిచేయాలి.

2005 సం॥నాటికి అందరికి విద్యను అందించాలని చర్చకు పెట్టిన ముసాయిదా పత్రం ఆచరణ సాధ్యం కావాలంటే అవసరమైన నిధులు కేటాయించి అన్ని ప్రభుత్వశాఖలు, రాజకీయ పార్టీలు, స్వచ్ఛందసంస్థలు, ఉపాధ్యాయులను భాగస్వాములుగా చేయాలి. అట్లే పిల్లలు బడిలో చేరకపోవడానికి, మానివేయడానికిగల కారణాలను విశ్లేషించి, అందుకు అనుగుణంగా చర్యలు చేపట్టాలి. ఈలక్ష్యసాధనకై సాగేకృషికి ఐక్యఉపాధ్యాయ ఫెడరేషన్ సంపూర్ణ మద్దతును యీ మహాసభ ప్రకటిస్తోంది.

**3. గ్రామ విద్యాకమిటీలు సలహా సంఘాలుగానే వుండాలి :** రాష్ట్ర ప్రభుత్వం అమెరికా, బ్రిటన్ వంటి దేశాల అనుభవాలను దృష్టిలో పెట్టుకొని ప్రాథమిక విద్యా నిర్వహణను గ్రామవిద్యాకమిటీలకు అప్పగించే ఏర్పాటు చేస్తున్నది. విజన్ 2020 లో యీ అంశం స్పష్టపరచబడింది. అభివృద్ధిచెందిన దేశాల పరిస్థితులకు, భారతదేశ ఆర్థిక, సామాజిక పరిస్థితులకు మధ్యగల అంతరాన్ని విజన్ 2020 గర్తించడం లేదు.

మన గ్రామీణ ప్రజలు 70 శాతం నిరక్షరాస్యులు, 40 శాతం దారిద్ర్యరేఖకు దిగువన వున్నవారు తమ పిల్లలకు స్వయంశక్తితో విద్య చెప్పించుకొనేస్థితిలో వారు లేరు. పైగా మన గ్రామీణ రాజకీయాలు ఆరోగ్యవంతమైన ప్రజాతంత్ర పద్ధతిలో లేవు. అందువల్ల గ్రామ విద్యాకమిటీలకు పాఠశాల నిర్వహణ బాధ్యతలను అప్పగించడం సత్ఫలితాలను యివ్వదు. కనుక అవి సలహా సంఘాలుగానేవుండి. పాఠశాలలుభౌతిక వసతులు మెరుగు పడేదానికి సహకారులుగా వుండాలని యీ మహాసభ కోరుతోంది.

**4. విద్యాప్రమాణాలు మెరుగు వరచాలి :** పబ్లిక్ పరీక్షల ఫలితాల ఆధారంగా ప్రైవేటు పాఠశాలలతో పోటీపెట్టి ప్రభుత్వ పాఠశాలల్లో విద్యాప్రమాణాలు పడిపోతున్నాయనే దుష్ప్రచారం జరుగుతోంది. విద్యార్థి సంపూర్ణమూర్తి మత్వ వికాసాన్ని గాని, దేశభక్తి , నైతిక విలువలు, లౌకికతత్వం పెంపుదల, అవసరాన్ని గాని గుర్తించక పరీక్షా ఫలితాలే పరమావధిగా భావించడం సరిగాదు. విద్యాప్రమాణాలు పెరగాలంటే యీ క్రింది చర్యలు చేపట్టాలని యీ మహాసభ ప్రభుత్వాన్ని కోరుతోంది.

1. అవసరాలకు అనుగుణంగా పరిమితమైన సిలబస్‌వుండాలి. 2. విద్యార్థి, ఉపాధ్యాయ నిష్పత్తి శాస్త్రీయంగా వుండాలి. 3. అన్ని సబ్జక్టులకు శిక్షణ పొందిన ఉపాధ్యాయులుండాలి. 4. పరీక్షా విధానం విద్యార్థి పరిజ్ఞానాన్ని పరీక్షించేదిగా వుండాలి. 5. డ్రాపవుట్స్ లేకుండా చూడాలి.

6. ఉపాధ్యాయులకు తగిన వృత్యంతర శిక్షణ నివ్వాలి. 7. కొఠారి, చటోపాధ్యాయ ,కమిషన్లు సూచించిన విధంగా ఉపాధ్యాయుల జీవన ప్రమాణాలు మెరుగుపరచాలి.

**5. విద్యా వ్యాపారాన్ని అరికట్టాలి :** సరళీకృత ఆర్థిక విధానాలనేపద్యంలో ప్రాథమిక విద్య వరకు మాత్రమే ప్రభుత్వ బాధ్యత, ఉన్నత విద్యాబాధ్యతలనుండి ప్రభుత్వం వైదొలగనున్నదని ప్రకటన లిస్తున్నారు. దీనికి తోడు ప్రభుత్వ సర్టిఫికేట్లకు విలువ లేకుండా అన్ని కోర్సులకు ఎంట్రెన్స్ విధానం రావడంతో ప్రైవేటు విద్యాసంస్థల వ్యాపారం అభివృద్ధి చెందినది. పేపరు లికేజి, కాపీయింగు, వాల్యుయేషన్ అక్రమాలతో సహా అన్ని రకాల అవినీతి పనులను వారు చేపడుతున్నారు.

ప్రత్యేక కోచింగ్ పొందితే తప్ప తమ పిల్లలకు ప్రవేశ పరీక్షలద్వారా పైచదువులు చదవడానికి సీట్లు రావనే భయాన్ని తల్లిదండ్రలకు కలుగజేస్తున్నారు. ఆవిధంగా ప్రైవేటు విద్యాసంస్థలలో చేరడానికి ఎగబడే పరిస్తితిని కలుగజేసి విపరీతంగా ఫీజులు గుంజుతున్నారు. దీనికి తోడు ప్రభుత్వ పాఠశాలలలో పనిదినాలు పడిపోవడం, అన్ని సబ్జక్టులు బోధించే ఉపాధ్యాయులు లేకపోవడం కారణంగా ఆర్థిక స్తోమతగల వారంతా ప్రైవేటు పాఠశాలలకు వెళ్ళిపోయే వాతావరణం కల్పిస్తున్నారు. దీనివలన ధనికులకొక చదువు, పేదలకొక చదువు అనే పరిస్థితి ఏర్పడి సామాజిక సమతుల్యం దెబ్బతింటుంది,

వర్థమాన దేశాల అభివృద్ధికి కనీసం 20 శాతం పైన డిగ్రీ చదివిన వారుండాలనే అభిప్రాయానికి భిన్నగా 4 శాతం మాత్రమే మన దేశంలో వున్నారు. కనుక ఉన్నత విద్యను ప్రైవేటీకరించే విధానాన్ని విడనాడి. ఉన్నత విద్యా బాధ్యత కూడా ప్రభుత్వమే చేపట్టాలని, విద్యావ్యాపారాన్ని అరికట్టాలని యీ మహాసభ ప్రభుత్వాన్ని డిమాండు చేస్తోంది.

## సాధారణ తీర్మానాలు :

1. కేంద్ర ప్రభుత్వం జి.డి.పి.లో 6 శాతం, రాష్ట్ర ప్రభుత్వం బడ్జెటులో 30 శాతం నిధులు విద్యకు కేటాయించాలి.
2. ప్రజల అవసరాలు, విద్యార్థుల స్థాయి. దేశాభివృద్ధికి అనుగుణంగా సిలబస్ మార్చాలి.
3. అప్రంటీస్, వాలంటరీ విధానాలు రద్దు చేసి డి.యస్.సి. ద్వారా రెగ్యులర్ టీచర్లనే నియమించాలి .
4. మాతృభాషలో బోదనను ప్రోత్సహించాలి.
5. ఇంగ్లీషు, ఫిజికల్ సైన్సుల్లో బోధించడానికి ప్రత్యేక గాడ్యుయేట్లను నియమించాలి.
6. 1985 తర్వాత అప్‌గ్రేడ్ అయిన అన్ని స్థానికసంస్థల ప్రాథమికోన్నత, ఉన్నత పాఠశాలలకు గ్రాంటు-ఇన్-ఎయిడ్ మంజూరు చేయాలి.
7. అన్ని అప్పర్ ప్రయిమరీ పాఠాశాలలలో పండితులు, పి.ఇ.టి.లు బి.యిడి. టీచర్లను నియమించాలి.
8. విద్యార్థులకు సిలబస్ భారం తగ్గించాలి.
9. అన్ని ప్రాథమిక పాఠశాలల్లోను ఒక సెకండరీ గ్రేడు పోస్టును గ్రేడు 2 భాషా పండితునిగా మార్చి నియమించాలి.
10. స్కూలు కాంప్లెక్సులు ఏర్పాటు చేయాలి.
11. అన్ని ప్రాథమిక పాఠశాలలకు అనుబంధంగా ప్రీ-ప్రయిమరీ పాఠశాలలు ప్రారంభించాలి.
12. విద్యాశాఖలలో వివిధ స్థాయి అధికారుల అధికారాలు వికేంద్రీకరించాలి.
13. ఇన్‌స్పెక్టరేట్‌ను బలపరచాలి.

## సామాజిక సమస్యలపై తీర్మానాలు.

1. దళితులపై దాడులు చేస్తున్న వారిని ప్రభుత్వం కఠినంగా శిక్షించాలి.
2. కుల వివక్షతావ్యతిరేక ప్రచారాన్ని ప్రభుత్వం జన్మభూమి కార్యక్రమంలోభాగంగా చేయాలి.
3. మౌలిక సమస్యలను పట్టించు కోకుండా దళితులను అడ్డం పెట్టుకొని రాజకీయ ప్రయోజనాలు పొందేవారి పట్ల ప్రజలు తగు జాగ్రత్త వహించాలి.
4. ఒక పథకం ప్రకారం మతోన్మాదం రెచ్చగొట్టడం, వివిధ ప్రభుత్వ సంస్థలలో మతోన్మాదులకు పెద్ద పీట వేయడం పట్ల ప్రజలు అప్రమత్తంగా వుండాలి.
5. అధికారం చేపట్టడానికి గాని, కొనసాగడానికి గాని, మతం ప్రాతిపదిక కారాదు.
6. వ్యక్తిగత విశ్వాసమయిన మతాన్ని, దేశప్రజల భవిష్యత్తుకు ముడిపడివున్న రాజకీయంతో కలుపరాదు.
7. మైనారిటీలపై దాడులు జరగకుండా ప్రభుత్వం నిర్దిష్ట చర్యలు తీసుకోవాలి. రాజ్యాంగం వారికి కల్పిస్తున్న హక్కులను మైనారిటీలు ఉపయోగించుకోడానికి చర్యలు తీసుకోవాలి.
8. ప్రజల సొమ్ముతో స్థాపించిన ప్రభుత్వ రంగ సంస్థలను ప్రయివేటీకరించే విధానాన్ని ప్రభుత్వాలు విరమించుకోవాలి.
9. భారత సార్వభౌమత్వానికి ప్రమాదకరంగా పరిణమిస్తున్న W.T.O ప్రపంచ బ్యాంకు ఒప్పందాలను రద్దు చేసుకోవాలి. వాటి షరతులకు తలవంచరాదు.
11. విదేశీ అప్పులు తగ్గించుకొని,స్థానిక వనరులను సమీకరించుకోవడం ద్వారా ఆర్థికాభివృద్ధి కొరకు కృషి చేయవలసినదిగా రాష్ట్రప్రభుత్వానికి విజ్ఞప్తిచేస్తూ తీర్మానిస్తున్నాం.
12. "విజన్ 2020" ప్రణాళికలో రాష్ట్ర ప్రజలకు హానికలిగించేవిగా మేధావులు పేర్కొన్న అంశాలను ఉపసంహరించుకొని ప్రత్యామ్నాయ మార్గాలు అవలంబించాలి.

## మహిళా సమస్యలు - తీర్మానాలు

1. మహిళా టీచర్లకు మరుగు దొడ్లు, మూత్రశాలలు ప్రత్యేకంగా అన్ని పాఠశాలల్లో నిర్మించాలి.
2. డిపార్టుమెంటు, వృత్తితో సంబంధం లేకుండా భార్యా భర్తలు ఒకే చోట ఉండుటకు బదిలీల జి.ఓ. సవరించాలి.
3. అవివాహిత ఉద్యోగి దాచుకొన్న సొమ్ము లేదా రిటైర్మెంటు బెనిఫిట్ ఆమె తల్లిదండ్రులతో సహా నామినేట్‌చేసిన వారికి చెల్లించుటకు అవకాశం కల్పించాలి.
4. వివాహిత మహిళల తల్లిదండ్రులను కూడ కొడుకులు లేనపుడు, కూతురు యొక్క కుటుంబ సభ్యులుగా పరిగణించాలి.
5. మహిళల పట్ల వివక్షతతో కూడిన పాఠ్యాంశాలు తొలగించాలి.
6. మెటర్నిటీ సెలవు ప్రారంభంలోనే మంజూరు చేసి నెల నెలా జీతాలు చెల్లించాలి. ఈ సౌకర్యం అన్ని మేనేజిమెంట్లకు వర్తింప చేయాలి.
7. ఎయిడెడ్ మహిళా ఉద్యోగులకు ప్రస్తుతం అమలులో ఉన్న 4 నెలల మెటర్నిటీ సెలవును వర్తింప జేయాలి.
8. బాలికలపై అత్యాచారాలు చేసిన వారిని కఠినంగా శిక్షించాలి
9. జిల్లా కేంద్రాలు, ముఖ్యపట్టణాలలో వర్కింగు వుమెన్స్ హాస్టళ్లు ఏర్పాటు చేయాలి.
10. మహిళల పట్ల సాంఘిక వివక్షతను అందరూ వ్యతిరేకించాలి.
11. మహిళలకు జనాభా ప్రాతిపదికన అన్ని చోట్ల రిజర్వేషన్ సౌకర్యాలు కల్పించాలి.
12. కుటుంబ, ఉద్యోగ బాధ్యతలు నిర్వహిస్తున్న కారణంగా మహిళలకు కులంతో సంబంధం లేకుండా పై చదువులకు స్టడీ లీవు 2 సం॥ లు మంజూరు చేయాలి.

## ఉపాధ్యాయుల సమస్యలపై తీర్మానాలు

1. ఉపాధ్యాయులకు చట్టబద్ధమైన బదిలీల కోడ్ అమలు చేయాలి.

2. అ) పి.ఆర్.సి. 99 లోని అసంబద్ధాలు సరిచేయడానికి రివ్యూ కమిటీని వెంటనే నియమించాలి.

ఆ) గ్రూపు 3 ఉపాధ్యాయులకు 1999 స్కేళ్ళలో అశాస్త్రీయంగా నిర్ణయించిన స్కేలు స్థానంలో రూ. 3,950-8,150 స్కేలును నిర్ణయించాలి.

ఇ) ముఖ్యమంత్రిగారు అంగీకరించిన మేరకు 1999 పి.ఆర్.సి.లో రద్దు చేయబడిన అదనపు యింక్రిమెంట్లు, కుటుంబ నియంత్రణ యింక్రిమెంట్లు,స్టాగ్నేషన్ యింక్రిమెంట్లు తక్షణం పునరుద్ధరిస్తూ జి.ఓ.లు విడుదల చేయాలి.

ఈ). 1998 జూన్ 30వ తేది రిటైరైన వారికి నూతన ఫిక్సేషన్ విధానం అమలు జరపాలి.

ఉ). 1998 జూలై 1999 ఏప్రిల్ మధ్య రిటైరైన వారికి నూతన గ్రాట్యుయిటీ, పెన్షను అరియర్సు చెల్లించాలి.

3. ప్రభుత్వ, పంచాయితీ రాజ్ ఉపాధ్యాయుల సర్వీసు రూల్సు జి.ఓ.లు 538,505 తగు సవరణలు చేసి అమలు చేయాలి.

4. ఎయిడెడ్ టీచర్లకు ట్రెజరీల ద్వారా జీతాలు చెల్లించే జి.ఓ. 62 ను యధాతదంగా అమలుచేయాలి.

5. పంచాయితీరాజ్ టీచర్లకు ట్రెజరీలద్వారా జీతాలు చెల్లించు జి.ఓ. 63ను సవరించి ప్రభుత్వ ఉపాధ్యాయులకు చెల్లించే పద్ధతిని అమలు చేయాలి.

6. ఎయిడెడ్ టీచర్ల ఆర్డినెన్స్ 5ను , శాసనసభలో ప్రవేశపెట్టిన బిల్లును ఉపసంహరించుకోవాలి. జి.ఓ 341, విద్య, తేది. 24-10-97 జి.ఓ. తేది నుండి మాత్రమే అమలు చేయాలి.

7. ఎయిడెడ్, మునిసిపల్ టీచర్ల పి.యఫ్‌ను జి.పి.యఫ్.గా మార్పు చేయాలి

8. ఎయిడెడ్, మునిసిపల్ టీచర్లకు గతంలో వున్న ప్రమోషన్ కోటాలు పునర్నిర్ణయించి జూనియర్ లెక్చరర్లుగా ప్రమోషన్ ఇవ్వాలి.

9. మునిసిపల్ టీచర్ల సర్వీసును ప్రావిన్షియలైజ్ చేసి ప్రమోషన్ సౌకర్యాలు కల్పించాలి.

10. మనిసిపల్ టీచర్ల జీతాలుకూడ ఎయిడెడ్, పంచాయితీరాజ్ టీచర్లకు వలె చెల్లించుటకు చర్య తీసుకోవాలి.

11. అ) అప్రంటీస్ స్టయిఫండ్‌ను 1999 స్కేళ్ళ ప్రాతిపదిక పైరెట్టింపు చేయాలి.

ఆ) అప్రంటీస్ టీచర్లకు అప్రంటీస్ కాలానికి నోషనల్ ఇంక్రిమెంట్స్ మంజూరుచేయాలి.

ఇ) అప్రంటీస్ విధానం రద్దు చేయాలి.

12. వృత్తి విద్యాటీచర్లకు గతంలో అంగీకరించిన విధంగా టైం స్కేలు యివ్వాలి.

13. ప్రత్యేక ఉపాధ్యాయులుగా పనిచేస్తున్న వారిని రెగ్యులరైజ్ చేయాలి.

14. 1986 తర్వాత నియమింపబడిన స్పెషల్ టీచర్లకు, హాఫ్-ఎ-మిలియన్ స్కీములో నియమింపబడిన టీచర్లకు కూడ జి.ఓ. 119ని వర్తింప చేయాలి.

15. అ) విద్యావాలంటీర్ టీచర్లకు సెలవు సౌకర్యాలు కల్పించాలి

ఆ) వారి సర్వీసుకు వెయిటేజి యివ్వాలి

ఇ) వేసవిలో పూస్టు చేయకుండా సర్వీసును కొనసాగించాలి.

ఈ) నెల నెలా రెగ్యులర్‌గా జీతాలివ్వాలి.

16. మెడికల్ ఇన్సూరెన్సు స్కీమును వెంటనే ప్రవేశ పెట్టాలి.

17. జూలై 99 మరియు 2000 జనవరిలో చెల్లించవలసిన కరవు భత్యం వాయిదాను విడుదల చేయాలి.

18. జి.ఓ. 1064 లోని లోపాలు సవరించి విడుదల చేయాలి.

19. పనిదినాలు ప్రాతిపదికగా ఉపాధ్యాయులకు సంవత్సరానికి

20 రోజులు సంపాదిత సెలవుమంజూరు చేయాలి.. జూనియర్ లెక్చరర్ ప్రమోషన్లకు అర్హులైన బి.యిడి.లు లేనపుడు కేటగిరీ 3 నుండి ప్రమోషన్లు కల్పించుటకు అనుమతించాలి.

21. అన్ని రకాల సెలవులు, ఇంక్రిమెంట్లు మంజూరు చేయు అధికారము అన్ని మేనేజిమెంట్ల సెకండరీ పాఠశాలల ప్రధానోపాధ్యాయులకు కల్పించాలి..

22. కుటుంబ కారణాలపై కమ్యుటేషన్ సెలవును వినియోగించుకొనుటకు అనుమతించాలి.

23. కృష్ణ తదితర మూడు జిల్లాలో ప్రయోగాత్మకంగా ప్రవేశపెట్టిన పెన్షను మంజూరు విధానం అన్ని జిల్లాకు ప్రవేశపెట్టాలి.

24. అ) L.T.C సౌకర్యం పంచాయతీరాజ్ టీచర్లకు ఈ సంవత్సరం అనుమతించాలి.

ఆ) ఎయిడెడ్,మునసిపల్ టీచర్లకు కూడా ఈ సౌకర్యం కల్పించాలి.

25. దశల వారీగా గ్రామీణ ప్రాంత పాఠశాలలకు అనుబంధంగా టీచర్సు క్వార్టర్సును నిర్మించాలి.

## గిరిజన సంక్షేమ ఉపాధ్యాయుల మరియు పాఠశాలల సమస్యలు - తీర్మానములు

1. గిరిజన సంక్షేమ శాఖలో పనిచేస్తున్న ఉపాధ్యాయులకు వెంటనే సర్వీసు రూల్స్ ప్రకటించాలి.

2. ప్రాథమిక పాఠశాలల ప్రధానోపాధ్యాయుల పోస్టులు భర్తీచెయ్యాలి. ప్యానల్ HM's పోస్టులను కూడా అర్హతగల వారిచే భర్తీ చెయ్యాలి.

3. GVVK ఆశ్రమ అనే తేడా లేకుండా GVVK ఆశ్రమ పాఠశాలలోని SGT ఉపాధ్యాయులందరికి కామన్‌సీనియారిటీ ప్రకారం లిస్టు ప్రకటించాలి.

4. B.Ed కేడరులోని ఉపాధ్యాయుల ఫైనల్ సీనియార్టి లిస్టు ప్రకటించాలి.

5. OBB, GIA ఉపాధ్యాయులకు ట్రెజరీ ద్వారా జీతాలు చెల్లించుటకు P.O.ITDA తగిన చర్యలు తీసుకోవాలి.

6 ఉపాధ్యాయులకు నిలుపుదల చేసిన ఏజెన్సీ అలవెన్సులు బకాయిలతో సహా చెల్లింపు ఉత్తర్వులు యివ్వాలనిP.O, ITDA ని డిమాండ్ చేస్తున్నాము.

7. అప్రంటీస్ GVVK ఉపాధ్యాయులకు P.O., ITDA ప్రకారం గ్రేడు నియామకము నుండి టైం స్కేళ్ళు మంజూరు చేయాలని డిమాండ్ చేస్తున్నాము.

8. GVVK, ఆశ్రమ పాఠశాలలు తనిఖీ పేరుతో ఉపాధ్యాయుల పట్ల అధికారుల అనుచిత వైఖరిని ఈ కౌన్సిల్ ఖండిస్తున్నది.

9. DEO (A) కార్యాలయంలో సమస్యల పరిష్కారం తీవ్ర జాప్యం అవుతుంది. దీనిని నివారించాలని, అవినీతిని అరికట్టే చర్యలు P.O. చేపట్టాలని కౌన్సిల్ డిమాండ్ చేస్తున్నది.

10. విద్యార్థుల సంఖ్యకు సరిపడు "క్రొత్త తరగతి భవనాలను" ఆశ్రమ ప్రాథమిక, ప్రాథమికోన్నత ఉన్నత పాఠశాలలను నిర్మించాలని ఈ సమావేశం తీర్మానం చేయడం జరుగుతున్నది.

11. ఆశ్రమ పాఠశాలలకు సరిపడే ఫర్నిచర్, ఆటల సామాగ్రి, గ్లోబు చార్టులు మరియు ఉపాధ్యాయులు నివశించడానికి "ఇండ్లు" నిర్మించాలని సమావేశం తీర్మానిస్తుంది.

12. ఆశ్రమ పాఠశాలలో 'Food charges' వెంటనే చెల్లించాలని తీర్మానించడమైనది. (గత కొన్ని నెలలుగా Hostel Bills చెల్లించడం లేదు)

13. GVVK, ఆశ్రమ పాఠశాల ఉపాధ్యాయులకు సరిపడినంతగా క్వార్టర్స్ నిర్మించాలి

14. ఆశ్రమ పాఠశాలల విద్యార్థులకు అత్యవసర వైద్య ఖర్చుల నిమిత్తమై APS లకు రూ. 2,000/- లు AVPS లకు రూ. 3,000/- AHS లకు రూ. 5,000/- ల నిధులు కేటాయించాలని P.O.ITDA లను ఈ కౌన్సిల్ విజ్ఞప్తి చేస్తున్నది.

15. GVVK, అనుటైటిల్ పేరును గతంలోలాగా T.W.P.S తో మార్పు చేస్తూ ఉత్తర్వులు యివ్వాలని ప్రభుత్వాన్ని కోరుతున్నాము.

## సింగరేణి ఉపాధ్యాయుల సమస్యలు

1. P.R.C. 99 నూతన వేతన స్కేళ్ళను అమలు చేయాలి.
2. సర్వీసు రూల్స్ వెంటనే ప్రకటించాలి.
3. సీనియారిటీ లిస్ట్ ప్రకటించాలి. వెంటనే ప్రమోషన్లు ఇవ్వాలి.
4. అదనపు అర్హతలకు ఇంక్రిమెంట్లు కోర్టు తీర్పు మేరకు అమలు చేయాలి.
5. పే అనామలీసును వెంటనే విడుదల చేయాలి.
6. ఖాళీగా నున్న ఎయిడెడ్ పోస్టులను వెంటనే భర్తీ చేయాలి.
7. సూప్రిజ్ H.R.A వెంటనే విడుదల చేయాలి.
8. ఏజెన్సీ అలవెన్సులను కోర్టు తీర్పు మేరకు అమలు చేయాలి.
9. ఫీజు రియంబర్సుమెంటు అమలుచేయాలి.
10. మీడియం వారీగా పాఠశాలలను విడదీసి - హెడ్ మాస్టరు పోస్టులను కల్పించాలి.
11. ఖాళీగా నున్న SGT పోస్టులను వెంటనే భర్తీ చేయాలి.

# ప్రశ్నోత్తరాలు

నిర్వహణ : కె. జోజయ్య, అధ్యక్షుడు .యు.టి.యఫ్

**శ్రీ పి. పాల్‌రాజ్, పి. ఆర్.పాలెం, గుంటూరు జిల్లా**

**ప్రశ్న :** అన్ ఎయిడెడ్ సర్వీసును యింక్రిమెంట్లకు, వేతన నిర్ణయమునకు పరిగణించరాదంటూ ప్రభుత్వం విడుదల చేసిన ఆర్డినెన్స్‌కు వ్యతిరేకంగా హైకోర్టు తీర్పు యిచ్చిందంటున్నారు. మేము కూడా కోర్టుకు వెళ్ళాలా ? వివరములు తెలియజేయండి.

**జవాబు :** మీరు వింటున్న హైకోర్టు తీర్పు 1999లో విడుదలైన ఆర్డినెన్స్ 5 లేక 9 వేసిన కేసుకు సంబంధించినదికాదు.

అన్‌ఎయిడెడ్ యింక్రిమెంట్లను గ్రాంట్-యిన్‌ఎయిడ్ మంజూరు సందర్భంలో పరిగణనలోనికి తీసుకొనుట జరిగినది గనుక ఆ సర్వీసును ఆటోమేటిక్ అడ్వాన్స్‌మెంటు స్కీముకు పరిగణనలోనికి తీసుకోవాలని కోరుతూ కొందరు అధ్యాపకులు, ఉపాధ్యాయులు 1995 పూర్వము నుండి హైకోర్టులో కేసులు వేశారు.

వారికి అనుకూలంగా హైకోర్టు తీర్పు యిచ్చినప్పటికి ప్రభుత్వం దానిని అమలు జరుపనందున పిటీషనర్లు తిరిగి ప్రభుత్వంపై " కంటెంప్ట్ ఆఫ్ కోర్టు" కేసు వేశారు.

ఆ కంటెంప్ట్ ఆఫ్ కోర్టు కేసు విచారణ సందర్భంగా "ఆర్డినెన్స్ 5 విడుదల అయినది గనుక హైకోర్టు తీర్పును అమలు పరచవలసిన అవసరం లేదు " అని ప్రభుత్వ న్యాయవాది వాదించారు. దానిపై ఆర్డినెన్స్ 5 లోని సెక్షన్ -2లో ఆటోమేటిక్ అడ్వాన్సుమెంట్ స్కీము ప్రస్తావనేది లేదు గనుక పై కేసులో యిచ్చిన తీర్పును యీ ఆర్డినెన్స్ రద్దు పరచజాలదు. అందుచే పైతీర్పును 3 మాసములలోగా అమలు జరపాలి" అని మొత్తం 37 బ్యాచీలకు వర్తించే విధంగా ది. 18-11-99 న హైకోర్టు తీర్పు నిచ్చింది. కనుక యీ తీర్పును ఆర్డినెన్స్ 5 లేక 9 మీద యిచ్చిన తీర్పుగా భావించరాదు.

దశాబ్దాలుగా ఎయిడెడ్ ఉపాధ్యాయులు అనుభవిస్తున్న సౌకర్యాన్ని రద్దుచేస్తూ యిచ్చిన ఈ ఆర్డినెన్స్‌పై యు.టి.యఫ్. ఆందోళన కార్యక్రమాలు చేస్తూనే, కోర్టు పిటీషన్ విషయమై కూడా ఆలోచిస్తూనే వున్నది. "ఆర్డినెన్స్‌ను చట్టం చేయుటకై ప్రభుత్వం 99 నవంబరులోనే శాసనసభలో బిల్లు ప్రవేశపెట్టింది. ఆర్డినెన్స్‌పై కోర్టులో కేసువేసినా అదిచట్టమైన తదుపరి మరల కేసు వేయవలసి వస్తుంది. కనుక అది చట్ట మయ్యే వరకు వేచి వుండటం మంచిది" అని సీనియర్ హైకోర్టు లాయర్లు యిచ్చిన సలహా మేరకు కోర్టు చర్యలు చేపట్టకుండా ఆగవలసి వచ్చినది.

**శ్రీ యన్. రామిరెడ్డి, కాకినాడ, తూ॥గో॥**

**ప్రశ్న :** ఎయిడెడ్ ఆర్డినెన్స్ బాధితులు 99 పి.ఆర్.సి. స్కేళ్ళకై ఆప్షన్ యిప్పటికి యివ్వలేదు. దాని వలన ఏమైనా నష్టం వుంటుందా ?

**జవాబు :** ఆప్షన్ సూత్రాల ప్రకారం 99 పి.ఆర్.సి.స్కేళ్ళ జి.ఓ. 114 ఆంధ్రప్రదేశ్ గజిట్ లో ప్రకటించబడిన ఆరు మాసములలోగా ఒక ఉద్యోగి ఆప్షన్ యిచ్చుకోవాలి. అట్లు సకాలంలో ఆప్షన్ యివ్వని వారి విషయములో 1-7-98 ని ఆప్షన్ తేదీగా యిచ్చినట్లు భావిచబడుతుంది. ప్రస్తుతము పొందుచున్న వేతనం ఆధారంగా 1-7-98 గాని, తదుపరి యింక్రిమెంటు తేదీకి గాని ఆప్షన్ యిచ్చి సంబంధిత అధికారులచే అటెస్టేషన్ చేయిస్తే వేతన స్థిరీకరణ ఎప్పుడు జరిగినా దానికి విలువవుంటుంది. ఆర్డినెన్స్ కారణంగాగాని, మరొక కారణంగాగాని 1-7-98 పూర్వమునుండి మూలవేతనం మార్పబడితే, అవసరాన్నిబట్టి అట్టి మార్పు ఉత్తర్వులు అందిన నెలలోగా రివైజ్డ్ ఆప్షన్ యిచ్చుకొనవచ్చును.

**పి.హెచ్.సిద్ధాంతి, వీరవాసరం, ప॥గో॥**

**ప్రశ్న :** 10-8-99 నాటికి గ్రేడ్ -1 స్కేలులో 16 సం॥ల సర్వీసు పూర్తి చేశాము. 16 సం॥ల ప్రమోషన్ స్కేలు పొందడానికి మాకు 45 సం॥ల వయసు మినహాయింపు వుంటుందా ? లేక ఏదైనా టెస్ట్ వ్రాయాలా ? తెలియ జేయగలరు.

**జవాబు :** ఒక ఉపాధ్యాయుడు 16 సం॥ ప్రమోషన్ స్కేలు పొందడానికి తదుపరి ప్రమోషన్ పోస్టు అర్హతలు కలిగివుండాలి అనేది మౌలిక నిబంధన. దీనది నుండి ప్రత్యేక మినహాయింపుగా కేటగిరి - III వారు పి.ఎ.టి., గ్రేడు - 1 పండితులు యస్.ఓ.టి. పాసైతే చాలుననే రాయితీని పొందడం జరిగింది. పబ్లిక్ సర్వీసు కమీషన్ నిర్వహించే డిపార్టుమెంట్ పరీక్షలనుండి మాత్రమే 45 సం॥ల వయసునిండిన వారికి మిహాయింపు వుంటుంది. కనుక మీరు యస్.ఓ.టి. పాస్ కావలసిన అవసరమున్నది.

**శ్రీ యన్. ప్రసాదరావు, వేంగిపాలెం, ప॥గో॥**

**ప్రశ్న :** 1983 సెప్టెంబరులో సె.గ్రే.గా నియమకం పొందిన నేను 16 సం॥ల స్కేలు పొందుటకు బి.యిడి. అర్హత కలిగి వుండాలా ? పి.ఎ.టి. పాసైతే చాలదా ?

**జవాబు :** స్పెషల్ ప్రమోషన్ స్కేలు పొందుటకు తదుపరి ప్రమోషన్ పోస్టు అర్హత లుండాలి అనే మౌలిక నిబంధన ననుసరించి కేటగిరి - III వారు అప్పటికప్పుడు బి.యి.డి. అర్హతలు సంపాదించడం ఆచరణ సాధ్యం కాదు గనుక ఆటోమేటిక్ అడ్వాన్స్‌మెంటు స్కీము క్రొత్తగా ప్రవేశ పెట్టిన తొలి రోజులలో బి.యిడి. అర్హతకు ప్రత్యామ్నాయంగా ఉపాధ్యాయ సంఘాలు పి.ఎ.టి.ని కోరడం జరిగింది. ఆమేరకు ప్రభుత్వం అంగీకరించి జి.ఓ. 78 ఆర్థిక, తేది : 13-3-84 (అ.ద-6 ,పేజి-65) ద్వారా ఉత్తర్వులిస్తూ 14-7-83 నాటికి సర్వీసులోవున్నవారికే యీ మినహాయింపు వర్తిస్తుందనతి షరతు విధించింది. ఆ షరతును తొలగించి ఆ తదుపరి వారికి కూడా ఆ మినహాయింపును వర్తింపజేయాలని ప్రభుత్వానికి ప్రాతినిధ్యము చేశాము. నేటి పరిస్థితులలో ప్రభుత్వం ఏ వైఖరి తీసుకొంటుందో చెప్పలేము గనుక మీరు బి.యడి. అర్హతలు పంపాదించే ప్రయత్నం చేయడం మంచిది.

**శ్రీ పి.యన్.యన్.రెడ్డి, పెనుగొండ, ప॥గో॥**

**ప్రశ్న :** బి.యిడి. అర్హతలు కలిగివుండి ఒక ఎయిడెడ్ హైస్కూలులో గ్రేడు - II ప॥గో॥ తెలుగు పండిట్‌గా పనిచేయుచున్న నాకు బి.యిడి. ఉపాధ్యాయునిగా ప్రమోషన్ పొందెడి అవకాశమున్నదా ?

**జవాబు :** అవకాశమున్నది. జి.ఓ. 167 విద్య, తేది : 9-3-84 (అధ్యాపకదర్శిని - 8, పేజి 208 ) ననుసరించి గ్రేడు - II పండిట్‌గా పనిచేస్తున్న మీరు తగిన అర్హతలు కలిగివున్నందున బి.యిడి. గా ప్రమోషన్ పొందుటకు అవకాశమున్నది.

## ఏది సంస్కృతి ? ఏది విధ్వంసం ?

-కె. కేశవరెడ్డి

భారతీయ - సంస్కృతి భ్రష్టు పట్టించబడుతుందని, దానిని సంరక్షించే బాధ్యత తమకు వుందని భావించిన కొందరు సంస్కృతి సంరక్షకులు, తమంతట తాముగా ఆ బాధ్యతను భుజాన వేసుకొని ఆందోళన పడుతూ ఆవేశపడుతూ సంస్కృతిని సరికొత్త చట్రంలో బిగిస్తూ దానికి భిన్నమైన దానిని కాల్చివేస్తాం, కూల్చివేస్తాం ధ్వంసం చేస్తామని చిందులు త్రొక్కుతున్నారు. ఎవరీ సంస్కృతి సంరక్షకులు ? వీరు దేనిని ధ్వంసం చేస్తున్నారు ? దేనిని సంరక్షించయత్నిస్తున్నారు. ?

ఇటీవల శ్రీమతి దీపామెహతా "వాటర్ సినిమా తీయడానికి సన్నద్ధమయ్యారు. చిన్న వయస్సులో భర్తలను కోల్పోయిన స్త్రీల దుర్భరజీవితాలు, వారు పడుపు వృత్తిలోనికి నెట్టి వేయబడుతున్న పరిస్థితులు - దీపామెహతా "వాటర్" ఇతివృత్తం. కథాకాలం 1930.

### కథాకాలం - వడుచు వితంతువుల స్థితి గతులు

వితంతువు ఇంట్లో వున్న అందరికీ ఊడిగం చేసే సజీవమైన పనిముట్టు. ఆమె అందరికంటే ముందు నిద్ర లేస్తుంది. అందరికంటే చివర పడుకొంటుంది. " వితంతువుని ఇంట్లో పెట్టుకొనడం పాముకి పాలు పోసి పెంచడం లాంటిదే. పాలు పోసిన చేతిని ఎప్పుడు కాటువేస్తుందో తెలియదు " - మాటిమాటికది అత్త చీదరింపులు నిరంతరం బాధలకు గురిచేయబడుతున్న ఆమె జీవితానికి మరణమే పరిష్కారం. విధవరాలుగా పుట్టినింటికి మెట్టినింటికి ఖ్యాతి తెచ్చే ఆమె చావుతో అందరి భారం దించినట్లువుతుంది " - ప్రముఖ చరిత్ర కారిణి ఉమా భారతి రచించిన " పండిత రమాబాయి జీవితం" నుండి.

" వేలాది మంది వితంతువులు మన మధ్య వున్నారంటే మనం ప్రేలడానికి సిద్ధం వున్న అగ్ని పర్వతం మీద కూర్చున్నట్లే" - మహా త్మాగాంధీ1920 దశకంలో వ్రాసిన మాటలు. " క్రుంగదీస్తున్న వైధవ్య భారాన్ని మోస్తున్న దుర్బల జీవులు".

దోపిడి అణచివేతలకు గురయి, పేదరికం ఆకలితో అలమటిస్తూ బతుకులు భారంగా గడుపుతున్న దయనీయమైన ప్రాణాల. కొడుకులు కూతుళ్ళు, అన్న దమ్ములు, తల్లిదండ్రులు - అందరిచేత తిరస్కృతులు బహిష్కృతులు. నిలువనీడని శాంతినీ వెతుక్కుంటూ కాశీ మధురలు చేరుతుంటారు" - ఇండియన్ ఎక్స్ప్రెస్.

### ఆమోదం పొందిన స్క్రిప్టు - అయినా తప్పని ప్రతిఘటన

దిపామెహతా సినిమా " వాటర్" స్క్రిప్టు కేంద్ర సమాచార ప్రసార మంత్రిత్వ శాఖ ఆమోదం పొందింది. షూటింగుకి అంతరాయం కలగకుండా సహకరించవలసిందిగా యు.పి.ఛీఫ్ సెక్రటరీ వారణాశి జిల్లా మెజిస్ట్రేట్‌ని ఆదేశించారు. "వాటర్" సినిమా భారతీయ సంస్కృతికి అపచారం చేస్తుందని సంస్కృతీ సంరక్షకులుగా తమని తాముగా ప్రకటించుకొన్నవారు ఆందోళన చేపట్టారు. పవిత్రమైన గంగా జలాన్ని "వాటర్" అనడం అపరాధమన్నారు. షూటింగుని అడ్డుకొన్నారు. అంతకుముందు ఇచ్చిన అనుమతిని యు.పి. ప్రభుత్వం రద్దుచేసింది. దీపామెహతా ఐ.బి. మంత్రిత్వ శాఖకు ఆశ్రయించారు. మంత్రిత్వశాఖ సూచనల మేరకు స్క్రిప్టులోని కొన్ని మాటలను మార్చడానికి దీపామెహతా అంగీకరించారు. షూటింగ్‌కి సన్నద్ధమయ్యారు. సంస్కృతీ సంరక్షకులు సెట్స్‌ని ధ్వంసం చేశారు. శాంతి భద్రతల పరిరక్షణ ముఖ్యం గనుక షూటింగు కొనసాగడానికి అనుమతిని నిరాకరించింది. యు.పి. రాష్ట్రప్రభుత్వం. కేంద్రప్రభుత్వం మౌన ప్రేక్షక పాత్ర వహించింది. ఈ సంస్కృతీ సంరక్షకులంతా ఆర్.యస్.యస్, దాని అనుబంధ సంస్థల కార్యకర్తలు. వీరి విధ్వంసక చర్యలను బి.జె.పి. జాతీయ స్థాయి నాయకులు సమర్థించారు.

### మహిళల పట్ల సంస్కృతీ సంరక్షకుల దృక్పథం

అతి సాధారణ సంఘ సంస్కరణ చర్యగ పేర్కొని నెహ్రూ ప్రవేశపెట్టిన హిందూ కోడ్ బిల్లుని ఇలాంటి సంస్కృతీ సంరక్షకులే గతంలో వ్యతిరేకించారు. ఈ బిల్లు హిందూ సంస్కృతీసాంప్రదాయాల పునాదుల కదిలిచివేస్తుందని గగ్గోలు పెట్టారు. శతాబ్దాల తరబడి సంకెళ్లలో వున్న స్త్రీవిముక్తి పట్ల వారి వైఖరి అది. సమాజంలో అన్నీ మార్పులకు గురవుతున్నప్పటికి స్త్రీలస్థితిగతులు మాత్రం మను ధర్మశాస్త్రంలో చెప్పినట్లు కలకాలం వుండితీరాలని తరచుగా వాటిని ఉటంకిస్తుంటారు. ఇటీవల యిలాంటి శక్తులు బలాన్ని పుంజుకొంటున్నాయి.

మానిక్ సర్కార్ ఊర్వశి బటాలియాల విమెన్ అండ్ హిందూరైట్స్ పేరుతో వచ్చిన వ్యాసాల సంకలనంలో " దేశాన్ని పాలించడానికి శక్తి వంతమైన కేంద్రీకృతమైన నాయకత్వం ఎంత అవసరమో కుటుంబవ్యవస్థలో పురుషాధిక్యత కొనసాగడం అంత అవసరం "

"బలమైన స్త్రీ అంటే శారీరకంగా బలంగా వుండాలని కాదు , కుటుంబంలో ఆమె స్వేచ్ఛగా వ్యవహరించాలని కాదు. కుటుంబ సంరక్షణ ఆమె ప్రధాన బాధ్యత. అందుకని ఆమె వ్యక్తిగత స్వేచ్ఛని పణంగా పెట్టి కుటుంబ సంక్షేమంకొరకు పనిచేయాలి".

స్త్రీని ఇంటికి పరిమితం చేయాలంటారు. స్త్రీల యధాతధ స్థితిని కొనసాగించడమే గాక కొన్నివేల ఏళ్ల కాలాన్ని వెనక్కినెట్టి ఆ పరిస్థితులలో స్త్రీలను ఎల్లకాలం వుంచాలంటారు.

(సశేషం)

